అపరాధ పరిశోధన అనుబంధం—50

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## చట్టం-ధర్మం

2-9-78

రచన: వసుంధర

20

## మర్డర్ కాల్

రచన: మల్లేశ్వరరావు

## మృత్యుశిఖరం

రచన: యస్. గీతారాణి

## జగత్ కిలాడీలు

రచన: అజీజ్

'శాన్యోరా' సీరియల్ - 15 వ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—50
ఫిబ్రవరి, 1978
వెల : 3-00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు



కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

గిడా రంగారావు

# చట్టం-ధర్మం

## వసుంధర

ఒక సామాన్యమైన గుమస్తా బ్రహ్మాండమైన బంగళాలో నివసిస్తూ, ఖరీదైన జీవితాన్ని గడుపుతూ, అత్యాధునిక దుస్తులు ధరిస్తూ, అందమైన కారులో ఆఫీసుకు వెళ్ళి వస్తూంటే ఎవ్వరూ సహించలేరు. గుమాస్తాగాడి కెంత పొగరు? అనికూడా అనుకుంటారు.

గుమస్తాకు ఖరీదైన అందమైన జీవితం సాధ్యం కాకపోవచ్చు. కానీ అతని సంతానం అపురూప సౌందర్యానికి నోచుకుంటే అది అతని గొప్పతనం కాదు. విధివిలాసమని అనుకోవాలి.

రాణిని చూసినవారందరూ ఆమె వెంకన్న పంతులు ఇంట పుట్టదగినది కాదని అనుకుంటూంటారు. ఆమె

సౌందర్యాన్నీ, లావణ్యాన్నీ, రూపురేఖల్నీ ఇప్పటికే ఎందరో చూసి తరించిపోయారు.

రాణి చిన్నతనంలో వెంకన్న పంతులు గురించి ఎవరికీ తెలియదు. కానీ ఆమె పెరిగి పెద్దదై రూపురేఖలు సంతరించుకోవడం ఆరంభమైనప్పట్నించీ—అందరికీ వెంకన్న పంతులు గురించి మాత్రమేకాక అతని కుటుంబ వివరాలు కూడా తెలిసిపోయాయి.

వెంకన్నపంతులుది సామాన్యమైన జీవితం. రాణి సౌందర్యానికి అతను కట్టిన విలువను పేరులో మాత్రమే ప్రకటించుకోగలిగాడు. రాణికాక అతనికింకా ఇద్దరు పిల్లలున్నారు. ఇద్దరూ మగపిల్లలే—రాణి తర్వాతివాళ్ళే!

వెంకన్న పంతులుకో రోగిష్ఠి తల్లి ఉంది. అతని ఆదాయాన్ని సగానికిపైగా ఆవిడ రోగమే మింగుతోంది. వెంకన్న పంతులు భార్య చాలా మంచిది. ఏదో ఒక రోజున అదృష్టం తిరుముకు వస్తుందని భర్తకామె ధైర్యం చెబుతూంటుంది. అవి కేవలం ఊరటకోసం చెప్పే మాటలని ఆమెకూ భర్తకూ కూడా తెలుసును.

రాణిని కన్నది వెంకన్నపంతులైనందుకు చాలామంది తిట్టుకుంటూంటారు—అది వెంకన్నపంతులు చేసిన తప్పు కాదని తెలిసికూడా. అయితే సంతోషించినవారూ లేకపోలేదు. అలాంటి ఇంట పుట్టిన అందమైన ఆడదాన్ని లొంగదీసుకోవడం చాలా సులభమని అభిప్రాయపడ్డ శాపతువాళ్ళు.

ఏదిఏమైనా వెంకన్నపంతులుఇంట అంతటి అపురూప సౌందర్యం ఉండడం చాలామందికి నచ్చలేదు. పోనీ ఆ

సౌందర్యాన్నయినా వెంకన్నపంతులు కాలేజీలో చదివించడంకానీ, టైపు నేర్పించడంకానీ, ఉద్యోగంలో జేర్పించడంకానీ చేశాడా? ఏమీ చేయలేదు. స్కూలు ఫైనలుదాకా చదివించి ఇంట్లో కూర్చోపెట్టాడు.

వెంకన్నపంతులు అలా చేయడానికి చాలా కారణాలున్నాయి. కూతుర్ని బాగా పైకి చదివించే శక్తి అయనకు లేదు. ఏ టైపో నేర్పించి కూతుర్ని ఉద్యోగంలో జేర్పించి ఆ డబ్బుతో తనకు గల ఇబ్బందుల్ని తీర్చుకునే అభిప్రాయమాయనకు లేదు. కూతురు చదువుకోసం డబ్బు వృధా చేయదల్చుకోలేదు. ఆ డబ్బుతో ఆమె పెళ్ళి చేయాలని ఆయన ఉద్దేశ్యం. అలాగని ఆ డబ్బాయనవద్ద సిద్ధంగా లేదు. చదివించాలంటే ఎక్కణ్ణించేనా డబ్బు తీసుకురావాలిగదా— ఆ డబ్బు పెళ్ళికి ఉపయోగిద్దామని ఆయన ఉద్దేశ్యం.

క్లియోపాత్రాకోసం ఎన్నో యుద్ధాలు జరిగేయంటారు. చరిత్ర తిరగేస్తే అందంకోసం చాలా యుద్ధాలు జరిగేయంటారు. అంటే దానికంత గౌరవం లభిస్తుందన్నమాట. అందంకోసం మగవాళ్ళలా పోటీలు పడతారన్నమాట.

అయితే రాణి ఇంత అందంగా ఉంటుంది గదా— ఆమె సంగతేమిటి?

రాణికోసం యుద్ధాలు జరగడంలేదు. ఎవ్వరూ పోటీలుపడడంలేదు. ఆమె సౌందర్యం చూసి ఎందరో లొట్టలు వేస్తూండి ఉండవచ్చుగాక. పెళ్ళి అనేసరికి ఆమె కట్నం రూపేణా కొంత రొక్కం ఇస్తేకానీ— ఏ మగవాడూ సిద్ధపడడంలేదు.

రాణి తన పదిహేనోఏట స్కూలు ఫైనల్ ప్యాస యింది. అప్పట్నించీ తండ్రి ఆమె పెళ్ళిగురించి ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు. ఇప్పుడామె వయస్సు పధ్ధెనిమిదేళ్ళు. ఇంకా ఆయన ప్రయత్నాలు కొనసాగుతూనే ఉన్నాయి.

అందానికి ఉన్న గౌరవం ఈ దేశంలో ఇదేనా? చరిత్రలోని విషయాలు చరిత్రకే పరిమితమైయాయా? — అని ఎవరైనా అడిగితే సమాధానముంది. చరిత్రలోని విషయాలిప్పటికీ జరుగుతూనే ఉన్నాయి. అయితే చరిత్రలో మగవాళ్ళ నాకర్షించినది ఆ అంద మొక్కటే కాదు. ఆ అందమైన ఆడవాళ్ళందరూ సామాన్యులు కారు. గొప్పవాళ్ళు. రాచకుటుంబీకులు. డబ్బున్నవాళ్ళ అందానికి మాత్రమే ఈ ప్రపంచంలో పోటీలు జరుగుతాయి.

రాణి అందంకోసం మగవాడు పోటీపడాలంటే ఆమె వెనుక డబ్బు ఉండాలి. అంతవరకూ ఆమె అందానికి గుర్తింపు లభించవచ్చుకానీ — దానికోసం పోటీలు మాత్రం జరగవు. ఆ విధంగా వెంకన్నపంతులు కూతురు కావడం ఆమె చేసిన తప్పు.

అయితే మరో విధంగా కూడా వెంకన్నపంతులు కూతురుకావడం ఆమెకు శాపమయింది. అది వెంకన్న పంతులు చాదస్తమూ, పూర్వాచారపరాయణత్వమూ. ఆయన ఏ పరిస్థితుల్లోనూ తన కూతురునింకో కులంవాడికివ్వడానికి ఒప్పుకోడు.

## 2

గంగారావుకి డబ్బుంది. బాధ్యతలులేవు. వయసుంది. హద్దులు లేవు.

గంగారావు వయసు ఇరవైకీ పాతికీ మధ్య. అతనికి తెలివి ఉందికానీ చదువు లేదు. తండ్రి రెండుచేతులా సంపాదించేస్తున్నాడు. తలిదండ్రులకు లేక లేక కలిగిన కొడుకు కావడంవల్ల అమితగారాబంగా పెరిగాడతను. ఏబాధ్యతలూ తీసుకోనవసరంలేకుండా, ఎవరిమీదనూ ఆధారపడకుండా కొడుకు జీవితంలో సుఖపడాలన్న కోరికతో అతని తండ్రి మరీమరీ సంపాదించేస్తున్నాడు. సంపాదించడం ఆయనకు బాగా తెలిసిన విద్య.

గంగారావు తరుచుగా సినిమాలు చూస్తాడు. సినిమాల్లో హీరోలా తన జీవితం గడపాలని అతని కోరిక. అందుకు కావలసిన హంగులన్నీ అతనికి ఉన్నాయి- ఒక్క హీరోయిన్ తక్కువ.

గంగారావుకో అంటే కోటిమంది ఆడవాళ్ళు. అందు కని తరచుగా అతను కో అంటూనే ఉంటాడు. అతని పిలుపుకు అందమైన ఆడవాళ్ళు రెస్పాన్స్ ఇస్తూనే ఉంటారు. తగిన ప్రతిఫలం అందాక అతను వాళ్ళను వదల్చుకుంటూ ఉంటాడు. తన డబ్బుమీద నేకానీ తన మీద వారికి ప్రేమ లేదని అతనికి అనిపిస్తూందేది. తన ఆశయాలకు తగ్గ ఆడపిల్లకోసం వెతుకుతున్నానని అత ననుకుంటూంటాడు. తన ఆశయాలేమిటో అతనికే స్పష్టంగా తెలియదు. కానీ పిల్ల అందంగా ఉండి, సుల భంగా తనకు లొంగకపోతే అతను చాలా సంతోషి స్తాడు.

ఒకరోజున గంగారావు స్కూటర్‌మీద నగర విహారం చేస్తున్నాడు. హఠాత్తుగా అతని స్కూటర్ ట్రబులిచ్చింది. గంగారావు స్కూటర్ దిగి పరీక్షించాడు.

ట్రబులేమిటో అర్థమయింది. అతి సరి రెక్టిఫై చేసేక అసలు అద్భుతం చూశాడు.

ఒక అందమైన ఆడపిల్ల అతన్నీ స్కూటర్నీ పరిశీలనగా చూస్తోంది. అలా ఎంత సేపట్నించి చూస్తోందో తెలియదుకానీ__అంత అందమైన పిల్ల తన ఇంటిముందు నిలబడి తనను చూస్తూంటే ఆ చూపులు తనకు తగులుతున్నా ఎందుకు తెలియలేదు? వెధవ స్కూటర్ రిపేరు చేస్తూ ఎలా గడిపాడు?

ఇలా బాధపడుతూ గంగారావు ఆ ఇంటిని సమీపించి "కాసిని మంచి నీళ్ళిప్పించగలరా?" అంటూ ఆ అమ్మాయిని పలకరించాడు. ఆ అమ్మాయి తడబడినా సర్దుకుని లోపలకు వెళ్ళిపోయింది.

'ఈ నగరంలో నాకు తెలియకుండా ఇంతటి మహా సౌందర్యముందా?' అని ఆశ్చర్యపోయాడు గంగారావు. ట్రబులిచ్చిన స్కూటర్ని మనసులోనే అభినందించుకున్నాడు. ఆమెను పలకరించడంకోసం,ఆమె నోటిమాట వినడంకోసం గంగారావామెను మంచినీళ్ళడిగాడు.

అయితే అతని కోరిక ఫలించలేదు. ఎవరో ఒక చిన్న కుర్రాడు మంచినీళ్ళు తెచ్చి ఇచ్చాడు. గంగారావు మాట్లాడకుండా మంచినీళ్ళందుకుని తాగేశాడు. తర్వాత కుర్రాణ్ణి అడిగి వాళ్ళ నాన్నగారి పేరూ, వివరాలూ తెలుసుకున్నాడు. ఇల్లూ, పరిసరాలూ ఇంటి నంబరూ గుర్తుంచుకున్నాడు. తిరిగి స్కూటర్ దగ్గరకు నడిచాడు.

## 3

"ఆమె పేరు రాణి. తండ్రి వెంకన్నపంతులు. రాణి కాక ఇంకా ఇద్దరబ్బాయిలున్నారు వెంకన్నపంతులుకి.

వాళ్ళది అంతంతమాత్రం జీవితం. అవునా?'' అన్నాడు ప్రసాద్.

''అవును'' అన్నాడు గంగారావు.

ప్రసాద్, రంగారావుకు అంతరంగిక స్నేహితుడు. అతనికి వేరే ఉద్యోగమేమీ లేదు. కానీ రంగారావు చలవ వల్ల అతను చాలామంది ఆఫీసర్ల కంటె ఎక్కువే సంపాదిస్తున్నాడు. ధనవంతులబిడ్డలతో సమంగా విలాసాలనుభవిస్తున్నాము.

ప్రసాద్ గంగారావుకు అంతరంగికుడైనప్పటికీ అతనికి తన హద్దులు తెలుసును. అతను చాలా తెలివైనవాడు. తన స్థానమేమిటో తెలిసి మసులుకుంటూ గంగారావుకు అనేక వ్యవహారాల్లో సలహాలిస్తూంటాడు. అతని సలహాలు కూడా గంగారావుకు చెడునడతకు ప్రోత్సాహించే విధంగా ఉండవు. సేఫ్టీ ఫస్టు అన్న పద్ధతిలో అతనిచ్చే సలహాలు గంగారావుకు బాగా నచ్చుతూంటాయి. గంగారావు తండ్రికి కూడా ప్రసాద్ మీద సదభిప్రాయం ఉంది.

రాణిని చూడగానే మనసును పారేసుకున్న గంగారావు ఆమె వివరాలను తన మిత్రుడి కందించి ఆమె ఎలా తనకు వశమవుతుందో చూడమని కోరాడు. ప్రసాద్ ఆ పనిమీద వెళ్ళి ఇప్పుడే వచ్చాడు. అతనేం చెబుతాడో నని ఆత్రుతగా ఎదురుచూస్తున్నాడు గంగారావు.

''ఏమీ లాభంలేదు. ఆమె డబ్బుకు లొంగే మనిషి కాదు. మధ్యతరగతికి చెందిన ఏ తలిదండ్రుల చాటు ఆడపిల్లా డబ్బుకు లొంగదు. వాళ్ళ ఊహలూ, కలలు వేరు—...'' అన్నాడు ప్రసాద్.

"ఎలా తెలుసుకున్నావ్?"

"ఆ అమ్మాయిని కలుసుకుని మాట్లాడడమే గగనమై పోయింది. రెండ్రోజుల్నించి అవకాశంకోసం ఎదురు చూస్తున్నాను. నిన్నసాయంత్రం గుడివద్ద ఒంటరిగా దొరికింది. అమ్మానాన్నలతోపాటు గుడికి వచ్చింది. అక్కడ వాళ్ళేమో దేవుడికి పూజ చేయిస్తున్నారు. ఈమె కాసేపు బయటకు వచ్చింది. పలకరించాను. బెదిరిందికానీ పారిపోలేదు.

"మీ పేరు రాణికదూ అన్నాను. ఎలా తెలుసునని ఆశ్చర్యపోయింది. నాకు జోస్యం తెలుసునన్నాను. నెమ్మదిగా ఆ మాటా ఈ మాటా చెప్పి అంత అందమైన తన మెడలో నగలు లేకపోవడం బాగోలేదన్నాను. తమకు డబ్బు లేదంది. డబ్బుకేముంది — నేనే ఇస్తానన్నాను.

నా ఉద్దేశ్యం అర్థంకాక నా మంచితనానికి ఆశ్చర్యపడుతూ ఉత్తినే డబ్బు తీసుకుంటే వాళ్ళ నాన్నగారు దెబ్బలాడతారంది. ఉత్తినే అక్కర్లేదు—నా స్నేహితుడున్నాడు. అతనికి మెదడు సరిగాలేదు. అందమైన ఆడపిల్ల పక్కనుండి కబుర్లు చెబితే కొన్ని రోజుల్లో జబ్బు నయం కావచ్చునని డాక్టర్లు చెప్పారన్నాను. పరిస్థితి విని చాలా జాలిపడింది. ఆమె కళ్ళలో నీళ్ళు కూడా కనబడ్డాయి.

అన్నీ అయ్యేక, తడికంఠంతో, ఇంకో పదినిముషాల్లో పూజ అయిపోతుందనీ—వాళ్ళ నాన్నగారితో మాట్లాడమనీ చెప్పింది. పది నిముషాల్లోనే పూజ అయిపోతుందని తెలియగానే నేను కంగారుపడి సెలవు తీసుకుని ఆమె

దగ్గర్నుంచి బయటపడ్డాను. బయటపడేముందు నేనిలా మాట్లాడినట్లు వాళ్ళ నాన్నగారికి చెప్పవద్దన్నాను. ఎందుకూ అంది ఆశ్చర్యంగా. ఆ ఆశ్చర్యం చాలు ఆమె అమాయకత్వాన్ని తెలియబర్చడానికి..." అన్నాడు ప్రసాద్.

గంగారావు మిత్రుడివంక అభినందనపూర్వకంగా చూసి "నువ్వు చాలా తెలివిగా వ్యవహరించావు. కానీ ఆ అమ్మాయి నాకు దక్కుతుందన్న ఆశ ఇంకా నాకుంది. ఎందుకంటే నాకు అనారోగ్యమని తెలియగానే ఆమె కళ్ల నీళ్ళు తిరిగాయన్నావు. ఆమెను వశం చేసుకోడానికి బహుశా జాలి సంపాదించాలనుకుంటాను_..." అన్నాడు.

ప్రసాద్ ముఖం గంభీరంగా అయిపోయింది. "మై డియర్ ఫ్రెండ్! నీకు నేను చాలాసార్లు చెప్పాను. అమాయకుల్ని మనం వంచించకూడదు. డబ్బుకులాంగే వాళ్ళను డబ్బుతో కొనవచ్చు. కానీ మోసంతో మాత్రం ఎవర్నీ లొంగదీసుకోకూడదు. రాణి చాలా అమాయకురాలు. స్వచ్ఛమైన జీవితాన్ని కోరుతోందామె. ఆమె అందానికీ, అమాయకత్వానికీ బహుమానంగా లభించవలసినది మోసం కాదు, ప్రేమ__"

ప్రేమ_అనగానే గంగారావు వులిక్కిపడ్డాడు. తను చాలా కాలంగా ఒక జీవిత భాగస్వామికోసం ఎదురు చూస్తున్నాడు. తను ఎదురుచూస్తోన్న హీరోయిన్ ఈమే యేమో!

అందం, అమాయకత్వం, పవిత్రత, డబ్బుపట్ల నిర్లక్ష్యం_ఇవీ తను కోరుకుంటున్న స్త్రీకుండవలసిన

లక్షణాలు. ఇవన్నీ రాణిలో ఉంటే తను ఆమెనే జీవిత భాగస్వామిగా చేసుకోవచ్చు.

గంగారావు ఆలోచించి "అయితే నేను రాణిని వివాహం చేసుకుంటాను ప్రసాద్..." అన్నాడు.

ప్రసాద్ ఆశ్చర్యపడలేదుకానీ "నీ నుంచి ఇలాంటి మాట వినాలని నీ తలిదండ్రులు చాలా కాలంగా ఎదురు చూస్తున్నారు. అందువల్ల నీ నిర్ణయం మంచిదే. అయితే చాలాకాలం తర్వాత, ఎంతోమందిని కాదన్నాక తీసుకుంటున్న ఈ నిర్ణయం క్షణికావేశంలో తీసుకున్నదిగా కాక_జీవితాంతం గర్వపడవలసినదిగా ఉండాలి..." అన్నాడు.

"నా నిర్ణయం క్షణికావేశంలో తీసుకోబడినదని ఎందుకు అనుమానిస్తున్నావ్?" అన్నాడు గంగారావు.

"నువ్వు ఆ రాణిని వివాహం చేసుకోవాలని మొదట్లో అనుకోలేదు. ఆమెను డబ్బుతో పొందాలనుకున్నావు. అది సాధ్యంకాదని తెలిసేక వివాహానికి సిద్ధపడ్డావు..." అన్నాడు ప్రసాద్.

గంగారావు గొప్పగా నవ్వాడు. "రాణిని చూడగానే ఆమే నేనింతకాలమూ ఎదురుచూస్తున్న స్త్రీ అని తోచింది. అందుకే వెంటనే ఆమెను వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. అయితే ఈలోగా ఒక సారి ఆమెను పరీక్షించాలనుకున్నాను. అందుకే నిన్నిలా కోరాను..."

మిత్రుడిమాటలమీద ప్రసాద్‌కు నమ్మకం కలగలేదు. అయినా తన అపనమ్మకాన్ని పైకి వ్యక్తపరచకుండా__ "ఎలాగైనా నువ్వసాధ్యుడివి!" అన్నాడు.

గంగారావు గర్వంగా నవ్వి- "నేను అసాధ్యుడినే- నీ మూలంగా నాకు సాధ్యంకాని పనంటూ లేకుండా పోయింది. ఈ పెళ్ళికూడా నువ్వే సాధించాలి" అన్నాడు.

# 4

"కనీసం అప్పుతీర్చడానికైనా బియ్యం వేయించు కోవాలండీ. పిల్లవాడి ప్రాణాలు నిలబెట్టడానికైనా ఒక పాలడబ్బా కొనాలి..." అంది సుశీల.

భాస్కర్రావు నిట్టూర్చాడు. అతనికి సుశీల చెప్పిన విషయాలు ఆమె చెప్పకమునుపే తెలుసు. కానీ అతడు అసహాయుడు.

ఏడెనిమిది నెలలక్రితం వరకూ భాస్కర్రావు పరిస్థితి మరీ ఘోరంగాలేదు. ఏదో చిన్న ఉద్యోగం చేసుకుంటూ ఉన్నంతలో పీడన పడకుండా ఎలాగో మర్యాదగా రోజులు వెళ్ళబుచ్చేవాడు.

ఏడెనిమిది నెలలక్రితం అతను లంచం పట్టడానికి నిరాకరించాడు_ఒక ముఖ్యమైన విషయంలో. ప్రతికక్షి సామాన్యుడుకాదు. ఊళ్ళో చాలా పలుకుబడిఉన్న పెద్ద మనిషి. కేవలం ఒక చిన్న ఉద్యోగస్తుడి కారణంగా ఆయన పెద్దతనానికి సవాల్ ఏర్పడింది. ఫలితంగా లంచం పట్టని నేరానికి భాస్కర్రావు లంచగొండిగా తీర్మానించ బడ్డాడు. అతను ఉద్యోగంనుంచి డిస్మిస్ అయిపోయాడు.

భాస్కర్రావుకి నిండా పాతికేళ్ళు లేవు. ఇరవైఏళ్ళ సుశీల అతని భార్య. పదకొండునెలల కొడుకు. వుద్యోగం పోయేటప్పటికి అతని పరిస్థితి అది.

ఏడెనిమిది నెలలుగా భాస్కర్రావు ఎన్నో ప్రయ త్నాలు చేస్తున్నాడు_ఏదో విధంగా డబ్బు సంపాదించా

లని. ఆఖరికి అంతకాలంగా ఉన్నాయనుకున్న మానాభి మానాలను కూడా వదులుకుని కూలిపని చేయాలను కున్నాడు. కానీ అక్కడకూడా అతను సఫలీకృతుడు కాలేకపోయాడు. ఆ వృత్తిలో సెటిలైపోయిన వారిదగ్గ ర్నుంచి ప్రతిఘటన తీవ్రంగా వచ్చింది.

'నా బ్రతుకు, జీవితం అన్నీ వుద్యోగంమీద ఆధార పడిపోయి ఉన్నాయా? ఉద్యోగం లేకపోతే నేను ఎందుకూ పనికిరానివాడినా...' అనుకుని భాస్కర్రావు బాధపడ్డాడు. అతను బాధపడినా అది నిజం మరి!

ఈ ఏడెనిమిది నెలల్లోనూ భాస్కర్రావు కొద్దిగా ప్రయివేట్లూ, ఒకటి రెండు గుకాణాల్లో పద్దులు రాసే పని కుదుర్చుకోగలిగాడు. వీటివల్ల అతనికి లభించే సంపా దన అంతంతమాత్రంగా వుంది. ఆ డబ్బుతో ఇంటి అద్దె కట్టాలా-పిల్లవాడి పాలడబ్బాలు కొనాలా-దినవెచ్చాలు సరిపెట్టుకోవాలా అన్నది ఆ దంపతులకు పెద్ద సమస్యగా ఉంటూ వచ్చింది.

ఎన్ని ప్రయత్నాలు చేసినా భాస్కర్రావుకింకే ఉద్యోగమూ దొరకడంలేదు. తనమీద ఆధారపడ్డ దేవత లాంటి భార్య ఇప్పుడు దెయ్యంలా కనబడుతోంది. పండులా ఉండే కొడుకు ఎండిపోతున్నాడు. వాళ్ళిద్దర్నీ చూస్తూంటే భాస్కర్రావుకు రంపపుకోతగా వుంటోంది. ఏంచేయాలో తెలియదు. ఏమీ చేయలేడు. బెంగతో అతనూ క్షీణించిపోతున్నాడు.

బాగా ఆలోచించి భాస్కర్రావు ఓ నిర్ణయానికి వచ్చాడు. తను సంపాదించి భార్యాబిడ్డలను పోషించ గలుగుతాడనుకోవడం కల్ల. తను లేకపోతే సుశీల

పుట్టింటికైనా వెళ్ళిపోతుంది. అక్కడ ఆమె సుఖపడుతుందా, లేదా అన్నది వేరే సంగతి. తన కళ్ళముందే ఆమె కష్టపడుతుంటే చూడలేకపోతున్నాడు. ఆ బాధ తప్పుతుంది.

భాస్కర్రావు ఆత్మహత్య చేసుకోవాలనే నిర్ణయానికి వచ్చాడు.

# 5

"నమస్కారమండీ–" అన్నాడు ప్రసాద్.

"నమస్కారం. కాని మీరెవరో నాకు తెలియదు..." అన్నాడు వెంకన్నపంతులు.

"ఇప్పుడు తెలుస్తుందిలెండి–" అంటూ అకోలా నవ్వాడు ప్రసాద్.

వెంకన్నపంతులు ఆట్టే మాట్లాడకుండా అలాగే ప్రసాద్ వంక చూస్తూ ఉండిపోయాడు.

ప్రసాద్ మళ్ళీ ప్రారంభించాడు. "ఒక కోటీశ్వరుడి కొడుకు మీ అమ్మాయిని వివాహం చేసుకోవాలని ఆశ పడుతున్నాడు."

వెంకన్నపంతులు ఆశ్చర్యంగా– "మీరు పెళ్ళిమాటలకు వచ్చారా?" అన్నాడు.

"అవునండీ. అతనికి కానీ కట్నం అవసరంలేదు. పెళ్ళికి ఉభయఖర్చులూ తనే భరిస్తాడు. తల్లీతండ్రీ వున్నారు. గౌరవనీయమైన కుటుంబానికి చెందినవాడు. సమాజంలో మంచి హోదాలో ఉన్నాడు. మీ అమ్మాయిని నేలమీద నడవనివ్వడు."

వెంకన్నపంతులు కళ్ళు చెదిరాయి. ప్రసాద్ మాట్లాడుతూంటే ఆయన ఊహల్లో కూతురు పెళ్ళి మెదిలింది.

వైభవంగా ఆమె జీవితం కళ్ళముందు కదిలింది. అప్పుడే ఆయనకో చిన్న అనుమానం వచ్చింది. "అబ్బాయి వయ సెంత?"

"పాతిక్కిలోపే..." అన్నాడు ప్రసాద్.

వెంకన్నపంతులుకు చాలా ఆశ్చర్యంవేసింది. వెతుక్కుంటూ ఇంత మంచిసంబంధం తన ఇంటికి రావడమా? ఎక్కడో లోపం ఉండి వుండాలి...

"ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోవద్దు. అబ్బాయికి కన్ను, ముక్కు అన్నీ సరిగ్గా ఉన్నాయా?" అన్నాడు పంతులు.

ప్రసాద్ ముఖంలో కోపం కనిపించింది- "వెతుక్కుంటూ వచ్చి అడిగామని మీరు చాలా హీనంగా ఆలోచిస్తున్నట్లున్నారు. పెళ్ళికొడుక్కి చాలా మంచి సంబంధాలు వచ్చాయి. రంభల్లాంటి వాళ్ళనూ, కోటీశ్వరుల పిల్లలనూ కాదన్నాడతను..."

"నా ప్రశ్నకు మాత్రం సమాధానం చెప్పలేదు" అన్నాడు పంతులు అనుమానంగా. తన ప్రవర్తన మూలంగా ఈ పెళ్ళి ఆగిపోతుందన్న భయం ఆయనకు లేదు. వెతుక్కుంటూ తనింటికి వచ్చినవాళ్ళు అంత సులువుగా సంబంధం చెడుపుకోని వెళ్ళిపోరు. తన అనుమానాలు మాత్రం అన్నీ తీర్చుకోవాలి.

కోపాన్ని దిగమింగి- "అన్నీ సరిగ్గా వున్నాయి. ఉచ్చారణ మీకంటే బాగుంటుంది" అన్నాడు ప్రసాద్.

"అయితే అతను మా అమ్మాయినే చేసుకోవాలని ఎందుకనుకుంటున్నాడు?"

"మీ మాటలవెనుక వున్న ఆరాటాన్ని నేను గ్రహిం

చాను. కానీ మీ అమ్మాయి రాణి అతిలోక సౌందర్యవతి. ఆమె తనకు తెలియకుండానే ఒక కోటీశ్వరుడి కంట బడింది. ఆమెను వివాహం చేసుకోవాలని ఆ కోటీశ్వరుడు కుతూహలపడుతున్నాడు. అందుకే నన్ను పంపించాడు" అన్నాడు.

పంతులు ముఖం వెలిగింది. "దానికేముంది. నాకు సంతోషమే. అబ్బాయొక్కడూ ఇష్టపడితే చాలదు గదా. పెద్దలుకూడా అంగీకరించాలి. వాళ్ళింట్లో పెద్ద వారు..."

"మీకా అనుమానం ఏమీ అక్కర్లేదు. అతని తలిదండ్రులకు కొడుకు ఇష్టానికి మించి వేరే ఇష్టమంటూ ఏమీ లేదు..." అన్నాడు ప్రసాద్.

"అయితే అంతా బాగానే ఉందన్నమాట. గోత్రం చూసుకోవాలి. మీకు తెలుసునో తెలియదో_పెళ్ళిళ్ళకు ఏక గోత్రం పనికిరాదు. అతని గోత్రం మీకు తెలుసా?"

"భలేవారండీ_ఈ రోజుల్లో గోత్రాలూ అవీ చూసుకుని పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారా? ఆ మాటకువస్తే మీరు బ్రాహ్మలు కదా_మా వాడు బ్రాహ్మడు కాదు. అంచేత గోత్రం ఇబ్బందే వుండదూ."

వెంకన్నపంతులు భ్రుకుటి ముడతలుపడింది. "ఏమిటీ! మీ వాడు బ్రాహ్మడు కాదూ_ బాగానే ఉంది. ఇంకా నయం కాస్త ముందే చెప్పావు. నేను స్వచ్ఛమైన ఆరువేల నియోగి బ్రాహ్మణుణ్ణి. ఆఖరికి మా బ్రాహ్మల్లోనే వైదీకులకుకూడా నా పిల్లనివ్వను..." అన్నాడు.

ప్రసాద్ దెబ్బతిన్నాడు. "అదేంటండీ_సిరి వస్తే మోకాలడ్డుతారా."

"సిరి రావడంకోసం ఏది పడితే అది చేయలేను. నా కంఠంలో ప్రాణముండగా వర్ణసంకరం జరగడానికి వీల్లేదు. వెళ్ళిరా నాయనా."

"మీ ఉద్దేశ్యంలో మీ బ్రాహ్మలొక్కరే గొప్పవారా?" అన్నాడు ప్రసాద్ కాస్త తీవ్రంగా.

"అలా ఎందుకంటాను బాబూ. ఎవరి గొప్ప వారిది. నా నమ్మకాలకు ఒకరి గొప్పతనంతోటీ, ఎక్కువతక్కువలతోటీ నిమిత్తం లేదు. వర్ణసంకరం నాకు గిట్టదు అంతే!" అన్నాడు పంతులు.

ప్రసాద్‌కు ఏమి చేయాలో తోచలేదు. వ్యవహారం ఇలా బెడిసికొడుతుందనుకోలే దతను. డబ్బుతో దేన్నయినా సాధించవచ్చని అతను చాలాకాలంగా నమ్ముతూ ఉన్నాడు. ఈ రోజు పంతులు అతని నమ్మకం మీద పెద్ద దెబ్బతీశాడు. "ఇదే మీ తుదినిర్ణయమా?" అన్నాడు ప్రసాద్.

"ఇందులో నిర్ణయాల ప్రసక్తి లేదు..." అన్నాడు పంతులు.

పంతుల్ని మార్చడం అసాధ్యమని ప్రసాద్‌కు తెలిసి పోయింది.

# 6

"నా పేరు శారద" అందా అమ్మాయి.

"నన్ను రాణి అంటారు..." అంది రాణి.

"అవును. నాకు తెలుసు" అంది శారద. రాణి ఆమె వంక ఆశ్చర్యంగా చూసింది. –"ఈ సమయంలో మీరు గుడికి వెళ్ళారని తెలిసే, మిమ్మల్ని కలుసుకోవాలనే ఇక్కడకు వచ్చానేన్నను" అంది శారద మళ్ళీ.

"నాతో ఏం పని మీకు?" రాణి ఆశ్చర్యంలోంచి తేరుకోకుండానే అడిగింది.

"మీతో ఏకాంతంగా మాట్లాడాలి. అలా గోడవార కూర్చుందామా?" అంది శారద.

ఇద్దరూ గోడవారకు వెళ్ళారు.

ఇద్దరి మధ్యా కాసేపు మౌనం రాజ్యమేలింది.

"చెప్పండి" అంది రాణి మౌనాన్ని భరించలేక.

"చెబుతాను. చాలా జాగ్రత్తగా వినాలి మీరు. ఇది మీ జీవితానికి సంబంధించిన విషయం."

రాణికి ఆశ్చర్యం పెరిగింది. "చెప్పండి" అంది.

"పెళ్ళి గురించి ఏమనుకుంటున్నారు మీరు?"

"నేనేమీ అనుకోవడంలేదు. అన్నీ మా నాన్నగారు చూసుకుంటారు?"

"ఒకవేళ మీరే చూసుకోవలసివస్తే ఏంచేస్తారు?"

"అలా ఎన్నటికీ జరుగదు" అంది దృఢంగా రాణి.

"అయితే ఇప్పుడు జరిగింది. మిమ్మల్ని ఓ కోటీశ్వరుడి కొడుకు ప్రేమిస్తున్నాడు" అంది శారద.

రాణి మౌనం వహించింది.

"అతను అందగాడు. పాతికేళ్ళలోపు యువకుడు. సంస్కారవంతుడు. ధనవంతుడు. అన్నింటికీ మించి మిమ్మల్ని ప్రేమిస్తున్నాడు. అతన్ని పెళ్ళిచేసుకోవడానికి మీ నాన్నగారి ప్రసక్తి ఎందుకు?" అంది శారద చిరాగ్గా.

"అన్నీ బాగున్నప్పుడు మా నాన్నగారి ప్రసక్తి ఉండడంవల్ల నష్టమేమిటి?"

"ఆయనకీ పెళ్ళి ఇష్టంలేదు..."

"ఎందుకని?"

"కులం సరిపోలేదని..."

రాణి ఆలోచనలో పడింది.

"బాగా ఆలోచించండి. కులం అన్న పదానికి అర్థం లేదు. ఏ మనిషి ముఖంమీదా అతను ఫలానా కులానికి చెందినవాడని రాసి వుండదు. చూసి తెలుసుకోవడం కూడా కష్టం. ఇది కేవలం మనిషి ఏర్పరచుకున్న ఏర్పాటు. మన యువతరం వీటికి అతీతంగా నిలవాలి. మన పెద్దలను సంస్కరించి బుద్ధి చెప్పడానికి ప్రయత్నించాలి. కేవలం మీ నాన్నగారి మూర్ఖత్వంవల్ల బంగారు బాటలో నడవవలసిన మీ భవిష్యత్తుకు భంగం వాటిల్లబోతోంది. అది మీరు సహించకూడదు. తిరగబడాలి. వచ్చిన బంగారు అవకాశాన్ని వదులుకోకుండా సద్వినియోగం చేసుకోవాలి..."

"మా నాన్నగారు నన్ను కంటికి రెప్పలా పెంచారు. ప్రాణంకంటె మిన్నగా చూసుకుంటున్నారు. ఆయన మనసుకు కష్టం కలిగించే పని చేయడం నా వల్ల కాదు. ఆయనమీద తిరగబడే శక్తి లేనేలేదు. నా భవిష్యత్తుకు ఆయన అడ్డువస్తారని నేను నమ్మలేను. నేనాయన అడుగుజాడల్లో నడవవలసినదాన్నే కానీ ఆయన్ను సంస్కరించగల శక్తి నాకు లేదు" అంది రాణి.

"కానీ కోటీశ్వరుడికి మీమీద అంతులేని ప్రేమ ఉంది. ఆ కారణంగా అతను తన డబ్బు సాయంతో మిమ్మల్ని బలవంతంగా వివాహం చేసుకున్నా చేసుకోగలడు. అప్పుడు మీరేం చేస్తారు?"

"మా నాన్నగారి ఇష్టానికి వ్యతిరేకంగా వివాహం జరిగితే_నా ప్రాణాలు బలవంతంగా తీసేసుకుంటాను..." అంది రాణి.

శారద తెల్లబోయింది. రాణి నెలా ఒప్పించాలో ఆమెకు తెలియలేదు.

# 7

"కాబట్టి రాణినింక నువ్వు మర్చిపోవాలి" అన్నాడు ప్రసాద్.

గంగారావు మాట్లాడలేదు. అతను తీవ్రాలోచనలో ఉన్నాడు.

"అటు పంతుల్ని, ఇటు రాణినీ కూడా కదపడం అయింది. ఇద్దరికిద్దరే మొండి ఘటాలు. ఇది మనకుసాధ్య పడే వ్యవహారం కాదు."

"ప్రసాద్! రాణిని పెళ్ళాడకపోతే నాజీవితంవ్యర్థం. ఇంత డబ్బుండీ ఈ కార్యాన్ని సాధించకపోతే నా బ్రతుక్కి అర్థమేమిటో నువ్వే చెప్పు" అన్నాడు గంగారావు బాధగా.

"కాని ఇది చిన్నకార్యం కాదు" అన్నాడు ప్రసాద్.

"ఈ విషయంలో నువ్వేమీ సాయం చేయలేవా?"

"నాకు ఒక్కటే ఉపాయం తోస్తోంది. ఆడదాని బలం ముఖ్యంగా మనదేశంలో తనపవిత్రతమీద నే ఆధార పడివుంది. ఒకపర్యాయం శీలం కోల్పోయిన ఆడది—మగవాడికి సులువుగా బానిస అయిపోతుంది. ఇంతవరకు ఈ అస్త్రం రాణిపై ప్రయోగించవలసి వస్తుందని నేను అనుకోలేదు. నువ్వు రాణిని బలవంతంగా లొంగదీసుకో-ఆ తర్వాత పెళ్ళిచేసుకో."

గంగారావు తల అడ్డంగా ఊపాడు. "నేను రాణిని బలవంతం చేయలేను. ఆమెను నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. కలలోకూడా ఆమెకు కష్టం కలిగితే

సహించలేను. ఆమె తనంతట తనే నా చేతుల్లో వాలిపోవాలి. నాకు భార్యగా ఉండటానికి మనస్ఫూర్తిగా అంగీకరించాలి. అందుకేదైనా ఉపాయంచూడు."

గంగారావు ప్రేమపైన ప్రసాద్‌కు కాస్త నమ్మకం కలిగింది. అతను ఉత్తిత్తి కబుర్లు చెప్పడంలేదనీ, రాణిని నిజంగా ప్రేమిస్తున్నాడని అతనికి తోచింది. అయితే ఈ పరిస్థితుల్లో మిత్రుడికెలా సాయపడాలో అతనికీ తోచడంలేదు. రాణిని అతను చూడగానే పవిత్రభావం కలిగింది. ఆమెకు హాని తలపెట్టడం అతనికీ ఇష్టంలేదు. కాసేపు ఆలోచించాక "నువ్వు బ్రాహ్మణుడవని అబద్ధమాడితే" అన్నాడు.

"అదీ ఆలోచించేశాను. ఆ రహస్యం యెంతోకాలం దాచడం కష్టం. నన్నీ ఊళ్ళో అంతా బాగా యెరుగుదురు. ఏదో విధంగా రహశ్యం బయటపడి తీరుతుంది. తక్షణం రాణి తనప్రాణాలు తీసుకున్నా తీసుకోవచ్చు."

"నీ ప్రేమను అభినందిస్తున్నాను. మోజు తీరగానే వదుల్చుకునే ఉద్దేశం నీకులేదు. ఎలాగో అలా నీకు సాయపడి తీరాలి. లేకపోతే పవిత్ర ప్రేమకు అన్యాయం కలిగిపోతుంది" అన్నాడు ప్రసాద్.

# 8

గుడిలోంచి బయటకు వచ్చింది రాణి. ఆమె వెనుకనే ఒక యువకుడుకూడా బయటకు వచ్చాడు. రాణి నెమ్మదిగా నడుస్తోంది. ఆ యువకుడు కాస్త వేగంగా నడిచి ఆమెపక్కకి వచ్చాడు.

"మీ పేరు తెలుసుకోవచ్చా?" అన్నాడతను.

రాణి అడుగుల వేగం హెచ్చించి అతన్ని దాటుకొని

వెళ్ళిపోయింది. అతను నిరుత్సాహ పడలేదు. అతను వేగం తగ్గించి ఆమెకూ తనకూ మధ్యలో కొంతదూరాన్ని మెయిన్ టైన్ చేస్తూ నడవసాగాడు.

అలా రెండు నిమిషాలు నడిచాక రాణి వెనక్కి తిరిగి చూసింది. ఆమెను చూస్తూనే అతను నవ్వాడు. రాణి ఇబ్బందిగా ముఖం ముందుకు తిప్పుకుని నడక వేగం మరి కాస్త హెచ్చించింది. ఇల్లు చేరే వరకు ఆమె యింక వెనక్కి తిరగలేదు.

ఇంట్లో ప్రవేశిస్తూ మరొక్కసారి వెనక్కి తిరిగి చూసిందామె. అతను మళ్ళీ ఆమెనుచూసి నవ్వాడు. ఆమె మరి వెనక్కి తిరక్కుండా ఇంటితలుపు తట్టింది. తలుపులు తెరుచుకోగానే లోపల అడుగుపెట్టి తలుపులు వేసేయబోయింది.

ఈలోగా అతను ఇంటి మెట్లెక్కుతూ "అయ్యో! తలుపులు వేసేయకండి. నేను మీ ఇంటికే వస్తున్నాను" అన్నాడు.

రాణి గాబరా పడిపోయింది. ఏంచేయాలో కూడా ఆమెకు తెలియలేదు. తలుపు అలాగే వదిలేసి లోపలకు వెళ్ళిపోయిందామె. తలుపులు తీసిన ఆమె తమ్ముడు మాత్రం అతన్నిచూసి పలకరించి "యెవరికోసమండీ" అన్నాడు.

"ఇప్పుడు లోపలకెళ్ళిన అమ్మాయి నీకేమౌతుంది?"

"మా అక్క!"

"మీ నాన్న గారు ఇంట్లో ఉన్నారా?"

"ఉన్నారండి."

"అయితే ఆయనతో పనుండి వచ్చాను."

రాణితమ్ముడు ఆశ్చర్యంగా చూస్తూనే "లోపలకు రండి" అన్నాడు.

"వెరీగుడ్" అంటూ అతను లోపలికివచ్చి "మీ నాన్న గారి పేరేమిటన్నావ్?" అన్నాడు.

"వెంకన్నపంతులు అండి. మీరుకూర్చోండి" అంటూ కుర్చీ చూపించాడతను.

"వెరీగుడ్" అన్నాడు మళ్ళీ కుర్చీలో కూర్చుంటూ. అతను కూర్చోగానే రాణితమ్ముడు లోపలకు పరిగెత్తాడు. అయిదు నిమిషాల్లో వెంకన్నపంతులు అక్కడికి వచ్చాడు. ఆయన్ని చూస్తూనే "నమస్కారమండీ, వెంకన్నపంతులు గారంటే మీరే అనుకుంటాను" అన్నాడతను.

"అవును బాబూ తమరెవరు?" అన్నాడు వెంకన్న పంతులు.

"నా పేరు గంగారావు. ఇంటిపేరు విస్సాప్రగడవారు, నా తలిదండ్రులు నావివాహం చేయాలని చాలాకాలంగా కుతూహల పడుతున్నారు. కాని నాకోపట్టాన ఏపిల్లా నచ్చడంలేదు. ఇందాక గుడిదగ్గర మీ అమ్మాయిని చూశాను. పెళ్ళిచూపు లయిపోయాయి. మీరు వొప్పు కుంటే పెళ్ళిచేసేసుకుంటాను. నేనుపారుగూర్లో ఫ్యాక్టరీలో మేనేజరుగావుంటున్నాను. జీతం నెలకు ఆరువందలు వస్తుంది. కట్నం తీసుకునేవాళ్ళంటే అసహ్యం నాకు. అమ్మానాన్నలకు ఒక్కణ్నే నేను. కులం పట్టింపులులేవు కానీ అమ్మానాన్నలకు మాత్రం మడీ, ఆచారమూ బాగా ఎక్కువ. ఇవీ నా వివరాలు" అన్నాడు.

"ఇంటిపేరు విస్సాప్రగడ అన్నావ్ కదూ" అన్నాడు వెంకన్నపంతులు తృప్తిగా. ఆయన అవసరమైన మరి

కొన్ని ప్రశ్నలు వేశాడు గంగారావుని. అతనిచ్చిన సమాధానాలన్నీ సంతృప్తికరంగానే తోచాయాయనకు.

మర్నాడు గంగారావు తలిదండ్రులతో మళ్ళీ వారింటికి వచ్చాడు. అనుకూలమైన వాతావరణంలో మాటలన్నీ అనుకూలంగానే జరిగాయి. పెళ్ళి పక్కవూరిలో దేవుడి గుడిలో సింపుల్ గా జరిపించేయడానికి ఒప్పందమయింది.

వెంకన్నపంతులు కాబోయే అల్లుడి ఉద్యోగంగురించి విచారించి వచ్చాడు. ఇటీవలనే అతనికా వుద్యోగం వచ్చిందని తెలిసిందాయనకు. మిగతా వివరాలన్నీ అతను చెప్పిన విధంగానే సరిపోయాయి. గంగారావుకు ఫ్యాక్టరీలో మంచిగౌరవం ఉంది. ఇక్కడి ఉద్యోగానికిముందు గంగారావు నార్తిండియాలో వుద్యోగం చేసేవాడని తెలిసిందాయనకు. అన్నీ ఆయనకు తృప్తిగానే వున్నాయి.

రాణి, గంగారావుల వివాహం సింపుల్ గా జరిగిపోయింది.

"కార్యం మా ఇంటనే జరిపించడం మా ఆచారం" అంది గంగారావు తల్లి.

అదేమీ పెద్దవింతకాదు కాబట్టి అభ్యంతర పెట్టలేదు వెంకన్నపంతులు భార్య.

# 9

సిగ్గు ముంచుకొస్తూండగా, భయం కమ్ముతూండగా, కోరికలు కలవర పెడుతూండగా, కవ్వించే కన్నెవయసు గల చిన్నది రాణి. గదిలోకి అడుగుపెట్టింది. ఆమె వెనుకనే తలుపులు మూసుకున్నాయి. రాణి బెదురుగా వెనక్కు తిరిగింది. తలుపులు వేసుకుపోయాయని ఆమెకు

తెలుసును. ఆ విషయమూ ఆమెకు మధురంగానూ, భయం గానూకూడా వుంది.

గంగారావు మంచంమీద కూర్చుని వున్నాడు. రాణిని చూసి అతను లేవలేదు. కంగారు పడలేదు. అలా నిర్లిప్తంగా ఆ మెవంక చూస్తున్నాడు.

సుమారు పదినిమిషాలు గడిచాయి. రాణికి సిగ్గు, భయం స్థానంలో విసుగు జనిస్తోంది. అయినా ఆమె అక్కడ అలాగే నిలబడివుంది.

గంగారావు నెమ్మదిగా మంచంమీంచిలేచి రాణిని సమీపించాడు. అతని అడుగుల చప్పుడు సరాసరి రాణి గుండెలమీద ప్రతిధ్వనిస్తూంది. గంగారావామె దగ్గరకు వచ్చాడు కానీ ఆ మెను తాకలేదు.

మళ్ళీ వారిరువురిమధ్యా రెండునిమిషాలు నిశ్శబ్దం!

ఈ పర్యాయంకూడా గంగారావు చొరవ చూపించాడు. "నీతో మాట్లాడాలి. నా వెనకనే నడచిరా" అన్నాడతను.

అతను చేయి అందిస్తాడనీ, ఆ అనుభవాన్ని యెలా తీసుకోవాలా అనీ ఆలోచిస్తున్న రాణి కొద్దిగా నిరుత్సాహ పడినా అతన్ని అనుసరించింది. గంగారావువెళ్ళి మంచంమీద కూర్చున్నాడు. రాణి అతని యెదురుగా తలవంచుకొని నిలబడివుంది.

"కూర్చో," అన్నాడు గంగారావు. రాణి కూర్చుంది అతనికి కాస్త దూరంగా.

గంగారావు దగ్గరగా జరుగలేదు. గొంతు సవరించుకుని "నేను చెప్పేది సావధానంగా వినాలి" అన్నాడతను రాణివంక చూడకుండా కనులుమూసుకుని. "నేను

నీకిప్పుడు కొన్ని ముఖ్య విషయాలు చెబుతాను. కంగారు పడకుండా వినాలి. ఇప్పుడునువ్వు నన్నర్థం చేసుకోవడం మీదనే మన భవిష్యజ్జీవితం ఆధారపడివుంది'' అన్నాడు గంగారావు.

రాణిలో సంకోచం స్థానంలో కుతూహలం చోటు చేసుకుంది. గంగారావు చెప్పడం ప్రారంభించాడు:

''కొంతకాలం నా ప్రవర్తన వింతగా వుంటుంది. అందుకు నువ్వేమీ తప్పుగా అర్థం చేసుకోగూడదు. నేను ప్రస్తుతం ఒకమనస్తత్వ శాస్త్రజ్ఞుడివద్ద వైద్యంచేయించు కుంటున్నాను. త్వరలోనే సత్ఫలితాలు కలుగవచ్చునని ఆశవుంది. అసలు వైద్యం పూర్తిఅయ్యేవరకూ వివాహం చేసుకోరాదని అనుకొన్నాను. కానీ నీ అందం నా మతి పోగొట్టింది. అందుకే తొందరపడ్డాను. ఇంతకీ నేను చెప్పబోయేదేమిటంటే రెండు నెలలపాటు నిన్ను నేను తాకను. నీతో చిలిపిగా మాట్లాడను. ఒక అపరిచిత స్త్రీలా భావిస్తాను.''

గంగారావు చెప్పటం ఆపి భార్యవంక చూశాడు. రాణికి ఏమీ అర్థమైనట్లులేదు. అయోమయంగా భర్త వంక చూసింది.

''నేను చెప్పదల్చుకున్న రెండో విషయం యింకా ముఖ్యమైనది. చిన్నతనంలోంచి నేను మూఢాచారాలు మధ్య, చాదస్తాలనడుమ పెరిగాను. అవంటే నాకు విరక్తి, విసుగు జనించాయి. నువ్వూ అటువంటి కుటుంబం లోంచే వచ్చావు. రేపటినుంచి నీ ఆలోచనా పరిధిలో చక్కని, ఆరోగ్యకరమైన మార్పురావాలి. అందుకోసం నీకు నేనో గురువును ఏర్పాటుచేస్తున్నాను. ఆ గురువు

చెప్పిన పాఠాలు బాగా వంట పట్టించుకో'' అని చెప్పాడు గంగారావు.

రాణి విచిత్రంగా భర్తవంక చూసింది.

# 10

''ఏమండీ'' అంది నెమ్మదిగా రాణి.

''ఏం?'' అన్నాడు గంగారావు ఆఫీసుకు వెళ్ళ బోతున్న వాడల్లా ఆగి.

''నాకు పాఠాలు చెప్పడానికి మీరు కుదిర్చిన గురువు నాకు నచ్చలేదండి'' అంది రాణి.

''ఎందుకని?''

''ఆయన ప్రవర్తన సరిగా ఉండడంలేదు.''

''అలాంటి అనుమానం నీకెందుకు వచ్చింది?''

''ఆయన చూపులు ఏదోలా వున్నాయి?''

''ఏదోలా ఉన్నాయంటే?''

''చూపుల్లో ఏదో కోరిక. భర్త భార్యని చూసినట్టుగా''

''భర్త భార్యను ఎలాచూస్తాడో నీకు తెలుసా? నేనిప్పుడూ నిన్నలా చూడలేదే.''

''అవుననుకోండి, కానీ...'' ఎలాచెప్పాలో తెలియక తడబడింది రాణి.

''చూడు - మీ ఆడవాళ్ళకి పతివ్రతల పిచ్చిజాస్తి. అస్తమానం అదే ఆలోచనలో వున్న కారణంగా ప్రతిమగవాడికి ఎప్పుడూ అదేదృష్టి వుందని అనుకొం టూంటారు. అసలు పవిత్రత మగవాళ్ళ సొమ్ము. మీ బెదురు చూపులే మగవాళ్ళ పవిత్రతను పక్కకి నెడ తాయి. అవతలివాళ్ళు మనవైపు ఏదోలా చూస్తున్నా రనుకోవడం మన ఆలోచనల్లోని లోపాన్నేకాని అవతలి

వాడి చెడ్డతనాన్ని బయటపెట్టదు. నువ్వు బుద్ధిగా ఉన్నంత కాలమూ నీకే భయమూ ఉండదు.''

''అయితే తప్పు నాదంటారా?''

''నువ్వు తప్పుచేసే దానివని నేననుకొనే పక్షంలో పడుచు గురువుని ఎందుకు నియమిస్తాను? వెర్రిపిల్లా లేనిపోని శంకలు పెట్టుకోక హాయిగా పాఠాలు నేర్చుకో'' అని వెళ్ళిపోయాడు గంగారావు.

రాణికి ఏంచెయ్యాలో తోచలేదు. ఈ విషయంలో భర్తకు నచ్చజెప్పడం కష్టమని అనుకున్నదామె.

గంగారావు వెళ్ళిన నలభైనిమిషాలకు గురువు వచ్చాడు. అతని పేరు ఆమెకు తెలియదు. మిస్టర్ గురూ అని పిలవమని చెప్పాడతను.

గురువుచాలా అందంగా ఫ్యాషనబుల్ గా వుంటాడు. అతను గంగారావు వెళ్ళిన గంటలోపులో వచ్చి అతను రావటానికి గంటముందుగా వెళ్ళిపోతాడు. అతను చెప్పే పాఠాల్లో శృంగారం వుంటుంది. ఆ శృంగారం సునిశితంగా వుంటుంది. అతను చెప్పే పద్ధతికూడా కుతూహలంగా ఉంటుంది. ఎటొచ్చీ అతని చూపులే ఆమెను ఇబ్బంది పెడుతున్నాయి.

గురువురాగానే''నమస్కారం మాస్టారూ''అందామె.

''మాస్టారూ అన్నది చాదస్తం పిలుపు. మిస్టర్ గురూ అనాలని చెప్పానా?'' అన్నాడు గురువు.

రాణి నవ్వివూరుకుంది.

''శృంగారంలో పద్మినీజాతి స్త్రీలు అలాగే నవ్వుతారు'' అన్నాడు గురువు.

రాణి మనసులో సంతోషించింది. ''మీరు యెక్క

వగా శృంగారం గురించే మాట్లాడుతారు. నా భర్త మీకు చెప్పమన్నవివే పాఠాలా?''

''కాదు. కానీ నీభర్తకు నామీద విపరీతమైననమ్మకం నీలాంటి అందమయిన ఆడదానికి చదువుచెప్పే అవకాశం వస్తే శృంగారంకాక మరేదో చచ్చు చదువు చెప్పడం చవట దద్దమ్మలు చేస్తారు. అద్భుత సౌందర్యాన్ని కటిక చీకట్లో అనుభవించడంలాంటిదది'' అన్నాడు గురువు.

రాణి ఉలిక్కిపడింది. ఏదోప్రశ్న ఆమెనోటినుంచి చివరవరకూ వచ్చి ఆగిపోయింది.

గురువు ఆమె ముఖభావాల్ని గమనించలేదు. ''ఈ రోజు మనం కుంతిదేవినిగురించి తెలుసుకుందాం''అన్నాడు రాణి వినడానికి సిద్ధపడడంచూసి ''మన పురాణాలనిండా సెక్సు నిండివుంది. ఆడదంటే సెక్సు తప్ప మరొకటి గుర్తురాకుండా చేశారు మన ఆదికవులందరూ. ఆ గ్రంధాలు మనకు ప్రమాణాలుకావడం మన దురదృష్టం'' అన్నాడు గురువు.

''ఎందువల్ల?''

''ఏకధ తీసుకో అందులో శృంగారంతప్ప మరొకటి వుండదు. అందులోనూ అది సలక్షణమూకాదు. ఉదాహరణకు కుంతికధ తెలుసుకుందాం. వయసులోవున్న కుంతీదేవికి సూర్యుడివ్వవలసిన వరం అదేనా? కోరిన మగవాడిని మంత్రప్రభావంతో ఆహ్వానించగలశక్తి వయసులో వున్న ఆడదానికివ్వరాని వరమని దూర్వాసుడంతటిగొప్ప ఋషికి తెలియదంటావా? తెలుసు. కానీ అది వ్రాసిన వాళ్ళు తమకున్న విలక్షణమైన కోరికలను తమ కధల ద్వారా తీర్చుకున్నారు. ఆ గ్రంధాలను ప్రమాణంగా

స్వీకరించి మనం మానవజాతికే తీరని అన్యాయం చేస్తున్నాము.''

''అయితే ఆ గ్రంథాలలో మంచి ఏమీ లేదంటారా?''

''ఎందుకు లేదు. బోలెడుంది. కాని మంచికంటె చెడునే ఎక్కువగా తీసుకుంటున్నాం మనం. అటువంటి అనేక చెడులలో ఈ కులాల విషయం ఒకటి.''

గురువు కులాల గురించి చిన్న ఉపన్యాసం దంచి, ఈ కులాల పేరుతో ఎన్ని ఘోరాలు, అన్యాయాలు జరుగుతున్నాయో—మనిషి మనిషిని ఎలా ద్వేషించడం జరుగుతుందో వివరించాడు.

''కులాలవల్ల మీకు కలిగిన అన్యాయమేమయినా వుందా?'' అంది రాణి.

''ఎందుకు లేదు. నా అర్ధాంగి కావలసిన రాణి మరొకరి స్వంతమైపోయింది'' అన్నాడు గురువు.

రాణి ఉలిక్కిపడి ''మీకు నేను ముందే తెలుసా?'' అంది.

''తెలియదు. కానీ తెలిసినా ఏమిప్రయోజనం. నేను గంగారావులా బ్రాహ్మణుడిని కాను. రేపొకరోజున దురదృష్టవశాత్తు గంగారావు మరణించినా నిన్నువివాహం చేసుకునే అదృష్టం నాకు కలుగుతుందా? సనాతనులు విధవా వివాహాలూ, వర్ణసంకరాలూ అంగీకరించలేరు.''

రాణి చటుక్కున చెవులుమూసుకుని ''అలాంటిమాటలనకండి. నాకు నచ్చవు'' అంది.

''అయాం సారీ'' అంటూ తనపాఠం కొనసాగించాడు గురువు.

గురువు పాఠాలు రోజుకొక రకంగా కొనసాగుతూనే

వున్నాయి. మరీ శృతిమించని విధంగా అతను శృంగారం చెబుతూనే వున్నాడు. కళల గురించీ మతాలగురించీ ఆమెకు ప్రతిరోజూ నచ్చచెబుతూనేవున్నాడు. కొన్ని మూఢాచారాల కారణంగా ఆడదానికి జరిగిపోయిన అన్యాయం వివరిస్తూనే ఉన్నాడు.

గురువుకు చక్కని వాగ్ధోరణివుంది. సంభాషణా చాతురి ఉంది. మీదుమిక్కిలి రాణివద్ద చనువుకూడా వుంది. వీటితో అతను రాణిని అమితంగా ఆకర్షిస్తూ ఉన్నాడు. ఆ కారణంగా అప్పుడప్పుడూ అతని ప్రవర్తన శృతి మించినా రాణి అసహాయురాలౌతోంది.

ఒకరోజున జయదేవుని అష్టపదులను గురించి చెబుతూ "మీ ఆడవాళ్ళు పదిమందిలో పరవశించి పాడుతూందే గీతం అర్థం విన్నావుకదా. ఇప్పుడా పాట మళ్ళీపాడి వినిపించగలవా?" అన్నాడు.

రాణి నిజంగానే సిగ్గుపడింది. ఆమె ముఖంలో తొంగి చూసిన చిరుసిగ్గుకు పరవశించిన గురువు చటుక్కున ఆమె చేయిపట్టిలాగి దగ్గరగా తీసుకున్నాడు. వారించే శక్తి రాణిలో నశించినమాట నిజం. కాని ఆమెలోవున్న ఏదో శక్తి ఆమెను పట్టువిడిపించుకునేలా చేసింది.

"చూడండి. మీ వేషాలు నాకు తెలుస్తూనేవున్నాయి ఇలా క్రమంగామీరు నన్ను లొంగదీసుకుందామనిచూస్తున్నారు. మీలో ఈపాడు ఆలోచన ఎందుకు కలుగుతుందో నాకు తెలియదు. నా ప్రవర్తనలో మీకలాంటి అభిప్రాయం కలగజేసివుంటే నన్ను క్షమించండి. నా భర్తకు చెప్పినా మీ విషయంలో ఆయన ఎందుకో ఉపేక్ష చేస్తున్నారు. విషయం నాకు అర్థంగావడం

లేదు. కాని మీరింకా శ్రుతిమించితే అసహాయ స్థితిలో నేను చేయగలిగిందొక్కటే. అదే నా ప్రాణాలు తీసుకోవడం'' అంది రాణి. ఆమె కళ్ళలో నీళ్ళున్నాయి. మాటలు అతికష్టంమీద గొంతులోంచి పెగిలాయి.

ఆమె ముఖాన్ని చూసిన గురువు ''నన్ను క్షమించు రాణీ—ఈ సాయంత్రం నీభర్త వచ్చేవరకూ ఉండి ఆయనతో మాట్లాడి మరీ వెడతాను'' అన్నాడు.

# 11

''మీరేదో మాట్లాడాలనుకుంటున్నారు, చెప్పండి'' అన్నాడు గంగారావు.

''మీ ఆవిణ్ణికూడా పిలవండి'' అన్నాడు గురువు.

''రాణీ'' అన్నాడు గంగారావు. రాణి వచ్చింది. ''అలాకూర్చో'' అని భార్యకూ చెప్పి ఆమె కూర్చున్నాక ''మీరు చెప్పదల్చుకున్నది చెప్పండి'' అన్నాడు గురువుతో.

గురువు క్షణం తటపటాయించి ''చెప్పమంటారా?'' అన్నాడు.

''చెప్పండి'' అన్నాడు గంగారావు.

''గతంలో నేనుమీకెన్నో ఉపకారాలు చేసివున్నాను నా కారణంగా మీజీవితం సర్వనాశనం కాకుండా సుసంపన్నమయింది. నాకోసం ఏమయినా చేయగలనని మీరు వాగ్దానం చేసియున్నారు. మీది విశాల హృదయం. ఈ యుగంలో ముఖ్యంగా ఈదేశంలో పుట్టవలసినవారు కారు మీరు. నా అదృష్టంకొద్దీ పుట్టారు. అంతా బాగానే ఉంది.

మీ వివాహం కాగానే కోరకూడని కోరికకోరాను.

మీరుచాలా మామూలుగా అంగీకరించి నా ప్రయత్నాలు నన్ను చేసుకోమన్నారు. మీ భార్యకు గురువునయ్యే అవకాశమిచ్చారు. ఆమె నాపట్ల ఆకర్షితురాలైనమాట నిజం. కానీ తరతరాలుగా భారత స్త్రీ వంటిలో జీర్ణించుకు పోయిన పాత భావాల కారణంగా ఆమె నా వశం కావడంలేదు. ఇంక మీరు కలగజేసుకుంటే తప్ప మీ వాగ్దానం నిలవదు....''

''ఇంతకీ ఏం కావాలి మీకు?''

''మీ భార్య కావాలి__ఒక రాత్రికి...''

గురువు ధైర్యానికి రాణి తల తిరిగిపోయింది. ఆమె భర్తవంక చూసింది ఏం చెబుతాడోనని. అయితే అతనిలో తానాశించిన ఆవేశం కనబడలేదామెకు.

'ఛీ- ఏం మనిషి?' అనుకుంది రాణి.

గంగారావు నవ్వి- ''రాణీ- నీకు గురువుగారు నచ్చలేదా?'' అన్నాడు.

ఏం మాట్లాడాలో తోచలేదు రాణికి.

గంగారావు కొనసాగించాడు- ''నచ్చినా నచ్చక పోయినా నేను చెబుతున్నాను విను. ఇందులో వేళా కోళం ఏమీ లేదు. పవిత్రత అన్న పదం అర్థంలేని దని నా విశ్వాసం. అది జీవితంలో నే ఋజువు చేయదల్చుకున్నాను. ఒకానొకప్పుడు తనకేమీ ఉపకారం చేయక పోయినా కేవలం అతిథి హోదాలో వచ్చిన మనిషి గది లోకి తన భార్యను పంపాడు ఆ రాముడి తాతముత్తాతల్లో ఒకడైన మహారాజు. అనగా ఈ విషయాన్ని మన పురాణాలు కూడా సమర్థిస్తున్నాయనేకదా అర్థం.

ఈయన నాకు గురుతుల్యుడు. నాకెన్నో ఉపకారాలు

చేసి జీవితం నిలబెట్టాడు. ఈయన ఋణం తీర్చుకునే విధానం తెలియక నేనల్లల్లాడిపోతున్నాను. నేను చేస్తున్నది అతిథిమర్యాద కాదు, ఋణం తీర్చుకోవడం. నా జీవిత భాగస్వామిగా నువ్వు నాకిందులో సహకరించాలి. సహకరించి పతివ్రత ననిపించుకుంటావో, తిరస్కరించి నాకు దూరమౌతావో బాగా ఆలోచించుకో—"

రాణికి మతిపోయింది. ఒక పర్యాయం ఇద్దరివంకా చూసింది. కాంక్ష నిండిన చూపులతో గురువు తనవంక చూస్తున్నాడు. నిర్లిప్తంగా చూస్తున్నాడు.

"నాకు గడువు కావాలి" అంది రాణి చివరకు.

గురువు వెళ్ళిపోయాడు. ఆ తర్వాత భర్త వద్దకు చనువుగా వెళ్ళిబోయిందామె.

"దూరం–" అన్నాడు గంగారావు– "రాణీ, నీబాధ నేనర్థం చేసుకోగలను. కానీ నన్నింకేమీ అడగవద్దు."

"ఏమండీ అలా అనవద్దు. ఆడదాన్ని ఏ భర్తా ఇలాంటి కోరిక కోరకూడదు. ఏమనాలో తెలియక గడువు కావాలన్నాను కానీ, ఎన్ని సంవత్సరాలు గడువిచ్చినా ఈ విషయంలో మీ కోరిక తీర్చలేనండి" అంది రాణి.

గంగారావు ఆలోచించి– "అలా అనేయకు. మీ నాన్నగారు అన్నీ తెలిసినవారు. ఈ విషయంలో ఆయనేమైనా సలహా ఇవ్వగలరేమో చూడు. నా కోరిక కాదంటే మనం మళ్ళీ కలుసుకోమని గుర్తుంచుకో..." అన్నాడు.

పెళ్ళి అయిన స్త్రీని గురువు కాంక్షించడం ఒకతప్పు. ఆ కాంక్షను తన భర్తే సమర్థించడం ఇంకో తప్పు. ఈ విషయాన్ని తన తండ్రితో ఎలా చెప్పేది?

'భగవంతుడా......ఇదెక్కడి సమస్య!' అనుకుంది రాణి.

# 12

"మీరు ఆవేశపడకుండా వింటానని మాటివ్వాలి. ఇది సామాన్య విషయం కాదు. ఇందులో ధర్మమీమాంస ఉంది_" అన్నాడు గంగారావు.

వెంకన్నపంతులు ఉత్సాహంగానే, "చెప్పు బాబూ" అన్నాడు.

"ఆయన పేరు రఘునో, మాంధాతో గుర్తులేదు కానీ ఒక మహారాజు అతిథిని సంతృప్తిపరచడంకోసం తన భార్యను అతిథిగదిలోకి పంకపించాడు. అదితప్పంటారా? ఒప్పంటారా?"

వెంకన్నపంతులుకు గొంతులో ఏదో అడ్డంపడ్డట్టయి కాసేపు నోట మాటరాలేదు.

"ఈ రకం ధర్మమీమాంస ఎందుకొచ్చింది బాబూ ఇప్పుడు_" అన్నాడు కాసేపటికి తేరుకుని.

"ఎందుకైతేనేం లెండి కానీ తప్పొప్పులు తెలుసుకోవాలి నేనిప్పుడు" అన్నాడు గంగారావు.

"అ రోజుల్లో వారు చేసినవి తప్పులెందుకౌతాయి? ఒప్పే" అన్నాడు.

"అప్పటి ఆచారాలే కదా మనం ఇప్పుడూ పాటిస్తున్నాం. అప్పుడు ఒప్పయినదిప్పుడూ ఒప్పే కావాలిగా..."

"సరే ఇప్పుడూ ఒప్పే—ఇంతకీ ఏమయింది?"

"అతిథి మర్యాదకంటె గురువు ఋణం తీర్చుకోవడం గొప్పేనంటారా?"

"అక్షరాలా గొప్పేనంటాను."

"అయితే నేను చెప్పవలసిందేమీ లేదు. మీరు మీ అమ్మాయీ మాట్లాడుకోండి" అన్నాడు గంగారావు అక్కణ్ణించి కదులుతూ.

వెంకన్నపంతులుకు విషయం అర్థంకాలేదు_ "నువ్వు వెళ్ళిపోకు బాబూ ఇంతకీ సంగతేమిటి?" అన్నాడు.

"ఏమీ లేదు. మీ అమ్మాయిని నా గురువు కోరారు. తను ఒప్పుకోవడంలేదు. ధర్మసూత్రం తెలిసినవారుకాబట్టి మీరైనా నచ్చజెప్పుతారని పిలిపించాను. మీరు నా మాటే రైటన్నారు."

వెంకన్నపంతులుకు నోట మాటరాలేదు. ఇది కలా, నిజమా అనుకుంటున్నాడాయన. విషయ పరిగ్రహణానికి కొంత వ్యవధి కావాల్సి వచ్చింది. అంతా తెలిసేసరికి ఆయన ఆవేశంలో చిందులు తొక్కాడు.

"ఇంత అన్యాయమా? అతిథి మర్యాద పేరుతో నీ భార్యను వేశ్యగా మార్చాలనుకుంటున్నావా? ఇందుకా నువ్వు పెళ్ళిచేసుకున్నది?" అన్నాడు పంతులు.

"అనవసరంగా మాటలు జారకండి మామగారూ__ ఇలాంటిది ధర్మశాస్త్రాల్లో లేదని ఒక్కమాట చెప్పి ఋజువు చేయండి. మీరు అన్నప్రకారం నడుచుకుంటాను" అన్నాడు గంగారావు తాపీగా.

"వెధవ ధర్మశాస్త్రాలు ఇందుకొక్కవలసొచ్చాయా? అయినా ఈ ధర్మశాస్త్రాల సంగతి ఎలాగున్నా దేశంలో చట్టం వుంది. ఆ చట్టానికి వ్యతిరేకంగా నడిస్తే ముందు జైల్లో పడేస్తారు" అన్నాడు వెంకన్నపంతులు.

"అయితే ధర్మశాస్త్రాలకంటె చట్టమే గొప్ప దంటారా?"

"కాక-..." అని నవ్వాడు వెంకన్నపంతులు. ఆ నవ్వులో జీవంలేదు. "ధర్మశాస్త్రాలు మనం ఏర్పరచు కున్నవి. వాటికి రక్షకుడంటూ వేరేలేడు. కానీ చట్టం మన మేర్పరచిన ప్రభుత్వం తయారుచేసింది. అది ఉల్లం ఘిస్తే ప్రభుత్వం శిక్షిస్తుంది..."

"అయ్యా, అన్నీ తెలిసిన మీరు చట్టం చెప్పిన ప్రకారం మసులుతున్నారా? మీరు కులమతాల పట్టింపు లేకుండా మసులుకోగలరా? చట్టం ప్రకారం విధవా వివాహాలు, వర్ణాంతర వివాహాలు నిరసించినవాళ్ళు శిక్షా పాత్రులుకదా? మీరు వాటిని నిరసించరా?" అన్నాడు గంగారావు సూటిగా.

"చట్టాన్ని నేను ఎన్నడూ కాదనను..." అన్నాడు వెంకన్నపంతులు. ఈ రకం వాదన ఆయనకు నచ్చలేదు. కానీ అవసరాన్నిబట్టి అలా మాట్లాడవలసి వచ్చింది.

"అయితే క్షణం ఆగండి..." అంటూ గంగారావు అప్పటికప్పుడు కాగితంమీద ఏదో వ్రాసి వెంకన్న పంతులుకి అందించాడు. "అది చదివి దానిక్రింద మీ సంతకం పెట్టండి. మీవంటి సనాతనులే చట్టాన్ని పాటించే టప్పుడు నావంటివాడు పాటించకపోతే తప్పవుతుంది. దానిమీద మీరు సంతకం పెట్టకపోతే ఏ విధంగానూ నన్ను శాసించే హక్కు మీకుండదు..."

వెంకన్న పంతులు ఆ కాగితంలోని వాక్యాలు భయ పడుతూ చదివాడు "ఏ కారణంగానైనా నేను అకాంత రంగా మరణించడం జరిగితే__ఏ సజ్జనుడైనా ఆమెను వివాహం చేసుకునేందుకు ముందుకు వస్తే కులమత వివక్షత పాటించకుండా ఆమె ఆ వివాహం చేసుకోవాలని నేను

కోరుతున్న కోరికను సమర్థిస్తూ నా మామగారు శ్రీ వెంకన్నపంతులుగారుకూడా ఈ కాగితంపై నా సంతకం క్రింద సంతకం పెట్టారు.''

ఆ వాక్యాల క్రింద గంగారావు సంతకం వుంది. దాని క్రింద వెంకన్నపంతులు తన సంతకం పెట్టి ''నీది చాలా దొడ్డమనసు బాబూ! ఇందుకా ఇంత నాటకమాడావు. అయినా చల్లని మనసున్నా నీకు ఆరోగ్యానికేం కొదవ? నేరేళ్ళు జీవిస్తావు...'' అన్నాడు.

గంగారావు కాగితం అందుకుని ''నా భయం నాకుంది. నాలుగు రోజుల్లో నాకు క్యాన్సర్‌కు సంబంధించి మైనర్ ఆపరేషన్ ఉంది. ఎందుకో గుండెల్లో భయంగా ఉంది. అసలు పెళ్ళిచేసుకోకూడదనుకున్నవాడినే మీ అమ్మాయిని చూడగానే అభిప్రాయం మార్చుకున్నాను. నేను రాణికి అన్యాయంచేసినా రాణికి నావల్ల అన్యాయం జరక్కూడదు...'' అన్నాడు.

వెంకన్నపంతులు, రాణి ఇద్దరూ తెల్లబోయారు.

## 13

డాక్టర్ లాహిరీ నవ్వుతూ గంగారావు భుజంతట్టి ''ధైర్యంగా ఉండండి. ఇంకో గంటలో ఆపరేషన్ ప్రారంభమవుతుంది. మీకేమీ భయంలేదని హామీ ఇస్తున్నాను...'' అన్నాడు ఇంగ్లీషులో.

గంగారావు పేలవంగా నవ్వాడు. లాహిరీ వెళ్ళిపోగానే అతను రాణివంక చూసి ''నేను లేకపోయినా నా ఆత్మ నిన్ను వెన్నంటే వుంటుంది. నువ్వు సుఖంగా లేకపోతే అది దారుణంగా క్షోభిస్తుంది...'' అన్నాడు.

అక్కడ గురువుకూడా వున్నాడు. మధ్యమధ్య అతను

రాణికేసి చూసే చూపుల్లో శాంతి అన్నది ఇంకా కన బడుతూనే ఉంది. అతను గంగారావుకంక చూసే చూపుల్లో మాత్రం ఆశ కనబడుతోంది. ఆ ఆశ దేనికి సంబంధించినదో చెప్పడం కష్టం.

వీళ్ళుకాక అక్కడ ఇంకా వెంకన్నపంతులు కుటుంబం ఉంది. గంగారావు తలిదండ్రులు తీర్థయాత్రల కని వెళ్ళి రెండునెలలైంది. వాళ్ళింకా రాలేదు.

"ఒకవేళ నా అదృష్టం బాగుండకపోతే నా శరీరం కోసం వృధా ప్రయత్నాలు చేయకండి. అది మెడికల్ కాలేజీకి వెళ్ళిపోతుంది. ఆ విధంగా కొంతమంది మానవ శరీరాన్తర్థం చేసుకునేందు కుపయోగపడగలిగితే నేను చరితార్థుణ్ణవుతాను..." అన్నాడు గంగారావు వెంకన్న పంతులుతో.

"ఆపరేషన్‌కి వెళ్ళేముందు నువ్విలా మాట్లాడడం నాకు నచ్చలేదు. నువ్వు క్షేమంగా తిరిగివస్తావు" అన్నాడు వెంకన్నపంతులు.

గంగారావు ఆ మాటలు విననట్లుగా "తప్పో ఒప్పో మీరో కోరిక కోరారు. అది నేను తీర్చలేదు. ఆ తప్పు మీ కోరికదే కానీ నాదికాదు. దేవుడు నన్ను బ్రతికించక పోతే ఒక రాత్రికికాదు, నా భార్యను వివాహమాడండి. ఆమె బ్రతుకులో వెలుగు అన్ని రాత్రులూ చూపించండి. మీ వివాహం నా మామగారే దగ్గరుండి జరిపిస్తారు. నా భార్యకూడా ఈ వివాహానికి అభ్యంతరం పెట్టదు..." అన్నాడు గురువుతో. గురువు మాట్లాడకుండా ఆ మాటలు విన్నాడు.

గంట గడిచింది. డాక్టరుదగ్గర్నుంచి పిలుపు వచ్చింది గంగారావుకి.

"ఆ ఇల్లు నా స్వంతం. రాణి పేరున రాశాను. నేను పోయినా రాణి ఆ ఇంట్లోనే ఉండాలి. రాణి నవ్వుతూ, కలకల్లాడుతూ ఆ ఇంట్లో హాయిగా జీవించాలి..." అన్నాడు గంగారావు అందర్నీ ఉద్దేశించి.

ఎవ్వరికీ నోటమాట రావడంలేదు. గురువు మాత్రం "మీరేమీ భయపడవద్దు. రాణికి మీరున్నప్పుడెలా జరిగిందో—మీరు లేకున్నా అలాగే జరుగుతుంది. ఆ విషయంలో నేను హామీ ఇస్తున్నాను..." అన్నాడు.

"చాలా థాంక్స్!" అన్నాడు గంగారావు.

గంగారావుకు వచ్చిన పిలుపు డాక్టరు దగ్గర్నుంచి కాదనీ-దేవుడి దగ్గర్నుంచి అనీ తెలియడానికి అక్కడున్న వారందరికీ-మరో నాలుగు గంటలు పట్టింది.

# 14

"చూడండి పంతులుగారూ! నేను మిమ్మల్ని ప్రలోభపెడుతున్నానని భావించవద్దు. మీ అమ్మాయి జీవితం వాడిన పూవు కాకూడదు. మోడువారిన లత కాకూడదు. ఆమెకు వివాహమై కొంతకాలం భర్తతో కాపురంచేసిందని తెలుసును. అయినా నే నామెను వివాహం చేసుకోవాలనుకుంటున్నాను. అందుక్కారణం కేవలం నా ప్రేమ. నా కారణంగా ఆమె జీవితంలో సుఖపడుతుందని మీరు నమ్మవచ్చును.

గంగారావు నన్ను పూర్తిగా నమ్మాడు. ఆమెకూ నాకూ ఎన్నో పర్యాయాలు ఏకాంతాన్ని కల్పించాడు. అయినా మీఅమ్మాయి పరమపవిత్రమైనది. పరిశుద్ధమైనది. అందుకే నన్నాకర్షించింది. ఆమెను వివాహం చేసుకునేందుకు మీ రనుమతించాలి. మీ రనుమతిస్తే ఆమె అడ్డుపెట్టదు..." అన్నాడు గురువు.

వెంకన్నపంతులు అదోలా చూశాడు గురువు వంక.
"చూడు బాబూ, నా తప్పులన్నీ నాకు తెలుసు. నేను మూర్ఖుణ్ణి. కులమన్నది అర్థంలేనిదనీ—మనుషులంతా నక్కలేనని నాకు బాగా తెలుసు. తెలియడం వేరు. నమ్మకాలను సడలించుకోవడం వేరు. గంగారావును చూస్తూంటే నాకు ముచ్చట వేస్తోంది. అతనిది విశాల హృదయం. తెలిసో తెలియకో నా కూతుర్ని పెళ్ళాడి దానికి అన్యాయం చేశాడు. కానీ దాని బ్రతుకు అన్యాయం కాకూడదని అనుక్షణమూ అనుకున్నాడు.

నేను దాన్ని అభిమానంతో పెంచానన్న మాటేగాని పెళ్ళి కాగానే చేతులు కడుక్కున్నాను. నా నమ్మకాలు నావేకానీ ఆ వయసుపిల్ల నూరేళ్ళ జీవితం ఏం కావాలన్న బాధ నాకు లేదు. నా ఆలోచనల్లోనూ నమ్మకాల్లోనూ తప్పున్నదని గంగారావెన్నో పర్యాయాలు రుజావుచేశాడు. కానీ ఏవో అహంకారాలు నన్ను తర్కానికి అతీతుణ్ణి చేశాయి. నువ్వు కంగారుపడవద్దు. మీ వివాహం తప్పక జరుగుతుంది..."

గురువు ఆశ్చర్యపడ్డాడు. వెంకన్నపంతులులో మార్పు వచ్చింది.

"నాలో మార్పు వచ్చినందుకు ఆశ్చర్యపడుతున్నావా బాబూ! నాలోనే కాదు, నావంటి తలిదండ్రు లందరిలోనూ ఇటువంటి మార్పులు రావాలి. అప్పుడే దేశానికి సమస్యలు తొలిగిపోతాయి. మనిషిలో క్రమశిక్షణకోసం కొన్ని ఆచారాలు వచ్చాయి. క్రమంగా ప్రజలు క్రమశిక్షణను మరచిపోయి ఆచారాలను మూర్ఖంగా పాటించడం మొదలుపెట్టారు. వీటిపేరుతో ఆడదాన్ని అణగదొక్కడం మొదలయింది.

ప్రతి తండ్రీ తన బిడ్డల భవిష్యత్తు గురించి ఆలోచించాలిగానీ మూర్ఖపుటాచారాలతో వారికి అన్యాయం చేయడానికి ప్రయత్నించకూడదు. నా కూతురు ప్రోడులా నా కళ్ళముందుంటుందంటే అవి ఊహల్లోకూడా భరించలేను నేను. ఇందులో నా గొప్పతనంలేదు. గంగారావు నా కన్నతండ్రి హృదయాన్ని కదిలించాడు. అంతే!" అన్నాడు వెంకన్నపంతులు.

# 15

"కళ్ళు మూసుకుని వన్ టూ త్రీ అను—ఓ తమాషా చేస్తాను..." అన్నాడు గురువు.

రాణి కళ్ళు మూసుకుంది. అతను చెప్పిన విధంగానే వన్ టూ త్రీ అన్నదామె. త్రీ అనగానే గురువామెను సమీపించి బలంగా పెదవులమీద ముద్దు పెట్టుకున్నాడు.

రాణి కంగారుగా అతన్ని విడిపించుకుని "ఏమిటిది?" అంది.

"ముద్దు—..." అన్నాడు చిలిపిగా గురువు.

"అదికాదు. ఇది పట్టపగలు..."

"అయితే..."

"మనకింకా పెళ్ళికాలేదు..."

"ఓస్ అంతేగా—కానీ పెళ్ళికి మీ నాన్న ఒప్పుకున్నాడు..."

"ఒప్పుకోవడం వేరు. పెళ్ళికావడం వేరు..."

గురువు తమాషాగా నవ్వి "పెళ్ళయ్యాక ముద్దు పెట్టుకోవచ్చునంటావా?" అన్నాడు.

"ఊఁ."

"అయితే ముద్దుపెట్టుకోవడంకోసమేనా పెళ్ళి?"

“ఛా—అందుకే నేమిటి?”

“మరెందుకంట?”

“ఎందుకంటే...ఎందుకంటే...” పెళ్ళి ఎందుకని చెప్పాలో రాణికి తెలియలేదు.

“ఎందుకో నేను చెప్పనా?”

“వద్దు—...”

“ఏం?”

“మీరేం చెబుతారో నాకు తెలుసును.”

“నేనేం చెబుతానో నీకు నిజంగా తెలియదు...”

“తెలుసు...”

“తెలిస్తే చెప్పు...”

“ఛా—అన్నీ నా నోటితో చెప్పించాలని...”

గురువు జాలిగా చూశాడు రాణివంక. “పిచ్చి రాణీ, నువ్వు చాలా అమాయకురాలివి. నేను చెప్పబోయేది నిజంగా వేరు.”

“అయితే చెప్పండి.”

“పెళ్ళి ఎందుకు చేసుకుంటారంటే పవిత్రమైన ప్రేమ ఫలింపజేయడంకోసం...”

“ఓస్ అది నాకు తెలుసు. కానీ పవిత్రమైన ప్రేమ అంటున్నారు. మీ ప్రేమ సంగతి నాకు తెలియదుకానీ, నాది మాత్రం ఖచ్చితంగా పవిత్రప్రేమకాదు—” అంది రాణి. ఆమె కంఠం బాధగా ధ్వనించింది.

“అలాంటి సందేహాలేమీ పెట్టుకోకు. నువ్వూ నీ ప్రేమకూడా పవిత్రమైనవే...”

“అంటే—...”

“అనగా మన మిద్దరమూ ఒకరి కోసం ఒకరు పుట్టాము...”

"అదెల్లా?" అంది రాణి, గంగారావుతో తన సంసార జీవితం కళ్ళముందు మెదుల్తూండగా.

"ఎలాగంటే..." చెప్పడం ప్రారంభించాడు గురువు. ప్రారంభిస్తూనే "నా పేరు గంగారావు..." అంటూ మొదలుపెట్టాడు. రాణిని పెళ్ళి చేసుకోవడంకోసం, అందుకు ఆమె తండ్రిని ఒప్పించడంకోసం తను ఎంత నాటకమాడాడో వివరించాడు. అంతా విన్నాక, అతడి పవిత్ర ప్రేమకు రాణి కరిగిపోయింది. ఆనందంగా అతని వడిలో వాలిపోయింది.

# 16

"అమెరికన్ జార్జెట్ చీర నూటఎనభై, స్వెట్టరు ఏభై ఆరు... మొత్తం అయిదువందల డెభై రూపాయలు అయింది" అన్నాడు షాపులో అతను బిల్లు రాస్తూ.

భాస్కర్రావు ఆరు వందరూపాయల నోట్లు అందించి చిల్లర తీసుకున్నాడు. సుశీల అల్లరి చేస్తున్న బాబును సముదాయించలేక ఇబ్బందిపడుతోంది.

అక్కణ్ణించి ఇద్దరూ బాబుతో కలసి అయిస్ పార్లర్‌కి వెళ్ళారు. అదయ్యాక ఆటోలో ఇల్లు చేరారు.

సుశీల త్వరత్వరగా వంటచేసింది.

ఇద్దరూ భోజనాలు చేశారు. బాబు మాత్రం నిద్ర పోలేదు.

"మీరు కథ చెప్పండి. నేను జోకొడుతూంటాను. నిద్రపట్టేసుంది___" అంది సుశీల.

"ఏముంది చెప్పడానికి ప్రత్యేకంగా___ఎరువు తలిదండ్రులను తీసుకుని రాణి అనే అమ్మాయిని గంగారావు అనే పేరుతో పెళ్ళాడాను. అసలు గంగారావును గురు

వుగా ఆమెను పరిచయం చేశాను. ఆ తర్వాత క్యాన్సరూ, చావూ వచ్చాయి. గంగారావు స్నేహితుడు డాక్టర్ లాహిరీ వేషాన్ని చక్కగా రక్తి కట్టించాడు. అన్నీ అయ్యాక రాణి విధవ అయి—తన అసలు భర్తనే పునర్వివాహం చేసుకుంది. ఆత్మహత్య చేసుకుందామని నేను కొండెక్కితే—ఆ ప్రయత్నాన్ని కొండెక్కించి నా జీవితానికి వెలుగు చూపినవాడు ప్రసాద్ అనబడే గంగారావు మిత్రుడు..."

"బాబూ కథ ఆపండి. బాబు నిద్రపోవడం మానేసి మీ కథ వినేస్తున్నాడు" అంది సుశీల.

"వాడు వింటున్నాడనేకదా—కథ సంక్షిప్తంగా చెబుతున్నాను. వివరాలు రాత్రి వింటావుగా" అన్నాడు భాస్కర్రావు చిలిపిగా నవ్వుతూ.

—: ఐపోయింది :—

# మర్డర్ కాల్!!

మల్లేశ్వరరావు

టెలిఫోన్ గణగణ మ్రోగడంతో, చూస్తున్న అకౌంట్సు పుస్తకాన్ని మూసి రిసీవరు అందుకున్నాడు సేట్ చమన్‌లాల్.

"ఎస్! చమన్‌లాల్ స్పీకింగ్..." హుందాగా అన్నాడు.

"ముహూర్తం పెట్టేసేను చమన్‌లాల్" గొంతు ఖంగుమంటోంది అవతలివేపు.

"దేనికి?" ఆ గొంతును గుర్తుపట్టడానికి ప్రయత్నిస్తూ అడిగేడు చమన్‌లాల్.

"నీ చావుకి!"

"వాడ్డూయూమీన్? పరిహాసమాడుతున్నావా"?

ఆవేశంగా అన్నాడు చమన్‌లాల్.

"నీతో పరిహాసమాడేందుకు తీరిక నాకు లేదు లాల్."

"ఎవర్నువ్?"

ఫోన్‌లో గట్టిగా నవ్వు వినిపించింది.

"చంపుతానని చెప్పినవాడెవడూ పేరు చెప్పడు... అయినా చెబుతాను...నీపాలిటి యముడ్ని...నీ ప్రాణాల కోసం కాచుకున్న మృత్యువును... తెలిసిందా?"

చమన్‌లాల్ నోట మాటరాలేదు.

ఫోన్ డిస్కనెక్టయింది.

కందిరీగల్లా ఆలోచనలు ముసురుకోవడం ప్రారంభించేయి.

యముడట...మృత్యువట...ఎవరీ యముడు? ఎవరీ మృత్యువు? తన ప్రాణాన్నెందుకు తీయాలనుకుంటున్నాడు? తనేం చేసేడు?

తను చేస్తున్న వ్యాపారంలో ఎందరో శత్రువులు ఏర్పడుతుంటారు. అయినా తనపై పగబట్టి చంపడానికి సిదపడే శత్రువులెవరుంటారు? ఈ శత్రువు వ్యాపార పరమైనవాడా? లేక మరేదైనా కారణముందా? ఆలోచనలు మస్తిష్కాన్ని వేడెక్కిస్తున్నాయి.

నలభై అయిదేళ్ళ చమన్‌లాల్ ముప్ఫైయేళ్ళ వాడిలా దృఢంగా వుంటాడు. నగరంలో బాగా పరపతిగల పారిశ్రామికవేత్త. భార్యపోయి పదేళ్ళయింది. యిద్దరు పిల్లలున్నారు. మరెందుకో మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు.

కొడుకు ధనరాజ్. వయస్సు సుమారుగా పాతికేళ్ళుంటుంది. మనిషి అందంగా వుంటాడు. ఎప్పుడూ క్లబ్బుల వెంటా, రోడ్డుమీద కనిపించే ఆడపిల్లల వెంటా తిరుగు

తుంటాడు. సానికొంపల్లో ఒకటి రెండుసార్లు పోలీసుల చేతచిక్కి, తర్వాత తండ్రి పరపతిమీద బయటికి రాగలిగేడు.

కూతురు సుచరితకి యిరవయ్యేళ్లుంటాయి. బి.ఏ. వరకు చదువుకుంది. అందానికి పుత్తడిబొమ్మే. అయితే స్వభావం అంత మంచిదికాదు. డబ్బుందనే అహంకారం జాస్తి. ఈర్ష్య, అసూయలు ఆమెలో పుష్కలంగా వున్నాయి. అంతేగాకుండా చమన్‌లాల్‌కి ముద్దులకూతురు.

వాచీ చూసుకున్నాడు చమన్‌లాల్.

రాత్రి పదిగంటలు కావస్తూంది.

లేచి పుస్తకాలన్నీ బీరువాలో పడేసి, కింద డ్రాయర్ లోంచి బ్రాందీ బాటిలూ, ఒక గ్లాసూ అందుకున్నాడు. సీసాలోంచి కొద్దిగా ద్రవం గ్లాసులోకి ఒంపుకుని, ఒక్క గుక్క గొంతులో పోసుకున్నాడు. బ్రాందీ వెచ్చగా గొంతులో దిగుతుంటే, యింతకు ముందు అతనిలో ఆవరించిన భయం, ఆలోచనలు అన్నీ వెనక్కి తగ్గసాగాయి.

## 2

రాత్రి పదిగంటల సమయం.

శరవేగంతో వచ్చి, చమన్‌లాల్ జ్యూయలరీ షాపు ముందాగిందో టాక్సీ.

అందులోంచి ఒక వ్యక్తి దిగేడు.

ఏభైయేళ్ళ వయసుంటుందతనికి. అరడుగుల హైట్— తెల్లగా నెరిసిపోయిన జుట్టు—క్రిష్టియన్ ఫాధర్ లాంటి గడ్డం—పెద్ద, పెద్ద మీసాలు—అతనిలో ఏదో ప్రత్యేకతను తెలుపుతున్నాయి.

అతను జ్యూయలరీ షాపువేపు పరిశీలనగా చూసి లోపల అడుగుపెట్టేడు.

"ఏం కావాలండీ?" వినయం ఉట్టిపడే స్వరంతో అడిగేడు గుమస్తా జగన్నాథం.

"చమన్‌లాల్!" ఆ గొంతులో ఠీవి, దర్పం, రాజసం గోచరిస్తున్నాయి.

"ఆయనీ వేళల్లో ఎవర్నీ కలవరు. షాపులో ఏమైనా కావాలనుకుంటే నేం చూపిస్తాం..." అని జగన్నాథం యింకా ఏదో చెప్పబోతూంటే, ఆగంతకుడు మధ్యలోనే అందుకున్నాడు.

"ఆయనతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి. నన్ను కలిసినందువల్ల లాభమేగాని, నష్టముండదు' జగన్నాథం చెవి దగ్గరగా నోరుపెట్టి మెల్లగా అన్నాడు.

"అంటే?" నొసలు ఆశ్చర్యంగా ముడివడింది.

"కొన్ని రహస్యాలు మూడోకంటి వాడికి తెలియకూడదు...అందులోనూ ఒక గుమస్తాకి..."

"యిక్కడ నాకు చెప్పనిదే, నేను తెలుసుకోనిదే ఏ పనీ జరగదు...ఫరవాలేదు చెప్పండి...అంత అవసరమనిపిస్తే నేనే మిమ్మల్ని తీసికెళ్తాను."

జగన్నాథంవేపు సందేహించినట్లుగా చూసేడా ఆగంతకుడు.

"సందేహించకండి...చెప్పండి..." ఆగంతకుడి ఉద్దేశాన్ని గ్రహించి అన్నాడు.

"వజ్రాలు! ... లక్షల విలువచేసే వజ్రాలు!..." జగన్నాథంకి మాత్రమే విన్పించినట్లుగా చెప్పేడు.

జగన్నాథం మస్తిష్కంలో అనంతమైన ఆలోచనల తెరలు కదిలేయి.

"నిజం!"

"అవును నా వజ్రాల్ని కొనగల స్థోమత ఒక్క చమన్‌లాల్ గారికిమాత్రమే ఉందని తెలిసివచ్చేను. నా కవతల చాలా పనులున్నాయి... నేను త్వరగా వ్యవహారం సెటిల్ చేసుకుపోవాలి" ఆగంతకుడు తొందరచేసేడు.

"మేం యిలాంటివి కొంటామని మీకెవరు చెప్పేరు?"

"ఇన్ని ప్రశ్నలు అనవసరం. యిష్టముంటే చెప్పండి.. లేదా యింకోపార్టీని వెతుక్కుంటాను..." ఆగంతకుడు జగన్నాథంమీద విసుక్కున్నాడు.

"...ఉండండి..." అంటూ చమన్‌లాల్ గదిలోకి పరుగెత్తుకుంటూ వెళ్ళి, రెండో నిముషంలో మళ్ళీ ఆగంతకుడి ముందు ప్రత్యక్షమయ్యేడు.

"రండి" అంటూ దారి చూపించేడా ఆగంతకుడికి.

ఆ వ్యక్తి అతన్ననుసరించేడు.

వంద అడుగుల పొడవు-యాభై అడుగుల వెడల్పువున్న ఎయిర్ కండిషన్డ్ సౌండ్ ప్రూఫ్‌గది అది. గోడలకు చెవులుంటాయని ఆ గదిని చమన్‌లాల్ సౌండ్ ప్రూఫ్ చేయించడం జరిగింది.

హేండిల్ పట్టుకుని డోర్ తెరవగా లోపల ప్రవేశించాడా ఆగంతకుడు.

అంతవరకు అతన్ని వెన్నంటి వచ్చిన జగన్నాథం, ఆ ఆగంతకుడు లోపల ప్రవేశించగానే వెనుతిరిగేడు. తలుపు యథాప్రకారంగా మూయబడింది.

నేలమీద మెత్తటి కార్పెట్ పరిచివుంది. గది మధ్యలో పెద్ద టేబిల్ వుంది. టేబిల్ మీద ఒక బ్రాందీ బుడ్డీ, నాలుగు సోడాలు, గ్లాసు, సిగరెట్టు ప్యాకెట్టూ, అగ్గిపెట్టె వున్నాయి. సగంకాల్చి పారేసిన సిగరెట్టు

పీకలెన్నో ఫుట్‌పాత్ మీది బ్రతుకల్లా 'ఆష్‌ట్రే'లో తొంగి చూస్తున్నాయి.

టేబిల్ ముందున్న స్ప్రింగ్ కుర్చీలో కూర్చుని వెనక్కీ, ముందుకీ ఊగుతున్నాడు చమన్‌లాల్. అతను ఎంతసేపట్నుంచీ త్రాగుతూ కూర్చున్నాడోగాని అతని కళ్ళు చింతనిప్పుల్లా మండుతున్నాయి.

“రండి...కూర్చోండి...” లోనికొచ్చిన ఆగంతకుడ్ని ఆహ్వానించేడు. అతని మాటలు ముద్దముద్దగా వస్తున్నాయి.

# 3

నేలమీద వెల్లకిలా పడుంది శవం. కళ్ళు తెరుచుకొనున్నాయి. ఆ కళ్ళల్లో ఆశ్చర్యం, భయం కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నాయ్. మొత్తం నాలుగు బులెట్లు దూరేయి శరీరంలో.

ఫోటోగ్రాఫర్ శవాన్ని వివిధకోణాల్నుంచి ఫోటోలు తీస్తున్నాడు. వేలిముద్రల నిపుణుడు వేలిముద్రలకోసం ప్రయత్నాలు చేస్తున్నాడు.

విసుగ్గా టైమ్ చూసుకున్నాడు యిన్‌స్పెక్టర్ సుధాకర్. రాత్రనకా, పగలనకా యిలా డ్యూటీలో మ్రగ్గిపోవడం విసుగ్గా వుందతనికి. విసుక్కుంటూనే శవాన్ని మరోసారి నిశితంగా పరిశీలించేడు. హంతకుడు కనీసం ఒక్క ఆధారంకూడా వదిలిపెట్టలేదు. గదంతా శుభ్రంగా గాలించి వదిలేడు.

హతుడికి, హంతకుడికి మధ్య పెనుగులాట లాంటిదేదీ జరిగినట్టులేదు. హతుడి కళ్ళలో ఆశ్చర్యం చూస్తుంటే బాగా తెలిసిన మనిషే హంతకుడై వుండాలనిపిస్తోంది.

చిరాకుగా గదిలోంచి బయటికి వచ్చేడు. గుమస్తా

అతని వెనకే వచ్చేడు.

అతన్ని పరీక్షగా చూసేడు యిన్స్పెక్టర్ సుధాకర్.

సుమారుగా నలభైయేళ్ళ వయసుంటుంది. కళ్ళకి చత్వారం కళ్ళజోడు, అక్కడక్కడ నెరిసిన జుట్టు, వంగినట్లుంటే నడుం, పంచెకట్టు తీరు, పొడవైన షర్ట్, ఆ షర్ట్‌ని పూర్తిగా కప్పలేని చిన్న కోటు—అతని గుమాస్తాగిరిని తెలియజేస్తున్నాయి.

"మీ పేరు" అడిగేడతన్ని.

"జగన్నాథం!"

"చూడండి జగన్నాథంగారూ! మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడుగుతాను. కరక్టుగా సమాధానం చెప్పండి."

"అడగండి."

"ఎప్పట్నుంచి మీరిక్కడ పన్చేస్తున్నారు?"

"సుమారు రెండేళ్ళవుతుందండి."

"షాపులో జరిగే అన్ని వ్యవహారాలు మీకు తెలుస్తుంటాయా?"

"యించుమించుగా అన్నీ తెలుస్తాయి."

"అయితే ఈ రోజు చమన్‌లాల్ గారు ఎన్నిగంటలకి ఆ గదిలో కెళ్ళేరు?"

"తొమ్మిది గంటల తర్వాతే."

"ఆయన వెళ్ళేక ఆ గదిలోకి యెవరెవరు వెళ్ళి వుంటారు?"

"నేను, ఒక కష్టమర్, చిన్నబాబుగారు—ముగ్గురం వెళ్ళేం ఆ తర్వాత."

"ఎవరా కష్టమర్?"

"అతని పేరు నాకు తెలీదు. అర్జంటుగా చమన్‌లాల్

గారితో మాట్లాడాలన్నాడు. ఇప్పుడెవరితోను అయన మాట్లాడారని చెప్పేను. అయన నన్ను బలవంతం చేయడంతో అయ్యగారితో చెప్పేను. అయ్యగారు పంపించమన్నాక నేనే అతన్ని లోపలికి పంపించేను.''

''ఆ తర్వాత అతనెంత సేపటికి బయటికి వచ్చేడు?''

''పదినిముషాలవుతుంది. అయ్యగారు నిద్రపోతున్నారని, మళ్ళీ వచ్చి కలుస్తానని చెప్పి వెళ్ళిపోయేడు.''

''అతనెలా వుంటాడు?''

జగన్నాథం అతన్ని గురించి వర్ణించి చెప్పేడు.

''అయితే చమన్‌లాల్ గారి గదిలోకి చివరిగా వెళ్ళిందెవరు?''

''చిన్నబాబుగారు!''

''నాకు ఫోన్ చేసింది ఆయనేగా?''

''అవునండి.''

''చమన్‌లాల్ గారి తర్వాత యీ ఆస్తికి వారసులెవరు?''

''చినబాబుగారు, అమ్మాయిగారూ.''

''మీ చినబాబు ఆస్తికోసం ఈ హత్య చేసుండొచ్చుగా'' కదిలించి చూసేడు.

''చెయ్యొచ్చనుకోండి. అయినా పెదబాబుగారి తర్వాతెలాగూ చినబాబుగారికే ఈ ఆస్తి వస్తుందికదా! మరి చినబాబుగారు హత్యచేయాల్సిన అవసరం ఏమిటి?''

''చినబాబుగారు ఆ గదిలోకి వెళ్ళేన్తర్వాత గదిలోంచి పిస్తోలు పేలిన శబ్దం ఏదైనా వినిపించిందా?''

''అలాంటిదేదీ విన్పించదుకదండీ. అది సౌండ్ ప్రూఫ్ గది.''

"పోనీ ఈ విషయం బాగా గుర్తుచేసుకు చెప్పు... ఈ రోజు రాత్రి వచ్చిన కష్టమర్, మీ చినబాబుగారు ఒడ్డు, పొడుగు ఒకేలా వుంటారా? అంటే యిందాక నువు వర్ణించావు చూడు...ఆ గెడ్డాలు, మీసాలు అలాగే చినబాబుగారు మేకప్ చేసుకుంటే అచ్చం అలాగే వుంటారా?"

కాసేపు ఆలోచించి, "ఉంటారేమో ... ఏమోనండి నేనంత దగ్గరగా చూడలేదు..."

"తండ్రీ, కొడుకులిద్దరూ ఈ మధ్య ఏమైనా ఘర్షణ పడ్డారా?"

"పడ్డారండి..." చిన్నగా నసుగుతూ చెప్పేడు.

"ఏ విషయంలో ఘర్షణపడ్డారు?"

"అది నాకు తెలీదు. మొత్తంమీద చాలా పెద్దగొడవే జరిగిందా రోజు. ఆ రోజు అయ్యగారు రమ్మంటే యింటికెళ్ళేను. అప్పటికే ఘర్షణ జరుగుతోంది. వాళ్ళెందుకు అలా అరుచుకుంటున్నారో నాకర్థంకాలేదు. ఎందుకు ఘర్షణపడుతున్నారో తెలుసుకోవాలని ప్రయత్నించేను. ఒకటి రెండు మాటలు నా చెవినపడ్డాయి."

"ఏమిటవి?"

"ఈ ఆస్తిలో చిల్లిగవ్వ రాదని పెదబాబుగారంటున్నారు. ఎలా రాదో నేనూ చూస్తాను, అని చినబాబుగారు అంటుండగా నేనాయింట్లో అడుగుపెట్టేను అంతే. నేనింట్లోకి అడుగుపెట్టిన తర్వాత ఘర్షణ ఆగిపోయింది. చినబాబుగారు కోపంగా వెళ్ళిపోయేరు నన్ను చూసి."

"సరే మీరు వెళ్ళి మీ చినబాబుగార్ని పంపించండి."

రెండు నిముషాల తర్వాత ఒక యువకుడు, అతనితో పాటు ఒక యువతి వచ్చేరు.

"మాకు ఫోన్ చేసిందెవరు? మీరేనా?" అని అడిగేడు అతన్ని చూస్తూ.

"అవును" అన్నాడా యువకుడు.

"మీ పేరు?"

"ధనరాజ్. ఈమె నా చెల్లెలు సుచరిత."

"చూడండి ధనరాజ్! హతుడు మీ తండ్రిగారే కదూ. హత్య జరిగినట్టు మీకెలా తెలిసింది?"

"మా ఇంట్లో వున్నది నాన్నగారితోపాటు మేం ముగ్గురమే. నాన్నగారికి త్రాగే అలవాటు జాస్తిగా వుంది. ఆయన ఈ షాపు మూసేముందు యిక్కడ పుచ్చుకుని వస్తారు. ఒక్కొక్కప్పుడు రాలేని పరిస్థితిలో యిక్కడ వుండిపోతుంటారు. పదిన్నర దాటేక ఆయన రాకపోతే నేనే వచ్చి ఆయన్ని ఇంటికి తీసుకెళ్తాను. ఈ రోజు పదకొండు గంటలవరకు ఆయన రాకపోతే నేనే బయల్దేరి వచ్చేను. తలుపు తెరిచి లోపల అడుగుపెడుతుండగా నాన్నగారి శవం కనిపించింది. అంతే. కెవ్వుమని అరిచేను. జగన్నాథంగారు పరిగెత్తుకు వచ్చేరు. ఆయన కూడా నాలాగే కొన్ని సెకన్లు కొయ్యబారిపోయేరు... ఆ తర్వాత జగన్నాథంగారు చెప్పినమీదట మీకు ఫోన్ చేసేను."

"ఈ మధ్య మీ నాన్నగారితో మీకేదైనా ఘర్షణ జరిగిందా?"

"అవును."

"ఏ విషయంలో?"

"ఆ ఘర్షణకి, ఈ హత్యకి సంబంధం లేదే!"

"అది నిర్ణయించాల్సిందిమీరుకాదు–మేం. చెప్పండి.'

"నేనొక ముస్లిమ్ అమ్మాయిని ప్రేమించాను – పెళ్ళి చేసుకుంటానని ప్రామిస్ చేసేను. నాన్నగారుససేమిరా అన్నారు... పెళ్ళి చేసుకుంటే ఆ స్త్రీలో చిల్లిగవ్వకూడా యివ్వనని అన్నారు. అంతే. నేను ఎదురు చెప్పలేదు."

"కాదు–ఆ స్త్రీలో వాటా ఎలా రాదో చూస్తానన్నారు? ఏం?"

"అబద్ధం."

"సరే. మీరు ప్రేమించిన అమ్మాయి పేరు?"

"షకీలా!"

"హత్య జరిగేముందు మీరెక్కడున్నారు?"

సమాధానం చెప్పడానికి సందేహించేడు ధనరాజ్.

"చెప్పండి."

"అంటే మీరు నన్ను అనుమానిస్తున్నారా?"

"మా వృత్తిలో ఉన్నవాళ్ళు కనిపించిన ప్రతిమనిషిని అనుమానించాల్సి వుంటుంది. చెప్పండి, యింతవరకూ మీరెక్కడున్నారు?"

"నా ఫ్రెండ్ ఇంట్లో వున్నాను."

"ఎవరామె?"

"యిందాక చెప్పినమ్మాయే. షకీలా!"

"తిన్నగా అక్కడ్నుంచే వస్తున్నారా?"

"షకీలా, నేను ఫస్ట్‌షో సినిమాకెళ్ళేం. ఆ తర్వాత షకీలా బలవంతం చేయగా వాళ్ళింట్లో భోంచేసి, యింటికి బయల్దేరేను. యింటిదగ్గర నాన్నగారు లేకపోవడం చూసి షాపుకి వచ్చేను. అంతే."

"షకీలా ఎడ్రస్ చెప్పండి."

చెప్పేడు ధనరాజ్.

సుధాకర్ తలపంకించి, "మీ కెవరిమీదైనా అను మానముందా?"

ధనరాజ్ అడ్డంగా తలూపేడు.

"ఆల్ రైట్! మీరిక వెళ్ళండి."

ధనరాజ్, తన చెల్లెలు సుచరితను తీసుకుని వెళ్ళి పోయేడు.

సుధాకర్ ఆలోచనలు ధనరాజ్ చుట్టూ తిరగ సాగేయి.

చమన్‌లాల్‌ని హత్యచేసిందెవరు? ఎందుకు హత్య చేసేరు? హత్యాయుధం దొరకలేదు. హంతకుడు తనతో తీసుకుపోయేడా?

తనకెందుకో ఎంత ఆలోచించినా అనుమానం ధనరాజ్ మీదికే పోతుంది. హత్యచేయాల్సిన అవసరం, అవకాశం ధనరాజ్‌కే వున్నాయి. అతని కేరక్టర్ ఎటువంటిదో తనకు తెలుసు. డబ్బుకోసమే ఈ హత్య చేసాడేమో! అంతేగాకుండా తండ్రితో ఘర్షణపడ్డాడుకూడా. హత్యకు అదికూడా ఒక మోటివ్.

మరి చమన్‌లాల్ చనిపోయేముందు వచ్చిన కస్టమర్ ఎవరు? ధనరాజే మారువేషం వేసుకు వచ్చాడా? ఆ సమయంలో అతనికి ఎలిబీ షకీలా. ఆమెను కలుసుకుంటే తనకు కొంత సమాచారం లభించవచ్చు. అతని ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ ఒక పోలీసు వచ్చేడు.

"సార్! లోపల యిది దొరికింది" అంటూ దాన్ని సుధాకర్ చేతిలో పెట్టి వెళ్ళిపోయేడు. అది చమన్‌లాల్ డైరీ!

ఆత్రంగా పుస్తకంలోని పేజీలన్నీ తిరగేయసాగేడు సుధాకర్.

ఆఖరి పేజీలో అతని చూపులు నిలిచిపోయేయి. అంటే నిన్నటిరోజన్న మాట.

"వార్నింగ్ మర్డర్!" సుధాకర్ అస్పష్టంగా పలికేడా మాటల్ని.

# 4

దాదాపు ఎనిమిది గంటలు కావస్తూంది.

షకీలా యింటిముందు స్కూటర్ ఆపి, దిగేడు సుధాకర్.

ధనరాజ్ చెప్పిన అడ్రసు గుర్తుచేసుకుంటూ, యింటిని పరిశీలనగా చూసేడు.

ప్రహరీగోడనుండి దాదాపు ఏభైగజాల అవతల కట్టి వుంది. మరీ ఆధునికమైన యిల్లుకాదు. కాని చూడగానే అందమైనదిగా, ఆకర్షణీయమైనదిగా కనిపించే యిల్లు.

గేటు తెరుచుకుని లోపలకెళ్ళేడు సుధాకర్.

గేటు కవతలవేపు మొక్కలు అందంగా దర్శనమిచ్చేయి. నడుంవరకు పెరిగిన క్రోటన్స్ మొక్కలమధ్య నుండి నడుచుకుంటూ ద్వారం దగ్గరికి వెళ్ళేడు. అక్కడ తలుపు మూసివుంది. తలుపు ప్రక్కనేవున్న 'కాలింగ్ బెల్' సుధాకర్ దృష్టిని ఆకర్షించింది. వెంటనే బెల్ నొక్కేడు. లోపల బెల్ మ్రోగుతున్న శబ్దం తెలుస్తోంది.

ఎదురుగా పాలరాతి శిల్పంలాంటి అమ్మాయి!

గుండ్రని ముఖం, ముచ్చటైన ముక్కు, ఆహ్వానం పలుకుతున్నట్టు కన్పించే కళ్ళు, ఎర్రటి పెదవులూ, లేత గులాబీని మరిపించే ఒంటిరంగు-వయసుకుతగ్గ శరీరపొందికలతో అందంగా వుందా యువతి.

యిన్స్పెక్టర్ సుధాకర్ని చూసి ఆమె ఒక్కక్షణం

ప్రొమాన్పడి, అంతలోనే తేరుకుంది.

"ఇన్‌స్పెక్టర్ గారా! ఎవరికోసం వచ్చేరు?" అని అడిగిందామె.

"మిస్, షకీలా నువ్వేనా?" అని అడిగేడు సుధాకర్ మరో అడుగు లోనికేసి.

ఆమె అందాన్ని చూసి ధనరాజ్ 'టేస్ట్'ని మెచ్చుకోకుండా ఉండలేకపోయేడు సుధాకర్. మహాశిల్పి సృష్టించిన అద్భుత శిల్పంలా, గొప్ప చిత్రకారుడు కుంచెలో నుండి వెలువడిన చిత్తరువులా, మహాకవి భావనా ప్రపంచంలో ఉద్భవించిన ఊహాసుందరిలా – జీవకళతో, సౌందర్యజ్యోత్స్నలతో వెలుగుతుందామె. రెండుక్షణాల తర్వాత సుధాకర్ తేరుకోగలిగేడు.

"అవును. నాతో మీకేం పని?"

"ధనరాజ్ గురించి మీతో మాట్లాడాలి."

"ఏం? ధనరాజ్‌కేమయింది?" ఆత్రంగా అడిగింది.

"ప్లీజ్! లోపల మాట్లాడుకుందాం"

"సారీ! లోపలకి రండి" అంతవరకూ బయట నిల్చుండబెట్టి మాట్లాడినందుకు నొచ్చుకుంటూ, ప్రక్కకు తొలగి దారి యిచ్చింది.

సుధాకర్ లోపల అడుపెట్టేడు.

'నీటు'గా పేర్చినట్లుందా గది. గోడలకి గాంధీ, నేతాజీ, శాస్త్రీజీ ఫోటోలు వేలాడుతున్నాయి. గదిలో మూలకి ఒక టేబిల్ వుంది. చిన్న చిన్న వస్తువులేవో దానిమీద చోటుచేసుకున్నాయి. నాలుగు కుర్చీలు ఒక వరుసమీద వున్నాయి. గది మధ్యలో చిన్న టీపాయ్ వుంది.

"కూర్చోండి" అని కుర్చీ చూపించింది.

సుధాకర్ కూర్చున్నాడు. తను అతని కెదురుగా ఒక కుర్చీ లాక్కుని కూర్చుంది.

"ధనరాజ్ కేమయిందో చెప్పలేదు" షకీలా గుర్తు చేసింది.

"చెప్తాను. కానిన్ని మంచినీళ్ళిప్పిస్తారా?"

సస్పెన్స్‌లో వుంచి చంపుతున్నందుకు అతన్ని మనసు లోనే నిందించి, లోనికెళ్ళి గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చి యిచ్చింది.

"యీ యింట్లో మీరొక్కరే ఉంటున్నారా?" గ్లాసు తిరిగి యిచ్చేస్తూ అడిగేడు.

"అవును" షకీలా మనసంతా ధనరాజ్ గురించే ఆలోచిస్తోంది.

"మీరేం చేస్తున్నారు?"

"ఆంధ్రా బ్యాంకులో పనిచేస్తున్నాను."

"ధనరాజ్ మీకెంతకాలంగా పరిచయం?"

"సుమారుగా ఆరునెలలవుతుంది" అసహనం పెరిగి పోతుందామెలో. "యింతకీ ధనరాజ్ కేమయిందో, మీ రెందుకీ వివరాలన్నీ అడుగుతున్నారో చెప్పలేదు" ఈసారి విసుగు ఆమె మొహంలో స్పష్టంగా కనిపించింది.

"ధనరాజ్ కేం కాలేదు. కాని అతని తండ్రి హత్య చెయ్యబడ్డాడు" చెబుతూ ఆమె మొహంలోకి చూసేడు. ఆ క్షణంలో కలవరపడింది. ఆ కలవరపాటును సుధాకర్ గమనించకపోలేదు.

"హత్యా! మైగాడ్!"

"యస్! ఈ విషయంలో మీరు సహకరిస్తే మీనుండి కొంత సమాచారం పొందాలని వచ్చేను."

"అడగండి" సర్దుకుని కూర్చుంటూ అంది. ఆ క్షణంలో ఆమెలో ఏదో ఆలోచనలు రగులుకుంటున్నాయని సుధాకర్ గ్రహించడానికెంతోసేపు పట్టలేదు.

"ధనరాజ్ ఎలాంటివాడు?"

"తండ్రిని చంపే హంతకుడు మాత్రం కాదు" తీవ్రంగా చెప్పింది, యిన్‌స్పెక్టర్ రాకలోని అంతర్యాన్ని గ్రహించి.

"అతనికీ, మీకూ వున్న సంబంధం!"

"ప్రేమికుల సంబంధం!"

"మీ ప్రేమను గురించి చమన్‌లాల్ గారికి తెలుసా!"

"తెలుసు. ఆయన మా ప్రేమను అంగీకరించలేదు. నన్ను పెళ్ళిచేసుకుంటే ఆస్తిలో చిల్లిగవ్వకూడా యివ్వనని అన్నారు. అయినా అతను లక్ష్యపెట్టలేదు. చాలా?" ధనరాజ్ హంతకుడనే భావంతో సుధాకర్ మాట్లాడుతున్నందుకు ఆమె కెంతగానో కోపంగా వుంది. అందుకే ఆమె మాటలు అంత తీవ్రంగా ఉన్నాయి.

"కరక్ట్. అందుకే ధనరాజ్, తండ్రిని చంపి అడ్డు తొలగించుకుని ఆస్తికి సర్వాధికారి అయ్యేడంటాన్నేను. ఏమంటారు?"

"ఒట్టి ఊహాలు కట్టిపెట్టమంటాను" కటువుగా అంది.

"ఎందుక్కాకూడదు?" ఎదురుప్రశ్న వేసేడు.

"మా ప్రేమను నిలుపుకోవడానికి కన్న తండ్రిని చంపుకోవలసిన అగత్యం లేదు. మేము ఎక్కడైనా స్వేచ్ఛగా బ్రతకగలం."

"యిక్కడ ప్రేమకాదు క్వశ్చన్, ఆస్తి పాయింట్. మరిచిపోతున్నారు. తండ్రి అడ్డు తొలగించుకుంటే ఆస్తికి

ఆ స్త్రీ దక్కుతుంది. ఇటు ప్రేమా."

"స్టాపిట్! ధనరాజ్ ఆ స్త్రీకోసం తండ్రిని చంపుకునే నీచుడని నేననుకోను."

"మీరనుకోవడంతో సరిపోదు. సాక్ష్యాధారాలు కావాలి."

"ఆ సాక్ష్యాధారాలు దొరికేవరకూ ధనరాజ్‌ని నింది తుడ్చి చేసి మాట్లాడకండి."

"మీకు ధనరాజ్ గురించి పూర్తిగా తెలియదు."

"ధనరాజ్ గత జీవితంగురించి అంతా తెలుసు. ఆయ నిప్పుడు పూర్తిగా మారిపోయేడు. సో అయ్ లవ్ హిమ్, అతన్ని గురించి చెడుగా మాట్లాడితే నేను సహించను."

"ఆల్ రైట్! రాత్రి ధనరాజ్ మీ యింట్లో ఎంతవర కున్నాడు?"

"రాత్రి ఫస్టుషో సినిమాకి వెళ్ళొచ్చి, ఇద్దరం ఇక్కడే భోంచేసేం. భోంచేసిన తర్వాత అతను వెళ్ళిపోయాడు."

"అప్పుడు సుమారుగా ఎంత టైమవుతుంది?"

"పదిన్నర కావచ్చును."

"నిజమే చెబుతున్నారా? అబద్ధం చెబితే తర్వాత మీరు చిక్కుల్లో పడతారు జాగ్రత్త!"

"అబద్ధం చెప్పాల్సిన అవసరం నాకు లేదు."

"అవసరమైతే మళ్ళీ కలుస్తాను" అంటూ లేచి నిలబడ్డాడు.

వకీలా సమాధానం చెప్పలేదు.

సుధాకర్ వెళ్ళిపోయేడు.

స్కూటర్ స్టార్టయి వెళ్ళిపోయిన శబ్దం ఆమెకు విని పించింది.

ఆమె ఆలోచనలో పడింది.

# 5

పశ్చిమాద్రిన సూర్యుడు కొండల వెనుక లోయలోకి జారుకుంటున్నాడు.

చమన్‌లాల్ హత్య చేయబడి అప్పుడే నాల్రోజులు గడిచిపోయేయి.

యింట్లోని వాతావరణం నిశ్శబ్ద సంగీతాన్ని ఆలా పిస్తోంది. సుచరిత ముందర హాల్లో ఉన్న గదిలో కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటోంది. నౌకర్లు వెనకక్కడో పని చూసుకుంటున్నారు. ధనరాజ్ మేడమీద తన గదిలో ముస్తాబు అవుతున్నాడు. మేకప్ చేసుకుంటూ అద్దంలో క్షణక్షణానికి తన మొహం చూసుకుంటున్నాడు. అది అతని అలవాటు.

మేకప్ పూర్తి చేసుకుని గదిలోంచి బయటికి వెళ్ళబోతూండగా ఫోన్ మ్రోగింది.

ఒక్కుదుటున వెనక్కొచ్చి ఫోనెత్తాడు ధనరాజ్.

"హలో ధనరాజ్ స్పీకింగ్!" అన్నాడు.

"రేపే నీ చావుకి ముహూర్తం పెడుతున్నాను!" అవతలినుంచి వినిపించింది.

"ఎవర్నువ్? జోక్ చెయ్యడానికింకెవరూ దొరక లేదా?" వెటకారంగా అన్నాడు.

"ఆ సంగతి రేపు తెలుసుకుంటావ్" ఫోన్ డిస్కనెక్ట్ అయింది.

ఫోన్ పెట్టేసి ఆలోచనలో పడ్డాడు ధనరాజ్.

తనకు ఫోన్ చేసిన మనిషెవరు? అతడు చెబుతున్నది నిజమా? తనను నిజంగా చంపాలనుకుంటున్నాడా? ఎందుకు చంపాలనుకుంటున్నాడు? తనేం చేసేడు?

నాలుగ్రోజుల్రకితం నాన్నగారికికూడా యిదేవిధంగా ఫోన్ వచ్చింది. చెప్పినట్టు పనీ చేసేడుకూడా. ఇప్పుడు తనేం చేయాలి? తీవ్రమైన ఆలోచనలతో మస్తిష్కం వేడెక్కిపోయింది.

మరోసారి ఫోన్ మ్రోగింది.

ఫోన్ తీయాలా, వద్దా అని ఒకక్షణం సందేహించేడు. మళ్ళీ హంతకుడే ఫోన్ చేసేడేమోనని అనుమానం వేసింది.

"హలో!..." అతని కంఠంలో కొద్దిగా వణుకు వచ్చింది.

"రాజ్! నేను—షకీలాను మాట్లాడుతున్నాను" అంది అవతలి గొంతు.

"నువ్వా షకీలా!" బిగపట్టిన ఊపిరి విడుస్తూ అన్నాడు.

"ఏమిటలా మాట్లాడుతున్నావ్? ఎవరికోసమైనా వెయిట్ చేస్తున్నావా? లేక ఇన్‌స్పెక్టర్ మళ్ళీ వచ్చి యక్షప్రశ్నలు అడిగేడా?"

"అదేంలేదు..."

"మరి ఈరోజు నీ గొంతు అదోలా వుందేం?"

"నీకంటే ముందు ఓ ఫోన్ వచ్చింది..." అంటూ యింతకుముందు ఫోన్‌లో జరిగిందంతా వివరించేడు.

అవతల్నుంచి పకపకమని నవ్వు వినిపించింది.

"ఏం షకీలా! ఎందుకంతలా నవ్వుతున్నావ్?"

"లేకపోతే ఏమిటి రాజ్! ఇంత తెలివైనవాడివి యింతలా ఫూల్ అయిపోతావా? రేపు ఏప్రెల్ ఫస్టు అన్న సంగతి మర్చిపోయేవా?"

మరోసారి ఫోన్‌లో గట్టిగా నవ్వు వినిపించింది.

ధనరాజ్ కి ఆ విషయం అంతగా నమ్మాలనిపించక పోయినా, యింతకుముందు ఫోన్ లో వినిపించిన 'ఆ సంగతి రేపు తెలుసుకుంటావ్' అన్న మాటలు గుర్తు కొచ్చి షకీలా చెప్పింది నిజమేమో అనిపించింది.

బలవంతాన నవ్వు తెచ్చుకున్నాడు.

"అరే! నాకా విషయం గుర్తులేదే! ఎవడో మావాడే యీ ఫోన్ చేసుంటాడు" అని అన్నాడు.

"అది సరేగాని రాజ్! సంగీతలో 'లైలా మజ్నూ' ఆడుతుందట. రిషీకపూర్ అద్భుతంగా నటించేడంటున్నారు. మనిద్దరికోసం టికెట్లు రిజర్వ్ చేసేను. వస్తావు కదూ?" గోముగా అడిగింది.

"షకీలా డియర్! నీమాట ఎప్పుడైనా కాదన్నానా? నువ్వు యింటిదగ్గరే వుండు... నే నిప్పుడే కార్లో బయల్దేరుతున్నాను...ఓ. కే..."

"ఓ. కే." ఫోన్ పెట్టేసిన శబ్దం వినిపించింది.

వాచీ చూసుకున్నాడు.

సాయంత్రం ఆరు కావస్తోంది.

చకచకా బయటికి నడిచేడు.

# 6

ఉదయం తొమ్మిది కావస్తూంది.

పోలీస్ జీప్ చమన్ లాల్ యింటిముందు ఆగింది. జీప్ నుంచి పోలీస్ డాక్టర్ వేలిముద్రల నిపుణుడు, ఫోటోగ్రాఫర్, నల్గురు పోలీసులు దిగేరు, ఇన్ స్పెక్టర్ సుధాకర్ తో సహా.

అందరూ పోర్టికో దాటి లోనికొచ్చేసరికి దాదాపు ఏభై ఏళ్ళ ముసలిమనిషి వారికి ఎదురొచ్చేడు. అతడి వేష

ధోరణబట్టి అతడు నౌకరని యిట్టే పోల్చెయవచ్చు. అతని కళ్ళలో ఆందోళన, బాధ, భయం ద్యోతకమౌతు న్నాయ్.

"శవం ఎక్కడ?" రొటీన్ డ్యూటీ మొదలుపెట్టేడు సుధాకర్.

"పైన, రెండో గదిలో...రండి చూపిస్తాను" అంటూ లోపలకి దారితీసేడు నౌకరు.

సుధాకర్‌తోపాటు అందరూ అతన్ని అనుసరించేరు. పైన...గది అంతా అధునాతనంగా వుంది. ఖరీదైన ఫర్నీచర్, గోడలమీద శృంగారానికి సంబంధించిన అందమైన ఫోటోలు, కళ ఉట్టిపడుతున్నట్టుండే 'నగ్న శిల్పాలు—అంతా శోభాయమానంగా వుంది. బెడ్ లైట్ వెలుగుతూ వుంది.

ఆ గదిమధ్యలో పెద్ద మంచం వుంది. దానిమీద వెల్లకిలా, మంచానికి అడ్డంగా పడున్నాడు ధనరాజ్. కాళ్ళు సగానికిపైగా నేలమీదికి వేళ్ళాడుతున్నాయి. గుండె ప్రాంతంలో రక్తపుగాయం కనిపిస్తోంది. దాన్ని బట్టి పిస్తోలువలన మరణం సంభవించిందని తెలుస్తోంది.

పరిసరప్రాంతంలో హత్యాయుధమేదీ కనిపించలేదు. హతుడు కాలు తగిలి టేబిల్‌మీదున్న టీపాయ్ నేలబడి పగిలినట్టుంది. గది ప్రవేశమార్గంవద్ద పూలకుండీ నేల దొర్లింది. దాన్నిబట్టి హంతకుడి చెయ్యి తగిలి అది నేల బడినట్లు సుధాకర్ ఊహించేడు.

శవం ముందు నిలబడి పరీక్షగా చూసేడు. హతుడి కళ్ళల్లో ఆశ్చర్యం స్పష్టంగా కనిపిస్తోంది. దాన్నిబట్టి హంతకుడు అతనికి బాగా దగ్గరివాడుకాని లేక బాగా తెలిసినవాడుకాని కావచ్చు.

హంతకుడికి సంబంధించిన ఆధారాలేవైనా దొరుకుతాయేమోనని గదంతా ఒకటికి నాలుగుసార్లు వెదికించేడు-తనూ వెదికేడు. అతని ప్రయత్నం ఫలించలేదు.

"డాక్టర్! హతుడు యెప్పుడు మరణించాడో చూడండి..."

"సెల్వరాజ్! తలుపులమీద వేలిముద్రలుంటాయేమో చూడు" సుధాకర్ మాట పూర్తికాకముందే వేలిముద్రల నిపుణుడు ఆ పనిలో నిమగ్నుడైనాడు.

"రాత్రి పన్నెండుగంటలు దాటేక మరణం సంభవించింది..." డాక్టర్ తన పరీక్ష పూర్తిచేసుకొచ్చి చెప్పేడు సుధాకర్‌తో.

ఆపైన — ఫోటోగ్రాఫర్‌కీ సైగచేసేడు. పోలీస్ డాక్టర్, వేలిముద్రల నిపుణుడు, ఫోటోగ్రాఫర్ ఎవరి డ్యూటీలో వారు పడేక ఆలోచిస్తూ బయటికి నడిచేడు సుధాకర్.

బయట — యింతకుముందు ఆ గదిలోనికి తీసుకొచ్చిన నౌఖరు నిలబడివున్నాడు.

"ఫోన్ చేసింది నువ్వేనా?" అన్నాడు అతన్నుద్దేశించి.

అవునన్నట్టు తలూపాడు.

"నీ పేరు?"

"సిన్నయ్యండి."

"ఎంతకాలంనుండీ పన్చేస్తున్నావిక్కడ?"

"ఎక్కడ బాబూ!...సినబాబుగారు పుట్టిందగ్గర్నుండి పన్చేస్తున్నాను."

"అయితే నీకీ యింటి విషయాలు బాగా తెలుసుం

డాలే. మీ చినబాబు ఎలాంటి మనిషి?''

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి కాస్త ఇబ్బంది పడ్డాడు సీన్నయ్య.

''చెప్పు.''

''సినబాబుగారు మంచోరేనండి...అయితే ఆయనకి కసింత కోపం...అంతే. ఇంతకుముందు తాగేవోరండీ..' ఇప్పుడది మానీసేరు...''

''అదిసరే...రాత్రివేళ నువ్వెక్కడుంటావ్?''

''అవుట్ హౌస్‌లో ఉంటాను.''

''నిన్న రాత్రి ఎన్నిగంటలకి పడుకున్నావ్?''

''పన్నెండవుద్ది. ఆ యేలకరకు యింటికి కాపలా కాస్తాను. తర్వాత తలుపులన్నీ సరిగా ఉన్నాయో లేదో సూసుకుని వచ్చి పడుకుంటాను...''

''అయితే నిన్నరాత్రి పిస్తోలు పేలిన శబ్దంగాని, యింట్లో యెవరైనా ప్రవేశించిన అలికిడిగాని వినిపించ లేదా?''

''లేదండి.''

''నీది మొద్దు నిద్రా?'' ఒకవేళ పిస్తోలు శబ్దం అతడు మంచి నిద్రలో ఉన్నప్పుడు విన్పించినా అతనికి తెలియ దనే భావంతో అడిగేడు.

బుర్ర గోక్కుంటూ ''నిత్తం'' అన్నాడు.

''చమన్‌లాల్ గారికి ఒక అమ్మాయి కూడా వుంది. ఆవిడ ఊర్లో లేదా?''

''ఎందుకు నేరండి... మొదట శవాన్ని సూసింది ఆ యమ్మేనండి...పాపం...శవాన్ని సూడలేక కర్రలా యిరుసుకుపడిపోనాదా తల్లి...తాయారు సూత్తన్నాది

సిన్నమ్మగోర్ని" అన్నాడు.

"ఎక్కడ?"

అంతలో ప్రక్కగదిలోంచి "లేవకమ్మా పడుకో" అన్న మాటలు వినిపించేయి.

ముందు నౌకరు, వెంట సుధాకర్ నడిచేరక్కడికి.

అప్పుడే సుచరిత శాస్త తేరుకుని లేచికూర్చుంది. సుచరిత మంచం ప్రక్కనే ఒకామె నిల్చొనుంది. ఆమె చేతిలో గ్లాసు పట్టుకుని సుచరితచేత త్రాగిస్తోంది. ఆమె తాయారు.

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ లోనికి ప్రవేశించేక ఒక ప్రక్కకి ఒదిగి నిల్చుంది తాయారు.

సుచరితవేపు చూసేడు సుధాకర్.

ఎర్రబారిన కళ్ళు అంతవరకు ఆమె ఏడ్చిందన్న సంగతి గుర్తుచేస్తున్నాయి.

"రాత్రి మీరెక్కడ పడుకున్నారు?" సుచరితకి ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంటూ అడిగేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

"ఈ గదిలోనే. ఆవేపు గదిలో నాన్నగారు, ఈవేపు గదుల్లో ఒకదాంట్లో నేను, యింకోదాంట్లో అన్నయ్యా పడుకుంటుంటాం. రాత్రి అన్నయ్య ఎప్పుడు వచ్చాడో తెలీదు. నేను ముందుగానే పడుకుండిపోయేను."

"ఎన్ని గంటలకి నిద్రపోయేరు మీరు?"

"ఇంచుమించుగా పదవుతుంది."

"అయితే రాత్రి మీకేవిధమైన శబ్దంగాని, అరుపుగాని వినిపించలేదా?"

"లేదు."

"అతను చనిపోయినట్లు మీకెలా తెలిసింది?"

"నాన్నగారు చనిపోయిన తర్వాత వ్యాపార వ్యవహారాలన్నీ అన్నయ్యే చూసుకుంటున్నాడు. ప్రతిరోజూ అన్నయ్య ఎనిమిదయ్యేసరికి జూయలరీషాపుకి వెళ్ళేవాడు. ఈరోజు ఎనిమిది దాటిపోయినా అన్నయ్య లేవకపోవడంతో, నేనే లేపడానికి వెళ్ళాను...అంతే" వెక్కి వెక్కి ఏడుస్తోంది.

తర్వాత జరిగిందేమిటో నాకరు చెప్పిందాన్నిబట్టి అర్థం చేసుకున్నాడు సుధాకర్.

"మీ అన్నయ్యకి శత్రువు లెవరయినా ఉన్నారా?"

"నాకంతగా తెలీదు."

"పోనీ స్నేహితులు?"

"బయట అన్నయ్యకి స్నేహితులున్నారో లేదోగాని, అన్నయ్యకోసం యింటికొచ్చే స్నేహితులు మాత్రం ఎవరూ లేరు."

"అతని ప్రవర్తన ఎలాంటిది?"

"అంటే?"

"వ్యసనాలు... వగైరా..."

" 'నువు చెడిపోతున్నావ్' అని అన్నయ్యను నాన్నగారిదివరలో తిట్టేవారు. అంతవరకే నాకు తెలుసు."

సుధాకర్ ఒక్క క్షణం ఆలోచించేడు. ధనరాజ్ కి స్నేహితులుగాని, శత్రువులుగాని ఎవరూ ఉన్నట్టు తెలియ లేదు. రాత్రివేళ పిస్తోలు పేలిన శబ్దం ఎవరూ వినలేదు. హత్యాయుధం దొరకలేదు. హత్యకి కారణం అంతు బట్టడంలేదు. ఆలోచిస్తే ఒకేవక్క కారణం కనిపిస్తుందతనికి.

"చూడండి సుచరితగారూ! మీరుకాక ఈ ఆస్తికి

వారసులు యింకెవరైనా వున్నారా? ఒక వేళ..."

"లేరు. నేనుకూడా లేకపోతే ఈ ఆస్తి అంతా ఏ అనాథశరణాలయానికో, ధర్మ సంస్థలకో చెందుతుంది..."

సుధాకర్ ఒక్క నిముషం మాట్లాడలేదు.

"మీ ముగ్గురికీ అంటే మీ ఫామిలీకీ చెప్పకోదగ్గ 'రైవల్' ఎవరైనా ఉన్నారా?" అడిగేడు సుధాకర్ హఠాత్తుగా,

"లేదు! ఒక వేళ వ్యాపారరీత్యా నాన్నగారికి ఎవరైనా శత్రువులు ఉండవచ్చేమోగాని, మా ముగ్గురికీ లేదా మా ఫేమిలీకి సంబంధించిన శత్రువులెవరూ లేరనే చెప్పాలి" అంది నెమ్మదిగా.

ఇంతలో అంబులెన్స్ వచ్చిందంటూ టూనాట్ఫోర్ వచ్చి చెప్పేడు.

"శవాన్ని మార్చ్యురీకి పంపించు" అని అతన్ని ఆదేశించేడు.

"సార్! బయట చూసేం. హత్యాయుధం దొరకలేదు కానీ, సిమెంటు పైప్ మీద ఎవరివో అడుగులు కనిపించేయి. మన ఫోటోగ్రాఫర్ అవన్నీ తీస్తున్నారు" అని వినయంగా తెలియజేసేడు.

అది విని తల పంకించి హంతకుడు బయటనుండి వచ్చినట్లు నిర్ధారణ చేసుకున్నాడు సుధాకర్. సుధాకర్ లేచి నిలబడ్డాడు. "ఆల్ రైట్! మీరు మాత్రం కాస్త జాగ్రత్తగా వుండండి" అని బయటికి నడిచాడు.

# 7

షకీలా రెండు చేతులతో మొహం కప్పకుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

"బాధపడి ప్రయోజనంలేదు షకీలా! మనం చేయగలిగిందల్లా హంతకుడ్ని ఉరికంబం ఎక్కించడమే."

"రాజ్‌ని హత్యచేసిందెవరోకాదు యిన్‌స్పెక్టరు గారూ_నేనే!" అంది ఏడుస్తూ.

"వ్వాట్!" అదిరిపడ్డాడు. "మీరా?" ఆశ్చర్యంగా అడిగేడు.

"అవును యిన్‌స్పెక్టరుగారూ! నా రాజ్‌ని హత్య చేయబోతున్నట్లుగా ముందే ఫోన్ కాల్ వచ్చింది. ధన్‌రాజ్ ఆందోళనపడుతుండగా ఆ సమయంలో రాజ్‌కి నా దగ్గర్నుంచి ఫోన్‌కాల్ వచ్చింది. నాకా విషయం చెప్పేడు. ఈ రోజు ఏప్రెల్ ఫస్టు కావడంతో నిన్నెవరో ఫూల్ చేయడానికలా ఫోన్ చేసారని అన్నాను. దాంతో అతనూ దాన్ని నమ్మి అలక్ష్యం చేసేడా విషయాన్ని. పాపిష్టిదాన్ని, నేనా సమయంలో ఫోన్ చేయకపోయినా, ఏప్రెల్ ఫస్టని నమ్మించకపోయినా పోలీసుల సహాయాన్ని తీసుకుని బ్రతికి బయటపడేవాడు. నా మూలాన్నే అతని ప్రాణం పోయింది." మళ్ళీ వెక్కి వెక్కి ఏడ్వసాగింది. ఆమె కళ్ళు మరింత ఎర్రబారాయి.

"వార్నింగ్ మర్డర్!" అప్రయత్నంగా అతని నోట్లోంచి వెలువడింది.

అతని మస్తిష్కం ఒక్క క్షణం స్తంభించిపోయింది. తండ్రికీ, కొడుక్కీ ఒకేవిధమైన వార్నింగ్స్. యిద్దరూ పిస్తోలుతో కాల్చి చంపబడ్డారు. ఎందుకు జరుగుతున్నాయా హత్యలు?... చమన్‌లాల్ కుటుంబాన్ని నామరహితం చేయాలని హంతకుడు కంకణం కట్టు

కున్నాడా? అంటే...? సుచరితమీదకూడా హత్యా ప్రయత్నం జరుగుతుందా? నో! నో! హంతకుడు ఈసారి హత్యచేసి తప్పించుకుపోవడానికి వీల్లేదు _ తను పట్టుకు తీరాడు.

షకీలా వెక్కిళ్ళు యింకా విన్పిస్తున్నాయతనికి.

"ప్లీజ్ టేకిట్ యీజీ షకీలా!".

షకీలా అంతగా విలపిస్తుంటే సుధాకర్‌కి జాలేసింది.

"మీ కెవరిమీదైనా అనుమానముందా?"

అడ్డంగా తలూపింది షకీలా.

"రాజ్‌ని చంపిన హంతకుడు ఉరికంబమెక్కేవరకూ నేను నిద్రపోలేను యిన్‌స్పెక్టర్ గారూ! అతన్ని నాకు చూపించండి. అయ్ విల్ కిల్ హిమ్" అంత విషాదం లోనూ తీవ్రంగా అంది.

"నేరం చేసిందెవరైనా నేరసుడెప్పుడూ తప్పించుకో లేడు. హంతకుడు ఎంత పకడ్బందీగా హత్యలు చేసినప్ప టికీ ఎక్కడో ఒక తప్పటడుగు వేయకపోడు. చట్టం ఉచ్చులో చిక్కకపోడు. ఆల్ రైట్! వస్తా" అని చెప్పి వెళ్ళిపోయేడు.

# 8

ధనరాజ్ హత్యచేయబడి మూడురోజులైంది.

యింట్లో సూదిపడితే వినిపించేంత నిశ్శబ్దం ఆవరించి వుంది.

రాత్రి ఏడు కావస్తూంది.

సోఫాలో దిగులుగా కూర్చుంది సుచరిత. టీపాయ్ మీద న్యూస్ పేపర్స్ ఆమెని వెక్కిరిస్తున్నట్లుగా వున్నాయి. వాటిలో చమన్‌లాల్, ధనరాజ్ హత్యా

వివరాలున్నాయి. ఏడ్చి ఏడ్చి ఆమె కళ్ళు ఎర్రబారి వాచివున్నాయి. ఏంచేయాలో అంతుబట్టనిస్థితిలో వుంది. తండ్రిని, అన్ననీ ఎవరు చంపేరో, ఎందుకు చంపేరో ఎంత ఆలోచించినా అనుమ్యాంగా వుంది.

రెండ్రోజులుగా ఆమెకు మనస్థిమితం లేకుండా పోయింది.

'తనకూ చావు తప్పదా?' అన్న ఆలోచన ఆమె నరనరాల్లోనూ భయాన్ని రేకెత్తిస్తోంది.

'ఈ పరిస్థితులో తనేంచేయాలి?' ఎంత ఆలోచించినా అర్థంకాని ప్రశ్న అయిపోయిందది.

నిజంగా పోలీసులు తనను రక్షించగలరా? ఎందుకో వారిమీద తనకు నమ్మకం కల్గడంలేదు.

గడియారం పదకొండుగంటలు కొట్టింది.

సుచరిత బలవంతంగా కళ్ళుమూసుకుంది.

నిద్ర ఆమెను దూరంగా తీసుకుపోయింది. ఎవరిదో చెయ్యి తగిలి పూలకుండీ క్రిందపడిన చప్పుడు విన్పించింది. ఆ శబ్దాన్ని విని కళ్ళు తెరవడానికి ప్రయత్నించింది. అప్పుడే ఆమె మెడచుట్టూ రెండు చేతులు బిగించబడ్డాయి. అవి యినుపచేతుల్లా వున్నాయి.

సుచరిత గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి' కళ్ళు తెరవలేకపోతోంది. ఆ బలమైన పట్టులోంచి తప్పించుకోవాలని తీవ్రంగా ప్రయత్నం చేస్తోంది. కాళ్లు చేతులు కట్టేసినట్లుగా అమెకు సహకరించడంలేదు. ఆమె గింజుకుంటున్నకొద్దీ ఆ వ్యక్తి తనపట్టు మరింత దృఢతరం చేస్తున్నాడు. ఊపిరి అందక ఏ క్షణాన్నో ప్రాణం పోయేట్టుంది.

శక్తినంతా కూడదీసుకుని గింజుకుంటూ గావుకేక పెట్టింది.

పట్టు సడలినట్టయింది. కళ్ళు తెరిచి చూసింది. ఎవరూ లేరు. క్రిందనుంచి చిన్నయ్య పరిగెత్తుకొస్తున్న శబ్దం విని పిస్తూంది. తన మంచానికి కొద్దిదూరంలో నేలమీద పడు కున్న తాయారు హడావిడిగా లేచింది.

"అమ్మగారూ!" అని పిలిచింది తాయారు.

చిన్నయ్య లోపలికి వచ్చేడు.

"ఏందమ్మాయిగోరూ! ఏమైనాది?" చిన్నయ్య ఆందో ళనగా అడిగేడు.

"ఏదో పీడకల" తన కల గురించి వారికి పూర్తిగా వివరించి చెప్పలేకపోయింది.

"మరేం పర్లేదు. అయినోళ్ళు దూరమైనపుడు పీడ కలలు వస్తుంటాయి. మీరు తొంగోండి అమ్మాయిగోరూ! నానుకూడా బయట కాపలా వుంటాను. నా పేనం వుండగా యింట్లోకెవడూ యీడ అడుగుపెట్టనేడు."

మౌనంగా తలూపింది. చిన్నయ్య బయటికి వెళ్ళి తలుపు దగ్గరగా వేసుకున్నాడు. తాయారు మళ్ళీ చాపమీద ఒరిగింది.

గ్లాసుడు మంచినీళ్ళు త్రాగి మంచమీద కూర్చుంది సుచరిత.

నిజంగా హంతకుడు ఈ గదిలో ప్రవేశిస్తే తను చావు నించి తప్పించుకోగలదా? యిప్పుడు అరిచినట్టుగా అప్పుడు అరవడానికి తన గొంతు పెగలదే! గింజుకున్నా హంతకుడు తనను విడిచిపెట్టడే!

ఆమె ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ టెలిఫోన్ మ్రోగింది.

అర్ధరాత్రివేళ ఫోన్ చేసిందెవరా అనుకుంటూనే చెయ్యిచాచి రిసీవరందుకుంది.

"హలో!" ఆమె గొంతులో ఏదో భయం, వణుకు కదలాడాయి.

ఆమె గొంతు వింటూనే ఫోన్‌లో వికటాట్టహాసం చేసేడవతలివ్యక్తి. ఆమె గొంతులో భయాన్ని, వణుకుని గుర్తించినట్టున్నాడు.

ఆ నవ్వు విని అదిరిపడింది సుచరిత.

"ఎ...ఎవర్నువ్?" ఎలాగోలా అనగలిగింది.

"మర్డరర్... వార్నింగ్ మర్డరర్..."

ఆమె గొంతు తడారిపోయింది.

తనకు మృత్యువునుండి ఆహ్వానమా? తనుకూడా హత్యచేయబడుతుందా? ఎవరీ హంతకుడు? తన కుటుంబాన్నెందుకు నాశనం చేయాలనుకుంటున్నాడు?

"అయితే నాకెందుకు ఫోన్ చేయడం?" ధైర్యం తెచ్చుకుని అంది.

"తరువాత వంతు నీదే. నీ సీటు రిజర్వ్ చేసేను.... చావుకి సిద్ధపడు!" ఫోన్ క్లిక్‌మంది.

కొన్ని క్షణాలు స్తంభించిపోయింది సుచరిత.

తనేంచేయాలి?

ఈ ఊరువదిలి పారిపోతే? ఆమె ఆలోచన.

'నిజంగా హంతకుడు తనను చంపాలని నిశ్చయించుకుంటే తనెంత దూరం పారిపోయిమాత్రం ఏంచేయగలదు? పైగా పారిపోయినకొద్దీ హంతకుడికి దగ్గరైనట్టూ ఉన్న ఈ సహాయాన్నికూడా కోల్పోయినట్టుఅవుతుంది.'

హంతకుడి ఫోన్‌కాల్స్ నిర్లక్ష్యం చెయ్యడంవల్లనే

తన తండ్రీ, అన్నా హతులయ్యేరు. తనూ ఆ తప్పు చేయ రాదనుకుంటూ యిన్‌స్పెక్టర్ సుధాకర్‌కి ఫోన్ చేసి జరిగిందంతా చెప్పింది. అతను రక్షణ ఏర్పాట్లేవో చేస్తాను. భయపడనవసరం లేదంటూ హామీ యిచ్చేడు. ఒక పావుగంటలో తను రాబోతున్నట్లు గాకూడా తెలియ జేసాడు.

అయినా పోలీసులమీద నమ్మకం కలగడం లేదు సుచరితకి.

అయితే మృత్యువు తనను కబళించక తప్పదా? తనను రక్షించేవారేలేరా?

# 9

"సార్! మీకోసం మెవరో వచ్చారు సార్!" ఒన్ నాట్ ఫోర్ గొంతు విని ఆలోచనల్లోంచి తేరుకున్నాడు ఇన్-స్పెక్టర్ సుధాకర్.

"పంపించు" అంటూ టేబిల్ మీదున్న ఫైల్ మూసేసేడు.

లోపలికి వస్తూన్న వ్యక్తిని చూసి అదిరిపడ్డాడు సుధాకర్.

అదే ఆకారం...అదే వర్ణన...జగన్నాథం వర్ణించిన మనిషి...ప్రస్తుతం హంతకుడిగా తన దృష్టిలో మెదులుతున్న మనిషి...!

ఆగంతకుడు చిరునవ్వు నవ్వుతూ లోనికొచ్చి సుధాకర్‌కి ఎదురుగా కూర్చున్నాడు.

"నువ్వు...ఎవర్నువ్?..." గొంతు పెగిలి రావడం లేదు.

"హంతకుణ్ణి!" నిశ్చలంగా నవ్వుతున్నాడా ఆగంతకుడు.

ఆ గొంతు ఎక్కడో విన్నట్టుగా, ఆ నవ్వు చిరపరిచితంగా అనిపిస్తోంది సుధాకర్ కి.

"నీ గొంతు..."

"ఎక్కడో విన్నట్టుందికదూ! యిడియెట్! నన్నే పోల్చుకోలేకపోయేవా?" ఆగంతకుడు పిడికిలి బిగించి సుధాకర్ మీదికి చెయ్యివిసరపోతున్నట్లుగా నటించేడు.

ఆ చర్యను చూస్తూనే ఆ ఆగంతకుడెవరో పోల్చేసుకుని అమితాశ్చర్యంతోపాటు అతన్ని కౌగలించుకున్నాడు సుధాకర్.

ఆగంతకుడెవరోకాదు, ప్రముఖ డిటెక్టివ్ రాజేష్! సుధాకర్, రాజేష్ యిద్దరూ చిన్ననాటి స్నేహితులు. పెద్దపెద్ద కేసుల్లో అప్పుడప్పుడు రాజేష్ సలహాను, సహాయాన్ని పొందుతుంటాడు సుధాకర్.

"రాజేష్! ఏమిటిది? నువ్వు హత్య చెయ్యడమేమిటి? ఈ వేషమేమిటి?" ఆనందంగా అడిగేడు.

"అది తెలీకే నీ దగ్గరికి పరిగెట్టుకొచ్చేను...ఆ రోజు నేను చమన్ లాల్ ని కలిసిన మాట వాస్తవమేగాని... హత్య చెయ్యాలేదు. ఇదే అదనుగా భావించి ఎవరో ఈ హత్య చేసేరు. అది నా నెత్తిన పడింది...!"

"ఈజిట్!" ఆశ్చర్యం.

"అవును. ఈమధ్య చమన్ లాల్ అమ్మిన వస్తువొకటి మా దగ్గరకొచ్చింది. అది జమీందార్ రంగనాథరావుగారి విలువైన వజ్రాలహారంలోని వజ్రంతో తయారు చేయబడిన వస్తువు. అది చమన్ లాల్ కెలా వచ్చిందో ఆరాతీస్తే అతను దొంగవస్తువులు కొని, వాటి రూపాలు మార్చి అమ్ముతుంటాడని తేలింది.

అయితే ఈ వ్యవహారం వెనుక పెద్ద గాంగ్ కూడా ఉన్నట్లు అనుమానంగా తోచింది. అది నిర్ధారణ చేసుకోవడానికి సి. బి. ఐ. వారు నా సహాయ మర్థించేరు. వివరాలు తెలుసుకోవడంవరకే నా పని. డైరెక్టర్ రావ్ కోరిక కాదనలేక వివరాల సేకరణకు ఎన్నో లక్షల విలువ జేసే వజ్రాలు తెచ్చానంటూ మారువేషంలో చమన్‌లాల్‌ని కలిసేను.

ఆ రోజు అతను మత్తులో ఉన్న కారణంగా నాకు కావల్సిన వివరాలను కొంతవరకు రాబట్టగలిగేను. నేను యింకా ప్రయత్నిస్తుండగా అతను పూర్తిగా మత్తులోకి జారిపోయాడు. నేను బయటికి వచ్చేశాను. ఇంటికెళ్ళేప్పటికి అర్జంటుగా ఢిల్లీ రమ్మని ట్రంకాల్ వచ్చింది. వెంటనే బయల్దేరి వెళ్ళి, ఈ రోజు వచ్చి ఈ ఘోరం విన్నాను. పాత పేపర్లు తిరగేయగా నన్నే హంతకుడిగా అనుమానిస్తున్నట్లూ, ఈ కేసు నువ్వు డీల్ చేస్తున్నట్లు తెలుసుకుని నీ దగ్గరకి పరిగెట్టుకు వచ్చేను. యిదీ కథ.''

ఉస్సురని నిట్టూర్చి కుర్చీలోకి జారిపోయాడు సుధాకర్.

''ఉన్న ఒక్క ఆధారం నీ రాకతో తేలిపోయింది రాజేష్! ఇక హంతకుణ్ణి ఎలా పట్టుకోవాలో తెలియడం లేదు... చమన్‌లాల్‌తోపాటు అతని కొడుకు ధనరాజ్‌ని చంపేడా హంతకుడు. కూతురికీ వార్నింగ్ ఇచ్చేడు. ఏం చేయాలో?'' తలపట్టుక్కూర్చున్నాడు.

''తొందరపడకు. హంతకుడు మనకు దగ్గర్లోనే ఉన్నట్టుగా నా కన్పిస్తోంది. హంతకుడు మరికాస్త ముందుకు రానియ్ — సంకెళ్ళు వేయించుకోకుండా యెటు పోతాడు!''

"అసలీ హత్యల వెనుకవున్న మిస్టరీ ఏమిటో అంతు బట్టడంలేదు... ప్రజలచేత, డిపార్టుమెంటులోను చీవాట్లు తప్పవేమో!" నిరాశ ధ్వనించిందతని గొంతులో.

"ఏం ఫరవాలేదు భాయ్! నువ్వు తప్పటడుగు వేయడం వల్లే హంతకుడింతవరకూ పట్టుబడలేదు. ఇప్పటికైనా మించిపోయిందిలేదులే."

"అంటే?"

"నువ్వెంతసేపూ సుచరితను రక్షించడానికే ప్రయత్నించేవుగానీ, హంతకుణ్ణి పట్టుకునేందుకు ప్రయత్నించలేదు. సుచరిత బయటికి రాకపోవడం, యింటిచుట్టూ బ్రహ్మాండమైన సిబ్బంది కాపలా వుండడం హంతకుడు తెలుసుకుని జాగ్రత్తపడుతున్నాడు. సుచరితను వంటరిగా వదిలేసి, ఆమెచుట్టూ వల బిగిస్తే హంతకుడు దొరక్కుండా ఎక్కడకు పోతాడు!" జేబులోంచి సిగరెట్టు ప్యాకెట్టు తీసి, ఒక సిగరెట్టు పెదాలమధ్య యిరికించుకుని, అగ్గిపుల్లగీసి వెలిగించుకుని గట్టిగా దమ్ము లాగేడు. సిగరెట్టు ప్యాకెట్టు సుధాకర్ ముందుకి తోసేడు.

"అయితే ఇప్పుడేం చేద్దామంటావ్ రాజేష్?" సిగరెట్టు ప్యాకెట్ చేతిలోకి తీసుకుంటూ అన్నాడు.

రాజేష్ ఏదో అనబోతుండగా ఫోన్ మ్రోగింది.

"మన కర్తవ్యమేదో ఫోన్ తెలియజేస్తుందేమో చూడు..." నవ్వుతూ అన్నాడు.

సుధాకర్ రిసీవరెత్తి రెండునిముషాలు మాట్లాడేడు.

"ఎక్కడ్నుంచి ఫోన్?"

"చమన్‌లాల్ యింటి పరిసర ప్రాంతాల్లో మఫ్టీలో వున్న కానిస్టేబుల్ చేసేడు."

"ఏమిటి విశేషం?"

"సుచరిత క్లబ్బుకెళుతోందట."

"ఆ సంగతి అతనికెలా తెలుసు?"

"నౌకరు చెబుతుండగా విన్నాడట."

"గుడ్. పులి గుహలోనుండి బయటకి వచ్చింది. మాటువేసిన వేటగాడు బయటికి రావచ్చు...క్విక్" తొందరచేసేడు రాజేష్.

కారు గాల్లో దూసుకుపోసాగింది.

"ఇంతకీ యీ విషయం చెప్పలేదు...నీ కీ కేసులో స్పెషల్ యింట్రస్టు వుంది నా ఊహ ప్రకారం..." డ్రైవ్ చేస్తూనే అతనేం చెబుతాడోనని అతనివేపు చూసేడు సుధాకర్.

"సుచరిత నా క్లయింట్ ... యిప్పటికింతే వివరాలు..." అనేసి ఆలోచనలోపడ్డాడు.

# 10

త్రీ ఏసెస్ క్లబ్!

నగరంలోకెల్లా అతి పెద్ద క్లబ్బు అది.

స్టేజీమీద డాన్స్ జోరుగా సాగుతోంది.

హాల్లో లైట్లన్నీ దేదీప్యమానంగా వెలుగుతున్నాయ్.

టేబిల్సు అన్నీ నిండిపోయేయి, ఒక్కటి తప్ప. ఆ టేబిలువద్ద కూర్చుంది సుచరిత. వైట్ బెల్ బాటం ఫాంటు, బ్లూ షేడర్, కళ్ళకి డే అండ్ నైట్ గాగుల్స ధరించింది. హాల్లో పిచ్చెక్కించే డాన్స్ జరుగుతున్నా చూపరుల కళ్ళన్నీ ఆమెమీదే వున్నాయి.

విసుగ్గా చూసిందందరివేపూ.

తన కళ్ళతోనే తినేస్తున్నట్లు చూసే చూపులు—

తననో వింతమృగాన్ని చూసినట్టు చూసే చూపులు— ఆమెను చికాకుపరిచేయి. వాళ్ళందర్నీ మనసులోనే అస హ్యించుకుంది.

డాన్స్ ఆగిపోయింది. హాల్లో చప్పట్లు మారు మ్రోగేయ్.

"ఎక్స్క్యూజ్ మీ మేడమ్!"

ఎవరిదో అపరిచిత కంఠం విని తలతిప్పి చూసింది సుచరిత.

ఎదురుగా యిరవైఅయిదేళ్ళ యువకుడు. ఎర్రటి శరీర చ్ఛాయ, సన్నగా పొడుగ్గా నాజూగ్గా ఉన్నాడు. చక్కని ముఖవర్ఛస్సు, మిల-మిల మెరిసే కళ్ళు, మొన దేరిన ముక్కు, ఉంగరాల తలవెంట్రుకలు, విశాలమైన భుజాలు, అమ్మాయిల మనసుల్ని యిట్టే దోచుకునే వక్షస్థలం-ఎంతో అందంగా, ఆకర్షణీయంగా వున్నాడు. ఒక్కమాటలో చెప్పాలంటే రిషీకపూర్‌లా మెరిసి పోతున్నాడు.

రెప్పవేయకుండా చూసిందతన్ని. అంతలోనే సర్దు కుంది.

"యస్!" అంది.

"నేనిక్కడ కూర్చోవడం మీకేమైనా అభ్యంత రమా?" సంస్కారం ఉట్టిపడే గొంతుతో యింగ్లీషులో అడిగేడు.

అతని చూపు ఒక్కక్షణం సుచరితమీద నిలిచి పోయింది.

"నో అబ్జక్షన్! ప్లీజ్ టేక్ యువర్ సీట్!" అతనికి సీటు చూపిస్తూ అంది.

అతను ఆమెకెదురుగా కూర్చున్నాడు.

"మిమ్మల్నెప్పుడూ యీ క్లబ్బులోనే చూసినట్లు లేదు...మీరీ వూరికి కొత్తవారా?" అడిగింది,

అతని తియ్యటి గొంతు విన్నాక, ఎంతసేపైనా అతనితో మాట్లాడుతూ కూర్చోవాలనిపిస్తోంది సుచరితకి.

"కొత్తా, పాతా కానివాణ్ణి" జేబులోంచి సిగరెట్టు పాకెట్ తీశాడు.

"అదేమిటి?" ఆశ్చర్యంగా అంది.

అతను నవ్వేడు.

"హేవ్ యూ ఎనీ అబ్జక్షన్?" సిగరెట్టు నోట్లో పెట్టుకోబోతూ అడిగేడు.

"నథింగ్. ప్రొసీడ్" అంది నవ్వి.

సిగరెట్టు వెలిగించి, అగ్గిపుల్ల టేబిలు క్రిందికి విసిరి పారేస్తూ, "మేడమ్!...నేను మీకు గుర్తులేకపోయినా మీరు నాకు బాగా గుర్తే!" అన్నాడు.

ఆమె అదిరిపడింది.

"ఎలా?" అంది విస్తుపోతూ.

"మీరు సేఠ్ చమన్‌లాల్ గారమ్మాయి సుచరితకదా. నాలుగేళ్ళక్రితం వరకు నేనీ వూర్లో వుండేవాణ్ణి. ఈ నాలుగేళ్ళలో బాగా మారిపోయేరు మీరు" ఆమెను మరోసారి పరిశీలనగా చూస్తూ అన్నాడు.

ఇంతలో వెయిటర్ వచ్చేడు.

"ఏం తీసుకుంటూరు? చెప్పండి?" అంది సుచరిత.

"తీసుకుంటాను కానీ ఒక కండిషన్...బిల్లు నేను 'పే' చేస్తాను...అందుకు యిష్టపడితేనే..." పట్టు బట్టాడు.

అతని పట్టుదల చూసి ఆమెకి నవ్వాగింది కాదు. నవ్వుతున్నప్పుడు ఆమె తెల్లని పలువరుస తళుక్కుమంది.

"అతిథి మర్యాద నా ధర్మం...కానీ మీ పట్టుదల తప్పదనిపించేలా వుంది...చెప్పండి."

అతను వెయిటర్‌కి ఏవేవో చెప్పేడు. వెయిటర్ వెళ్ళిపోయేడు.

"ఇంతకూ మీ గురించి నాకు చెప్పనేలేదు...మీ పేరు?" గాగుల్స్ తీసి టేబిలుమీదుంచింది.

"మీరింతవరకూ గుర్తుపట్టకపోవడం ఆశ్చర్యకరం. నేను మీకు బాగా తెలుసు. కాలం మనల్ని విడదీసి ఎవరికి ఎవరో గుర్తులేకపోయేంగాని, ఒకచోట ఆడుకున్నవాళ్ళం, ఒక యింట్లో పెరిగినట్టుండేవాళ్ళం—"

"ఈజిట్!" ఆశ్చర్యంగా అంది. "మనకిదివరకు పరిచయముందా?"

వెయిటర్ ఏవో పదార్థాలు తీసుకువచ్చి టేబిలుమీద సర్ది వెళ్ళిపోయేడు.

"ఎస్ మేడమ్! మనకు పరిచయముంది" ప్లేటు దగ్గరికి తీసుకుంటూ అన్నాడు.

"ఏమిటో! మీ పరిచయాన్నెంత గుర్తుచేసుకున్నా గుర్తురావడంలేదు. మీరు పొరబడుతున్నారేమో!" అంది ఒక నిముషం ఆలోచించిన తర్వాత.

"జమీందార్ సూర్యనారాయణరాజుగారు మీకు తెలుసుకదా. ఆయన మా నాన్నగారు...పూర్వం మీ నాన్నగారు మా దివాణంలో పనిచేసేవారు...అయిదేళ్ళ క్రితం మీ నాన్నగారు మిమ్మల్ని మా యింటి కోడలిగా చేసుకొమ్మని అడిగేరు...గుర్తొచ్చిందా?"

ఆమె మొహంలో ఒకసారి ఆశ్చర్యరేఖలు అలుము కున్నాయి.

"అంటే మీరు... నువ్వు... మధుబాబు కదూ?" ఆశ్చర్యం, ఆనందం.

"హమ్మయ్య! ఇప్పటికైనా గుర్తించినందుకు సంతోషం" ఊపిరి పీల్చి వదిలేడు.

"తల్లిని చిన్నతనంలోనే పోగొట్టుకున్నాను. నాలుగు రోజుల క్రితం అన్నయ్యనూ, వారం రోజుల క్రితం నాన్నగార్నీ పోగొట్టుకుని యిప్పుడు ఒంటరిదాన్నయి నాను" ఆమె కళ్ళల్లో నీళ్ళూరేయి.

"డోంట్ బి సిల్లీ సుచీ! అసలేం జరిగిందో చెప్పూ?" అన్నాడు మధుబాబు ఆశ్చర్యంగా.

"నాన్నగార్నీ, అన్నయ్యనీ ఎవరో దుర్మార్గుడు చంపే సాడు. రేపు నేనుకూడా బ్రతుకుతానో, బ్రతకనో అన్న భయం నన్ను పీక్కుతింటోంది. మనసు అశాంతితో నిండి పోయింది. ఒక్కదాన్నీ యింట్లో బిక్కుబిక్కుమంటూ వుండలేక యిలా నలుగుర్లోకి వస్తున్నాను" కన్నీటికడలి బద్దలై కట్టలు తెంచుకుంది. అంతలోనే పరిసరం గుర్తు కొచ్చి, హాండ్ బాగ్ లోనుంచి చేతిరుమాలు తీసి కళ్ళు తుడుచుకుంది.

"మైగాడ్! రెండు హత్యలా? అయినా ఎందుకు హత్యలు చేస్తున్నట్లు? నిన్నుకూడా చంపుతాడని ఎందు కనుకోవాలి?" స్వగతంలో అనుకుంటున్నట్లుగా బయటికే అన్నాడు.

"నాన్నగార్నీ, అన్నయ్యనీ ముందుగా చెప్పి హత్య చేసేడు. దాన్నిబట్టి చూస్తే అతనెందుకో పగబట్టి హత్యలు

చేస్తున్నట్లుగా వుంది. అందుకే నాకు భయంగా వుంది.''

''హత్యలు చేసేంత అపకారం ఏంచేసారని?''

''అదే అంతుతెలియని ప్రశ్న. అతనెందుకిలా మమ్మల్నందర్నీ చంపాలనుకుంటున్నాడో, అతని గమ్యం ఏమిటో ఎంత ఆలోచించినా అంతుబట్టడంలేదు. ఏ రోజు మృత్యువు ముంచుకొస్తుందోనని హడలిచస్తున్నాను.''

''యికనుంచీ నీ కాభయం అక్కర్లేదు సుచీ! నేనుండగా నిన్నెవరూ చంపలేరు. నిర్భయంగా ఉండు. సాధ్యమైతే ఆ హంతకుణ్ణి నేనే పట్టుకుంటాను'' హామీ యిచ్చేడు.

ఆమె కళ్ళల్లో ఒక్కసారి భీతి, భయం తొలగి వెలుగు తాండవించింది.

''నిజంగానా?'' మరుక్షణంలో ఆమెలో ఏదో దిగులు ఆవరించింది.

''నువ్వు నా ఎదుటవుండే ఏ కొన్ని గంటలో నన్ను రక్షించగలవు మధూ! నువ్వులేని వేళల్లో ఆ హంతకుడు తెగిస్తే ఏంచేయను?''

''ఒకసారి చేసిన తప్పును మళ్ళీ చేస్తానా డియర్! బుద్ధి గడితిని మూర్ఖంగా ఈ అందాలరాశిని కాదన్నానొకనాడు. యిప్పుడు కాదంటానా?'' తన చేతిలోవున్న ఆమె చేతిని మృదువుగా నొక్కుతూ అన్నాడు.

ఆమె అభ్యంతరం చెప్పలేదు.

ఇంతలో ఒక ముసిలాడు వాళ్ళ టేబిల్ దగ్గరగా వచ్చేడు. యిద్దరూ ఒకేసారి చూసేరతన్ని.

అతనికి యేభైయేళ్ళుంటాయి. తల నెరిసింది. అయినా మొహంలో ముడతలు కనిపించడంలేదు. మిలటరీలో పని

చేసినవాడిలా దృఢంగా వున్నాడు. టక్ చేసేడు. నోట్లో పైప్ వెలుగుతోంది. మీసాలు బొద్దుగా వున్నాయి. చేతి కర్ర ఆసరాతో నిలబడి వున్నాడు.

అతను సుచరితను పరీక్షగా చూస్తూ "అమ్మాయ్! నువ్వు చమన్‌లాల్ కూతురివికదూ?" అని అడిగేడు.

అత నెవరో సుచరితకి తెలియలేదు.

"అవునండీ."

"అయిదేళ్ళ క్రితం మీ యింటికి వచ్చినపుడు నిన్ను చూసేను, నీకు గుర్తుందో లేదో. అన్నట్టు మీ నాన్న, అన్నయ్యలు హత్యచేయబడినట్టు తెలిసింది. మరి నువ్వొక్కర్తివీ ఎలావుంటున్నావమ్మా?" జారిపోతున్న కళ్ళజోడుని తిరిగి కళ్ళమీదికి లాక్కుంటూ అడిగేడు.

అంతవరకు అతను నిలబడి మాట్లాడుతుండడం మగనించి "కూర్చోండి" అంది మర్యాదకోసం.

ఆ వ్యక్తి టేబిల్ దగ్గరగా కుర్చీ లాక్కుని కూర్చుంటూ మధుబాబు వేపు ప్రశ్నార్థకంగా చూసి "ఇత నెవరు?" అని అడిగేడు.

మధుబాబు అతని మొహంలోకి చూడసాగేడు. అతను వచ్చిందగ్గర్నుంచీ అతని చర్యల్ని గమనించసాగేడు.

"మధుబాబు ... నా ఫ్రెండ్" ఎలా పరిచయం చేయాలో తెలియక మాటలు తడుముకుంది.

"ఇహ నేనొస్తానమ్మాయ్!" అంటూ లేచాడతను.

'పీడా విరగడైంది' అనుకున్నారిద్దరూ.

"ఎవరీ ముసలిపీనుగు?" అతను దూరం కాగానే అన్నాడు.

"ఏమో! నాకూ తెలియదు. నే నెప్పుడూ చూసిన

గురులేదు. బహుశా నాన్నగారి స్నేహితుడై వుంటాడు."

"ఒక్కోసారి హంతకుడు ఈరూపంలోనే వస్తుంటాడు జాగ్రత్త సుచీ!" హెచ్చరించేడు.

"ఇక నువ్వుండగా నాకేం భయం?" అంది అతని కళ్ళల్లోకళ్ళు కలిపి.

"అఫ్‌కోర్స్! అదీ నిజమే. నీకిక ఏభయమూ వుండదు."

అప్రయత్నంగా సుచరిత దృష్టి కౌంటరువద్ద కూర్చుని 'అపన' సప్లిమెంట్ తిరగేస్తున్న వ్యక్తిపైన పడింది.

అతను సన్నగా, పొడుగ్గా వున్నాడు. ఫెల్ట్ హేట్ అతని ముఖాన్ని సగానికిపైగా దాచేస్తోంది. అతను పుస్తకం తిరగేస్తూ మాటిమాటికీ తమను చూస్తున్నాడన్న విషయం గ్రహించింది సుచరిత. ఆమె గుండెలు భయంతో అదరసాగేయి.

"మేడమ్" అన్న పిలుపు విని ఉలిక్కిపడి చూసింది సుచరిత. యింతకుముందు వచ్చిన వెయిటర్!

ఏమిటన్నట్టు చూసింది సుచరిత.

"ఈ స్లిప్ మీ కందజెయ్యమన్నారు" ఆమె చేతుల్లో ఓ కాగితంముక్క ఉంచాడతను.

విప్పి చూసింది.

ప్రక్కలో బాంబు పడినట్లు అదిరిపడింది సుచరిత — అది చూస్తూనే.

"మృత్యువు ముసుగులో వుంది—"

సుచరిత గుండెలు దడదడలాడసాగేయి. ఆమె మొహంలో రంగులు మారేయి. ఎవరు రాశారీ ఉత్తరం తన శ్రేయోభిలాషా? లేక హంతకుడు తనకు మరోసారి వార్నింగ్ యిస్తున్నాడా? తను ఏ భయంవలన యిక్కడి

వచ్చిందో, ఆ భయం తనను యెక్కడా వదలలేదు. ఇప్పుడు తనేం చేయాలి? ఒక్కొక్క ఆలోచన కను గుణంగా ఆమె ముఖకవళికలు మారుతున్నాయి.

"ఎవరిచ్చారిది?" తేరుకుని అడిగింది.

వెయిటర్ వెళ్ళబోతూ వెనుదిరిగి చూసి అతను మీకు తెలీదా అన్నట్లు చూసి ఒక వ్యక్తిని చూపించేడు.

బొద్దుమీసాల వ్యక్తి! ఇంతకు ముందు సుచరితతో మాట్లాడి వెళ్ళేడు!

"ఏమిటి సుచీ! ఏం జరిగింది_ఎందుకంత ఆందోళనగా వున్నావ్?"

మౌనంగా స్లిప్ అందించింది సుచరిత. బొద్దుమీసాల వ్యక్తివేపు చూసింది. అతను సుచరితవేపు చూసి నవ్వి, కౌంటరువేపు నడిచేడు.

"డోంట్ వర్రీ సుచీ! ఎంత తెగించిన హంతకుడైనా యింతమంది జనంలో నిన్నేం చేయలేడు" ధైర్యం నూరి పోసేడు.

"అదికాదు మధూ!...అటు చూడు..." కౌంటరువేపు చూపింది.

బొద్దుమీసాల వ్యక్తి తిన్నగా ఫెల్ట్ హేట్ వ్యక్తి దగ్గరకెళ్ళి అతని చెవిలో ఏదో చెప్పాడు. అంతే!... ఫెల్ట్ హేట్ వ్యక్తి వడివడిగా నడిచిపోయేడు బయటికి.

"పద మధూ! యిది హంతకుడి స్థావరమైయ్యుంటుంది. నా కుడికన్ను పదేపదే అదురుతోంది. నిజంగా నేను మృత్యువుకి సమీపంలో వున్నానేమో!" భయంతో ఆమె మొహం పాలిపోయింది.

"ఆల్ రైట్! పద_వాళ్ళ బారినుండి నిన్నెలా తప్పించాలో నాకు తెలుసు" చెయ్యి అందించాడు సుచరితకి.

మధు చెయ్యి అందుకుని అతని వెంట నడిచింది సుచరి

బొద్దుమీసాల వ్యక్తికోసం క్లబ్బంతా కలయజూసే

మధు. అత నెక్కడా కనిపించలేదు. అంతలోనే అత నె

మాయమయ్యాడో తెలియలేదు మధుకి.

క్లబ్ లోనుంచి బయటపడ్డారిద్దరూ.

# 1

వింటినుంచి వెలువడిన బాణంలా, అడ్డంవచ్చిన జనా

చెల్లాచెదురుచేస్తూ రోడ్డుమీద దూసుకు పోతోంది.

సుచరిత, మధు, ఎక్కిన ఫియట్ కారు.

ఆరున్నర కావస్తూంది.

నగరమంతా విద్యుద్దీపాల వెలుగుతో నిండివుంది. కా

వేసవి కావడం వలన యింకా చీకటి పడలేదు.

రోడ్డును మింగేస్తూ పరుగులెడుతోంది ఫియట్ కా

డ్రైవింగ్ సీట్లో మధు, అతని ప్రక్కనే సుచరిత కూర

న్నారు. మధు చేతిలో స్టీరింగ్ మెలికలు తిరగసాగిం

మధువంక భయం భయంగా చూడసాగింది సుచరి

సముద్రపు అలలవలె ఉవ్వెత్తున లేచిపడుతున్నా

మధు మస్తిష్కంలోని ఆలోచనలు.

ఎవరీ ఫెల్ట్ హేట్ వ్యక్తి? ఉన్నట్టుండి బొద్దుమీస

వ్యక్తి ఎలా మాయమయ్యేడు? ఈ ఆగంతకులెవ్వరు? వీ

చేయబోతున్నారు?

ఆలోచనలు మస్తిష్కాన్ని వేడెక్కిస్తున్నయ్.

అప్రయత్నంగా సుచరిత దృష్టిరియర్ వ్యూపైన బడి

వెంటనే అదిరిపడింది.

"మధూ! ఏదో మోటారు సైకిల్ మనల్ని వెంట

తోంది" అంది భయంగా.

మధు రియర్ వ్యూ పైన నిలిపాడు తన దృష్టిని.

ఫెల్ట్ హేట్ వ్యక్తి!

పళ్లు కొరికేడు మధు. అతనిలో ఏదో పట్టుదల పొడ చూపింది. ఆవేశంగా ఏక్సిలేటర్ని అదిమాడు. కారు గాలితో పోటీపడసాగింది. కారుకీ, మోటారు సైకిల్ కీ మధ్యదూరం పెరగసాగింది. కసిగా నవ్వుకున్నాడు. సంతృప్తి అతని మొహంలో నాట్యమాడింది.

చకచకా ఆలోచించసాగేడు మధు.

అతనెందుకు వెంటాడుతున్నాడు? యిందాక బోడు మీసాల వ్యక్తి తమను వెంటాడమనే చెప్పాడా? అతని ఉద్దేశం ఏమిటి?

ఉలిక్కిపడ్డాడు మధు.

మళ్ళీ రియర్ వ్యూలో ప్రత్యక్షమైంది మోటార్ సైకిల్.

కారుకీ, మోటారు సైకిల్ కీ మధ్యదూరం తరిగిపో సాగింది. క్రమంగా దాని వేగం పెరుగుతోంది.

తప్పించుకోవాలి. ఎలా?

కారుకంటే వేగంగా ఆలోచనలు కదిలిపోతున్నాయి.

క్షణంలో అతని ఆలోచనలు రూపం దాల్చినట్టయింది.

వెంటబడుతున్న మోటారుసైకిల్ రేంజిలో నుండి మాయమవ్వడమే యిప్పుడతని లక్ష్యం!

అంతే! కారు వేగాన్నందుకుంది. స్టీరింగ్ అనూహ్యంగా మెలికలు తిరగసాగింది. చూస్తుండగానే నాలు గైదు మలుపులు తిరిగి మళ్ళీ మెయిన్ రోడ్లో ప్రత్యక్ష మైంది కారు.

తనను హంతకుల బారినుండి కాపాడ్డానికి మధు చేస్తున్న సాహసం సుచరితను ఆశ్చర్యంలో ముంచెత్తు తోంది.

మధు డ్రైవింగ్ చేస్తూనే వెనక్కి తిరిగి చూసేడు మోటారుసైకిల్ కోసం.

ఫెల్ట్ హేట్ వ్యక్తి ఎక్కడా పత్తాలేదు. కనుచూపు మేరలో మోటారుసైకిల్ కనిపించలేదు.

అతని పెదవులమీద చిరుదరహాసం వెలిగింది.

ట్రావెలర్స్ బంగళాముందు ఆగింది కారు. మధు కారు దిగి లోపలకు నడిచేడు. సుచరిత అతన్ని అనుసరించింది. యిద్దరూ గదిలోపల అడుగుపెట్టిన తర్వాత తలుపులు మూసుకున్నాయి.

సరిగ్గా అరక్షణం తర్వాత...

ఫియట్ కారు డిక్కీ తెరుచుకుని ఓ వ్యక్తి బయటకు దూకి ట్రావెలర్స్ బంగళావేపు చూసి తలపంకించేడు.

అతను ఎవరోకాదు—క్లబ్బులో వున్నట్టుండి మాయమైన బొద్దుమీసాల వ్యక్తి!

చటుక్కున అతని జేబులోనుండి ట్రాన్స్‌మీటర్ బయటికి వచ్చింది. తను ఎక్కడున్నదీ తెలియజేసి ట్రాన్స్‌మీటర్ని తిరిగి జేబులో పడేసుకున్నాడు.

జేబులోంచి సిగరెట్టుతీసి వెలిగించుకున్నాడు.

చకచకా పది నిముషాలు దొర్లిపోయేయి.

లోపలకెళ్ళిన మనుష్యులింకా బయటికి రాలేదు. ఇంకా లోపలే వున్నారా? లేక దీనికి వెనుకవేపునుంచి వేరేదారి వుందా? ఆ ఆలోచన రాగానే శరీరం చెమటలు పట్టినట్టయింది.

ఆలోచించి, అంతలోనే ఒక నిర్ణయానికి వచ్చి కోటు జేబులోవున్న పిస్తోల్ని తడిమి చూసుకుని అటువేపు అడుగులేసేడు.

మెల్లగా తలుపుతట్టేను.
లోపల ఏదో యీడుస్తున్న శబ్దం!
గుండె దడదడలాడింది.
మళ్ళీ తలుపు తట్టేడు గట్టిగా.
నిశ్శబ్దం!
ఒక నిమషం తర్వాత తలుపు తెరుచుకుంది.
ఎదురుగా మధు!

తలుపు తీస్తూనే అదిరిపడ్డాడు బొద్దుమీసాల వ్యక్తిని చూసి. అతను తమ ఉనికిని ఎలా కనిపెట్టగలిగాడో అర్థంకాలేదు. మధుకి. అంతలోనే తేరుకున్నాడు.

"ఎవరున్నవ్? ఎందుకు మమ్మల్నిలా వెంటాడుతున్నావ్?"

"మిస్టర్! నీ ప్రశ్నకు సమాధానం తర్వాత. ముందు సుచరిత ఏమైందో చెప్పు?"

"సుచరితా! ఆమెను అప్పుడే యింటిదగ్గర వదిలేసి వచ్చానే!" అన్నాడు అమాయకంగా.

చెంప చెళ్ళుమంది. చెంప తడుముకున్నాడు మధు.

"నీ కాకమ్మ కబుర్లు నా దగ్గర చెప్పకు. బుకాయించాలని అంతకంటే ప్రయత్నించకు. ఒళ్ళు దగ్గరపెట్టుకుని చెప్పు... సుచరిత ఏమైంది?" గద్దించి అడుగుతూ ద్వారం దగ్గర్నుంచి మధును లోనికి తోస్తూ తను లోపలకి ప్రవేశించేడు.

మంచం క్రింద పడున్న సుచరిత బొద్దుమీసాల వ్యక్తి దృష్టిని దాటిపోలేదు.

అంతే! మధు చేతిలో నల్లని పిస్తోలు ప్రత్యక్షమైంది!

"అనవసరంగా నా జోలికి రాకు. కదిలితే కాల్చే

స్తాను" బెదిరించాడు.

పిస్తోలు పట్టుకున్న చేతిని చూసేడు అతను. అతని తలలో ఏదో మెరుపు మెరిసింది. మరోసారి చూసేడు ఆ చేతిని. సందేహంలేదు. ఆ చెయ్యి తనకి బాగా గుర్తు!...

అతను తన చేతిని ఎందుకంతలా చూస్తున్నాడో తెలియక ఒక్క క్షణం చూపు మరల్చేడు మధు.

ఆ ఒక్క క్షణంచాలు. మెరుపులా దెబ్బతీసేడు. మరు క్షణం మధు చేతిలోని పిస్తోలు ఎగిరిపడింది. అతని తల గోడకి కొట్టుకుంది. తల దిమ్మెక్కినట్టయింది. ఊహించని వేగంలో అతని చెయ్యి స్విచ్ బోర్డుపైన పడింది. మరు క్షణం గాఢాంధకారం!

చటుక్కున జేబులోంచి పిస్తోలు తీశాడు బొద్దుమీసాల వ్యక్తి. గురి చూసేడు.

'ఢాం!' మని పేలింది.

అతని గురి తప్పలేదు. మధు నోట్లోంచి సన్నని ఆర్త నాదం వినిపించింది. ఆ బుల్లెట్ మధు కాల్లో దిగివుంటుం దని అతను ఊహించేడు. కాని అతను ఊహించని వేగంలో మధు గదిలోనుంచి బయటకు పరుగుతీసేడు.

మధు వెనకాలే బొద్దుమీసాల వ్యక్తి పరుగుతీసేడు బయటికి.

ఫియెట్ కారు ఆగిన స్థలం వెక్కిరిస్తూ కన్పించింది.

అప్పుడే స్టేండు వేస్తున్న ఫెల్ట్ హేట్ వ్యక్తి ఎదు రయ్యేడు.

"సుధాకర్! హంతకుడు కారులో పరారీ అయ్యాడు."

"యీజిట్! ఆ కారు నేను వచ్చేముందే వెళ్ళింది"

అంటూ పరిగెట్టబోయేడు మోటారుసైకిలు వేపు.

"వద్దు. హంతకుడు మన గుప్పిట్లో వున్నాడు... ముందు సుచరిత సంగతి చూడాలి పద" అంటూ లోనికి నడిచేడు.

సుధాకర్ అతన్ని అనుసరించేడు. ఇద్దరూ సుచరిత పడివున్న గదిలోకి వచ్చేరు.

కడసారి చూపులన్నట్టుగా సుచరిత బరువుగా కళ్ళు తెరిచింది.

"రాజేష్! వెంటనే హాస్పిటలుకి తీసికెళ్తే బ్రతక వచ్చునేమో!"

"లేదు సుధాకర్! ఇవి ఆమె ఆఖరి క్షణాలు" బరువుగా అన్నాడు.

"మీరు ... డిటెక్టివ్ ... రాజేషా?" బొద్దుమీసాల వ్యక్తిని అడిగింది.

"అవును సుచరితా! నేను, సుధాకర్ కలిపి ప్లాన్ వేసి హంతకుణ్ణి పట్టుకోవాలని ప్రయత్నించేం. కాని నిన్ను దక్కించుకోలేకపోయేము."

"నిజంగా...మధుబాబు...హంతకుడా?..." ఆయాసంగా ఊపిరి తీస్తోంది. కొన్ని క్షణాల్లో ఆమె ప్రాణాలు అనంతవిశ్వంలో కలిసిపోతాయని గ్రహించేడు రాజేష్.

"అవును. ఆ మధు యెవరో కాదు..." రాజేష్ యింకేదో చెప్పాలనుకుంటుండగా సుచరిత తల వాల్చేసింది.

## 12

వూరికి దూరంగా ఒక చిన్న పెంకుటిల్లు ముందు ఆగింది పోలీస్ జీప్.

పోలీసులు బిలబిలమంటూ జీప్‌లోనుంచి క్రిందకి దూకేరు.

డిటెక్టివ్ రాజేష్, ఇన్‌స్పెక్టర్ సుధాకర్ కాంపౌండ్‌లో ప్రవేశించేరు. సుధాకర్ తలుపు తట్టేడు.

తలుపు తెరవబడింది.

ఎదురుగా నలభైఏళ్ళ మనిషి!

"ఓ! ఇన్‌స్పెక్టరుగారా! రండి" అంటూ ప్రక్కకు తొలగి దారి యిస్తూ "ఏమిటిలా వచ్చేరు?" అన్నాడు.

"మీతో చిన్న పని బడింది. అన్నట్టు యీయన డిటెక్టివ్ రాజేష్. సుచరిత తరఫున పని చేస్తున్నారు" అని పరిచయం చేసేడు.

"హంతకుడి ఆచూకీ ఏమైనా తెలిసిందా? రాజేష్ గారూ?" అనడిగేడతను.

ఆ క్షణంలోనే డిటెక్టివ్ రాజేష్ దృష్టి ఆ వ్యక్తి ఎడమకాలిపైన బడింది.

"మీ కాలికేం? జరిగింది?"

"అదా...అది...బాత్రూంలో కాలుజారి పడ్డాను... అంతే. నా ప్రశ్నకు సమాధానం చెప్పలేదు మీరు... హంతకుడి ఆచూకీ తెలిసిందా?" మాట తప్పించేడు.

"తెలిసింది" ముక్తసరిగా అన్నాడు.

"తెలిసిందా? ఎవరా కిరాతకుడు? ఎందుకీ హత్యలన్నీ చేస్తున్నాడు?"

"అది నువ్వే చెప్పాలి మిస్టర్."

"నేనా?" ఆశ్చర్యం.

"అవును."

"అదేమిటి? హత్యలకు కారణాలు నేనెలా చెప్పగలను?"

"హంతకుడు నువ్వే గనుక!"

"మీరనేదేమిటి? నాతో పరిహాసమాడుతున్నారా?" కనుబొమలు చిట్లించేడు.

"నీ చేతులకు సంకెళ్ళు వేయడానికేగాని పరిహాస మాడ్డానికిరాలేదు మిస్టర్ జగన్నాథం ఉరఫ్ మధుబాబు" అంటూ హేండ్ కఫ్స్ తీసుకుని ముందుకు వచ్చేడు సుధాకర్.

అంతే. అతని మొహం పాలిపోయింది.

"నో! కాదు... నేను మధుబాబును కాదు..."గట్టిగా అరిచేడు.

"షటప్!" అంటూ జగన్నాథం నెత్తిమీద వున్న విగుతీసి అతని చేతిలో పెడుతూ "ఇప్పుడు చెప్పు. ఇంకా చాలకపోతే నీ చేతికున్న ఆరు వేళ్ళ నడుగు...యింకా కావాలంటే నీ కాలి గాయాన్నడుగు."

జగన్నాథం_కాదు_మధుబాబు తలవంచేడు. అతని చేతులకు సంకెళ్ళు పడ్డాయి.

జగన్నాథం తన గాథను చెప్పాడు:

"మా నాన్నగారు జమీందార్ సూర్యనారాయణ రాజు. నన్నూ, చెల్లాయినీ ఆయన ఎంతో ప్రేమగా చూసేవారు. అమ్మ మా యిద్దర్నీ తన రెండు కళ్ళలాగే చూసేది.

"అప్పుడు చమన్‌లాల్ నాన్నగారిదగ్గర మేనేజర్‌గా పనిచేసేవాడు. లేయాకు పంటకు, అమ్మకానికి సంబంధించిన వ్యవహారాన్నీ అతని చేతులమీదుగా జరిగేది. అతని మీద నమ్మకంకొద్దీ నాన్నగారుకూడా వ్యవహారాలన్నీ అతనికే వదిలేసారు.

ఒకరోజు చమన్‌లాల్ మా యింటికి వచ్చేడు.

"ఏం లాల్! వ్యాపారాన్ని విడిచి యిలా వచ్చేవ్" చమన్‌లాల్ రాకకు ఆశ్చర్యపోతూ అడిగేరు సూ నారాయణరాజుగారు.

"రాక తప్పుతుందా ముఖ్యమైన విషయమాయె" అన్నాడు చమన్‌లాల్.

"ఏమిటో అంత ముఖ్యమైన విషయం?"

"ఇంతవరకు మనలో ఎవళ్ళం బయటపడలేదు...మ స్నేహాన్ని బంధుత్వంగా మార్చే విషయం..." నవ్వేడ చమన్‌లాల్.

ఉలిక్కిపడ్డారు రాజుగారు.

ఆ ఉలికిపాటును గమనించి తన నవ్వును ఆపాడు చమన్‌లాల్.

"చూడండి రాజుగారూ! మీ ఇంట్లోను అబ్బాయి, అమ్మాయి వున్నారు. అటు నా ఇంట్లోనూ అంతే. యీ రెండు జంటలను కలిపి మనం బంధువులుగా మారడం కన్నా వేరే అదృష్టం ఏముంది?"

"లాల్!" గర్జించారు రాజుగారు.

"తాహతు తెలుసుకుని మాట్లాడ్డం నేర్చుకో. నా దగ్గర పన్చేసిన నౌఖరువి..." ఉద్రేకంతో ఊగిపోతు న్నారు రాజుగారు.

త్రాచుపాములా లేచేడు చమన్‌లాల్.

"చూస్తాను రాజూ—నువ్వెంతో, నీ కుటుంబమెంతో నాతో శత్రుత్వం నాగుపాముతో శత్రుత్వమని నిరూపి స్తాను. నీ వంశాన్ని నామరూపాల్లేకుండా చేయకపోతే నా పేరు చమన్‌లాల్ కాదు" అంటూ బయటికి నడి

చేడు చమన్‌లాల్. అటు తర్వాత మా దగ్గర పని మానేసి జ్యాయలరీ షాప్ తెరిచాడు.

నిజంగా చమన్‌లాల్ త్రాచుపాముకన్నా ప్రమాదమైనవాడు.

కొన్నాళ్ళకు మా చెల్లికి సంబంధం కుదిరి పెళ్ళి నిశ్చయమైంది. కానీ ఈ చమన్‌లాల్ వేసిన విషపు చుక్క ఆ పెళ్ళిని నామరూపాల్లేకుండా చెరిపేసింది. ఎలా పుట్టిందో...ఎక్కడ పుట్టిందో తెలియదుగాని — చమన్‌లాల్ జువెయల్ షాపులో ఒక నెక్లెస్ మా చెల్లాయి దొంగిలిస్తూండగా పట్టుబడిందన్న అపవాదొకటి పుట్టింది. మచ్చలేని కుటుంబానికి చిన్న మచ్చ చాలు. చెల్లాయి పెళ్ళి, దానితోపాటు నాన్నగారి గుండె ఒక్కసారే ఆగిపోయేయి. కానీ అంతటితో ఈ చమన్‌లాల్ పగ మాత్రం ఆగలేదు.

సినిమాకని వెళ్ళిన చెల్లాయి మరుసటిరోజు తెల్లవారుజామున తలుపులు తెరుస్తున్న అమ్మకు శవంగా గుమ్మం ముందు దర్శనమిచ్చింది. చెల్లాయిని బలవంతంగా ఎవరో అనుభవించి చంపేరు. ఆ ఘోరదృశ్యాన్ని చూసిన తర్వాత యింక ఆ మాతృహృదయం ఎలా నిలవగలదు? రక్తాన్ని కన్నీటి ధారలుగా ప్రవహింపజేసి, భర్తనూ, బిడ్డనూ వెతుక్కుంటూ ఈ పాపిష్టిలోకంనుండి తరలిపోయింది అమ్మ.

ఇక మిగిలింది నేను—ఏకాకిని. జరిగిన ఘోరాన్నింటికీ చమన్‌లాల్ కారకుడని తెలుసు. అయినా అతన్నేమీ చేయలేని నిర్భాగ్యస్థితి నాది. అంతే వెనుక ముందులు ఆలోచించకుండా అస్సాం పారిపోయేను. రెండు

సంవత్సరాలు ప్రశాంత వాతావరణంలో అజ్ఞాతంగా గడిపేను.

రోజురోజుకీ నాలో పగ అధికం అవుతోంది. రాత్రీ పగలూ చనిపోయిన నా వాళ్ళ ఆత్మలు నా చుట్టూ తిరిగి 'మా ఆత్మలకు శాంతి చేకూర్చవా' అంటూ నా ముందు హృదయ విదారకంగా ఘోషించేవి. కళ్ళుమూసినప్పుడల్లా చెల్లెలు రూపం నా కళ్ళముందు కదిలేది.

జరిగిన ఘోరాలకు నేను పగతీర్చుకోకపోతే ఆ పగ నన్ను దహించివేసేట్టుంది. అందుకే బయలుదేరేను అస్సాంనుండి-ఏ పగతో చమన్‌లాల్ మా వంశ నాశనానికి పూనుకున్నాడో అదే పగతో నేనూ వాడి వంశ నాశనాన్ని కావించాలనుకున్నాను.

అందుకే పథకం వేసేను. వేషం మార్చేను. జగన్నాథంగా అవతారం ఎత్తి నమ్మకంగా చమన్‌లాల్ దగ్గర గుమాస్తాగా చేరేను. సమయం చూసి నా పగ తీర్చు తీర్చుకున్నాను.

నా పగ తీర్చుకున్నానుగాబట్టి పట్టుబడిపోయేనన్న బాధ, భయం లేవు. ఆ దుర్మార్గుడు చమన్‌లాల్ కారణంగా నా తండ్రి గుండెఆగి మరణించినపుడు ఏ చట్టమూ శిక్షించలేదు! భర్తను, కుమార్తెను కోల్పోయి పిచ్చిదానిలా హృదయవిదారకంగా ఏడ్చి తనువు చాలించిన నా తల్లి మరణానికి కారణం ఈ చమన్‌లాల్. అప్పుడు కూడా ఏ న్యాయస్థానమూ అతన్ని శిక్షించలేదు! ఆఖరికి నా ముద్దుల చెల్లెలు సినిమాకని బయల్దేరి శీలాన్ని కోల్పోయి శవరూపంలో దర్శన మిచ్చింది. అంత ఘోరంగా, క్రూరంగా అనుభవించి మరీ చంపిన రాక్షసుడు చమన్‌లాల్.

ఇన్ని దురాగతాలకు కారణమైన అతణ్ణి ఏ చట్టమూ, న్యాయస్థానమూ అడ్డుకోలేదు! నా కుటుంబాన్ని నామ రూపాలు లేకుండా నాశనం చేయాలని ప్రయత్నించిన చమన్‌లాల్ మీద పగ తీర్చుకోవడంకోసం నేను చట్టాన్ని, న్యాయశాస్త్రాన్ని ఎదిరించాను. నే నెందుకు శిక్ష అనుభవించాలి? అనుకుని పారిపోయేను. కాని యిప్పుడు తెలుసుకున్నాను. తప్పు చేసిన ఏ దోషిఅయినా సరే ఏదో ఒక రూపంలో ఎప్పుడో ఒకప్పుడు శిక్ష అను భవింపక తప్పదు,''అని తల వంచుకున్నాడు జగన్నాథం ఉరఫ్ మధుబాబు.

—: ఐపోయింది :—

# మృత్యు శిఖరం

యస్. గీతారాణి

భాస్కర్ ఆ యువతిని మరోసారి చూసాడు.

దివినుంచి భువికి దిగివచ్చిన అప్సర కన్యలా వుందా యువతి.

ఎర్రటి పోలిస్టర్ చీర, అదేరంగు జాకెట్.

ఎత్తుగా బన్ ముడి వేసింది, వారగా ఎర్ర గులాబి తురిమింది.

పెదవులకు ఎర్రటి లిప్ స్టిక్.

మెడలో ఎర్ర రాళ్ళ నెక్లెస్, ఓ చేతికి ఎర్రటి గాజులు, మరోచేతికి రిస్ట్ వాచి, చేతిలో ఎర్రటి బాగ్.

రెడ్ లైట్ జంర్.

భాస్కర్ లోలో అనుకొంటూ, తన చెవర్ లెట్

కారుని ఆమె ముందు ఆపాడు.

"మేడమ్. బస్ వాళ్ళు స్ట్రైక్ చేసారు. ఈరోజు బస్‌లు నడవవు. మీకు అభ్యంతరం లేకపోతే నా కారు ఎక్కండి."

ఆ యువతి రెప్పలు టప,టపా కొట్టింది.

అందమైన ఆ కనురెప్పలమీద నైస్‌గా చిన్న ముద్దు పెట్టుకొంటే అని అనుకొన్నాడు లోలోపల.

బాక్ డోర్ తెరిచాడు.

ఆ యువతి విచ్చిన గులాబిలా నవ్వి కారు ఎక్కింది.

"ఎడ్రస్ ప్లీజ్," అన్నాడు.

ఆ యువతి ఎడ్రస్ చెప్పింది.

భాస్కర్ కారుని ముందుకు దూకించాడు.

అతడి దృష్టి రోడ్‌మీదున్నా మనసు మాత్రం ఆ యువతిమీదనే వుంది.

అంత సౌందర్యంగల యువతిని అతను ఇంతవరకూ చూసివుండకపోవటమే అందుకు కారణం.

"మీ పేరు?"

ఆ యువతి సన్నని స్వరాన ప్రశ్నించింది.

"భాస్కర్. మీ పేరు?"

"మీనా."

"బ్యూటిఫుల్ నేమ్."

"మీరు యేం చేస్తున్నారు?" మీనా అడిగింది.

"తరగని ఆస్తిని తరిగిస్తున్నాను" అతను పెద్దగా నవ్వుతూ అన్నాడు.

"మీరేం చేస్తున్నారు?"

తిరగవేసి ప్రశ్నించాడు.

"సేల్స్‌గరల్‌గా పనిచేస్తున్నాను."

మీనా జవాబు వెనుక ఏదో వేదన దాగివున్నా అది అతను గుర్తించలేదు. ఆ తరువాత అతను యేదేదో మాట్లాడాడు.

ఆమె అందంగా మాట్లాడింది.

పది నిముషాలలో ఒక చిన్న పెంకుటింటిముందు ఆపాడు కారుని.

ఆ ఇంటికి దగ్గరగా ఒక్క ఇల్లూ లేదు.

ఆ ఇంటికి దూరంగా కొన్నిఇళ్లు వున్నా, ఏ ఇంట్లోనూ లైట్ వెలుగుతున్నట్లు లేదు.

మీనా కారు దిగి బాగ్‌లోంచి తాళంచెవి బయటికి తీస్తూ, "కాఫీ తీసుకొందురుగాని లోపలకి రండి," అని అంది.

అందమైన ఆడపిల్ల ఆహ్వానాన్ని కాదనగల శక్తి ఏ పురుషుడికి వుండదు. భాస్కర్ ఆమెతో ఇంట్లోకి నడిచాడు.

గది పెద్దదిగానే వుంది.

టేబిలు, కుర్చీ తప్పించి మరేమీ లేవు.

"మీరు ఒక్కరే వుంటున్నారా?"

కుర్చీలో కూర్చుంటూ అడిగాడు.

"అవును. నాకు నా అన్నవారు ఎవరూ లేరు" అని చెప్పి వంటింట్లోకి వెళ్ళింది మీనా.

ఐదు నిముషాలలో రెండు కప్పులతో బూస్ట్ తీసుకు వచ్చింది.

"ఎందుకండీ శ్రమ పడ్డారు" మొహమాటంగా అన్నాడు.

"నేనూ తీసుకొంటున్నానుగా. నాకోసం తీసుకోండి" మీనా చిన్నగా నవ్వుతూ, కప్పు అతని చేతికందించింది.

సన్నటి మృదువాటి ఆమె చేతి వ్రేళ్ళు భాస్కర్ చేతికి తగిలాయి. ఆమె శరీరంలోంచి తన శరీరంలోకి కరెంట్ ప్రాకి వచ్చిందేమో నని అనుకొన్నాడతను.

మెత్తటి ఆమె చేతిని ఎడం చేత్తో సన్నగా నొక్కాడు.

"చల్లారిపోతోంది. తీసుకోండి" మీనా తన చేతిని మృదువుగా విడిపించుకొన్నది.

భాస్కర్ తన తొందరపాటుకు సిగ్గిలుతూ బూస్ట్ గడగడా త్రాగేసి, కప్పు క్రింద పెట్టాడు.

బూస్ట్ గొంతులోనికి దిగుతుంటే ఏదోలా అనిపించిం దతనికి.

కానీ ఏదీ గుర్తించే స్థితిలో లేడు అతను.

"మీరు ఏంపనిమీద బయలుదేరారు?"

"నేనా...నా ఫ్రెండ్ బర్త్ డే పార్టీకి వెళ్ళి వస్తున్నాను. వాడు ..వాడి..."

భాస్కర్ తన మాటల్ని అసంపూర్తిగా వుంచేసి, తల వెనక్కి వాల్చేసాడు.

మీనా వీధి తలుపులు గడియపెట్టి, రెండు కప్పులు శుభ్రంగా కడిగి, భాస్కర్ దగ్గరకి వచ్చింది.

స్పృహ కోల్పోయి వున్నాడతను.

మీనా తన చేతి వాచీని చూసుకొన్నది.

తొమ్మిది అయింది.

ఆమె విసుగ్గా అటూ, ఇటూ పచార్లు చెయ్యసాగింది.

తొమ్మిదిన్నర అయేసరికి ఆమె ఇంటి ముందు ఒక కారు వచ్చి, ఆగింది.

కారు ఆగిన శబ్దం విని మీనా తలుపులు తెరచింది.

ఒక అందమైన యువకుడు కారు దిగాడు.

"మీనా! అంతా రెడీయా?"

మౌనంగా రెడీయే అన్నట్లు తల వూపింది.

"గుడ్!"

ఆ వ్యక్తి మీనాను దగ్గరగా తీసుకొని, ఆమె చెం మీద చిన్నగా ముద్దు పెట్టుకొన్నాడు.

మీనా చిరాగ్గా అతని ముఖాన్ని దూరంగా నె వేసింది.

"ప్రణయాలకి ఇది సమయం కాదు. లోపల భాస్క అనే అతను వున్నాడు" అని అంది.

"డార్లింగ్! చెప్పిన ప్రతి పనిని చాలా చక్క చేస్తావు" అన్నాడు ఆమెను మెచ్చుకోలు కళ్ళతో చూస్తూ.

ఆమె ఏం మాట్లాడకుండా లోపలకి నడిచింది.

ఆ వ్యక్తి గదిలోకి వచ్చి, తెలివితప్పి వున్న భాస్కర్‌ను భుజాన వేసుకొని, కారులో పడుకోబెట్టి తిరిగి గదిలోకి వచ్చాడు.

మీనా కుర్చీలో కూర్చొని అలసటగా రెండు చేతులలో తల పట్టుకొంది.

"మీనా! నీవు వెంటనే యీ ఇల్లు ఖాళీ చేసేయ్!"

ఆమె తల ఎత్తి అతన్ని చూసి, అలాగే అన్నట్లు తల వూపింది.

"నీవు ఎలాంటి వెర్రివేషాలు వేసినా రవి శవాన్ని మాత్రమే చూస్తావు. వాడిని దృష్టిలో పెట్టుకొని నాకు ఇలాగే సహకరిస్తూ వుండు."

ఆ వ్యక్తి కర్కశంగా పలికి బయటకి నడిచాడు.

# 2

మాధవ్ లైబ్రరీలో న్యూస్ పేపర్ చూస్తున్నాడు.

అతనికి విమల్ అనే తమ్ముడు తప్పించి మరెవరూ లేరు.

డిగ్రీ చేతికి రాగానే వుద్యోగంకోసం వేట ప్రారంభించాడు మాధవ్.

మాధవ్ పేపర్ తిరగవేస్తూ, వాంటెడ్ కాలమ్‌లో వుద్యోగ వివరాల ప్రకటన ఒకటి చూసి ఎగిరి గంతేసినంత పని చేసాడు.

వుద్యోగం హైద్రాబాద్‌లో. ఒక ఫ్యాక్టరీ అధినేతకు పి.ఏగా పనిచెయ్యాలి. జీతం తొమ్మిది వందలు.

మాధవ్ తన డైరీలో వుద్యోగ వివరాలు, ఎడ్రస్ ఎక్కించుకొని ఇంటికి వచ్చాడు.

విమల్ కాలేజి నుంచి అప్పుడే ఇంటికి వచ్చాడు.

విమల్ వుద్యోగ వివరాలు విని పెదవి విరిచాడు.

"అన్నయ్యా! ఈ మధ్య వూర్లో చాలా మోసాలు జరుగుతున్నాయి. ఈ జాబ్ మంచిది కాదేమో ననిపిస్తున్నది. ఇద్దరు ముగ్గురు యువకులు మాయమైనారని మా ఫ్రెండ్స్ అనుకొంటూ వుంటే విన్నాను," అతను తన మనసులో అనుమానాన్ని బయట పెట్టేసాడు.

మాధవ్ తమ్ముడి భయానికి ఫక్కున నవ్వేశాడు.

"విమల్! ప్రతీదానికి భయపడతావేమిరా. చెట్టంత వున్న నన్ను ఎవడేం చేస్తాడు?"

"ఏమో, అన్నయ్యా! నువ్వు ఈ జాబ్‌కోసం వెళ్ళటం నా కిష్టంలేదు. ప్రపంచంలో మోసాలు పలురకాలుగా వుంటాయి. ఎంతటివారినైనా చాలా తెలివిగా మోసగిస్తూ

వుంటారు కొందరు."

"గుండె ధైర్యం లేనివాళ్ళు, తెలివి తక్కువవాళ్ళు మోసగింపబడతారు" మాధవ్ తమ్ముడి వాదనను ఖండిస్తూ అనేశాడు.

విమల్ మరేం మాట్లాడలేకపోయాడు.

అన్నతో అతిగా వాదించే అలవాటు లేదు అతనికి.

మాధవ్ తమ్ముడికి ఎంతగానో నచ్చచెప్పి, ఆ మర్నాడు హైదరాబాద్‌కి ప్రయాణమైనాడు.

మాధవ్ హైదరాబాద్ చూడటం అదే ప్రథమం.

తళతళ లాడుతున్న హుస్సేన్ సాగర్, రవీంద్రభారతి, పబ్లిక్ గార్డెన్, చూస్తూ ఎంతో ముచ్చటపడిపోయాడు.

ఇంటర్‌వ్యూ కాగానే అన్నీ చూడాలని అనుకొన్నాడు.

అరగంట తరువాత ఒక పెద్ద బంగళా ముందు ఆగింది ఆటో.

మాధవ్ ఆటో డ్రైవర్‌కి డబ్బులు ఇచ్చివేసి, బంగళానంతా ఒకసారి పరికించిచూశాడు. భవనం చాలా పెద్దదే.

బయట గూర్ఖా కాపలా లేకపోవటంతో మాధవ్ గేటు తెరచి, లోపలకి అడుగుపెట్టాడు.

కాలింగ్ బజర్ నొక్కి వచ్చే వ్యక్తులకోసం ఎదురు చూస్తూ నిలుచున్నాడు.

ఐదు నిముషాలలో ఓ నౌకరు వచ్చి తలుపు తెరిచాడు.

మాధవ్ తను ఎందుకు వచ్చినది చెప్పుకొన్నాడు,

"అయ్యగారు ఆ గదిలో వున్నారు వెళ్ళండి" నౌఖరు ఒక గది చూపించాడు.

మాధవ్ చూపించిన గదిలోకి వెళ్ళాడు.

ఆ గదిలో ఒక అందమైన యువకుడు కూర్చొని వున్నాడు.

"నమస్తే!"

మాధవ్ వినయంగా నమస్కరించాడు.

ఆ యువకుడు ప్రతి నమస్కారం చేసి, మాధవ్ కూర్చొనేందుకు సీట్ చూపించాడు.

మాధవ్ కూర్చొని తన సర్టిఫికేట్స్ చూపించాడు.

ఆ యువకుడు సర్టిఫికేట్స్ ఓసారి చూసేసి, అవి టేబిల్ పై పెట్టి, మాధవ్ ముఖంలోకి చూసాడు.

"మిస్టర్ మాధవ్! నాకు కావలసింది ఈ సర్టిఫికెట్స్ కావు. మీ ధైర్య సాహసాలు."

మాధవ్ వింతగా చూసాడు.

"యస్. అర్ధరాత్రి శ్మశానంలోకి వెళ్ళగిలిగే వాడు నా సెక్రటరీ కావాలి. క్రూరజంతువులను చూసికూడా బెదరని వాడికే ఈ జాబ్!"

ఆ యువకుడు టేబిల్ పైనున్న పేపర్ వైట్ అటూ, ఇటూ త్రిప్పుతూ అన్నాడు.

మాధవ్ కళ్ళలో ఆశ్చర్యం కదలాడింది.

మాధవ్ కుర్చీలో అటూ, ఇటూ ఇబ్బందిగా కదిలాడు.

"సార్! పిరికితనం అంటే నాకు చాలా అసహ్యం. చిన్నపుడు పదో ఏట మా వూరిలో చింతతోపుల్లో దెయ్యాలున్నాయని అంతా అంటే, నేను ఆ తోపుల్లో ఓ రాత్రి అంతా దెయ్యంకోసం కాపుకాసాను. ఏ దెయ్యం నాకు కనిపించలేదు. ఇంక క్రూరమృగాలంటూరా? అవి ఇంతవరకూ నాకు ఎదురు పడలేదు. ఒకవేళ పడితే శక్తి వున్నంత వరకూ పోరాడాలనే వుంది" చెప్పాడు మాధవ్.

ఆ యువకుని కళ్ళలో చిత్రమైన కాంతి కదలాడిం
పేపర్ వైట్‌ని త్రిప్పుతున్న అతని కుడిచేయి, దా
అదిమి పట్టింది. అతని పిడికిట్లో పేపర్ వైట్ నలిగిపో
న్నదా అనేంత గట్టిగా పిడికిలి బిగించాడు.

తెల్లటి చేతిమీద నీలి నరాలు వుబ్బి స్పష్టంగా కని
స్తున్నాయి.

"గుడ్! నీలాంటి వ్యక్తే కావాలి నాకు. ధైర్యాని
ధైర్యం చూపేవాడంటే నాకు చాలా ఇష్టం!"

ఆ యువకుడు కుర్చీలోంచి నిలుచున్నాడు.

అతని అందమైన వదనం ఎర్రగా మారిపోయింది.

కళ్ళలో ఎర్రటి జీరలు కదలాడాయి.

అతనిలో వచ్చిన మార్పుకు మాధవ్ కొంత కలవ
పడ్డాడు.

ఎందుకో గుండెలు దడదడలాడాయి.

అతనికి తమ్ముడి మాటలు చప్పున గుర్తుకు వచ్చాయి.

ఏదో అందామని చూసాడు.

కాని అప్పటికే ఆలస్యమయిపోయింది.

ఆ యువకుడు రుమాలు తీసి మాధవ్ ముక్కు దగ్గర
వుంచాడు.

మాధవ్ గట్టిగా వూపిరి పీల్చి, తల వెనక్కి
వాల్చేసాడు.

ఆ యువకుడు తృప్తినిండిన చూపులతో మాధవ్‌ని
కొద్ది క్షణాలు చూసి, గది బయటకు వచ్చాడు.

హాలులో నౌకరు, మరో ఇద్దరు వ్యక్తులు పేక ఆడు
తున్నారు. ఆ యువకుని చూడగానే పేక బల్లపై పడేసి,
వినయంగా లేచి నిలుచున్నారు.

"జాన్! మాధవ్‌ని తీసుకొని నేను వెళ్ళిపోతున్నాను. జాగ్రత్త! ఎలాంటి పొరపాట్లు చెయ్యకండి."

ఆ యువకుడు ఇంకొద్ది నిముషాలు మాట్లాడి, మాధవ్ వున్న గదిలోకి వెళ్ళాడు.

# 3

విమల్ అన్నయ్య వస్తాడేమోనని, నాలుగురోజుల నుంచి ఎదురుచూస్తున్నాడు. ఇంటర్‌వ్యూ కాగానే వచ్చేస్తానని చెప్పిన మాధవ్ నాలుగురోజులైనా తిరిగి రాకపోవటంతో విమల్ చాలా గాబరాపడిపోయాడు.

ఇంట్లో నిలువ బుద్ధికావటంలేదు. వీధిలోకి వెళ్ళ బుద్ధి కావటంలేదు. ఫ్రెండ్స్ మాటలు ఒక్కొక్కటి గుర్తు కొస్తుంటే అన్న ఏ ప్రమాదంలో చిక్కుకోలేదు కదా అని భయపడుతున్నాడు.

ఆ సాయంత్రం మిత్రులు నలుగురు విమల్ ఇంటికి వచ్చి, అతన్ని బలవంతంమీద బీచికి తీసుకుపోయారు.

ఐదుగురు బీచిలోకి అడుగుపెట్టేసరికి ఒకచోట జనం గుంపుగా కనిపించారు.

అంతా గుంపును తోసుకుంటూ ఆ మధ్య ఏముందా అని చూసారు.

గుంపు మధ్యలో ఒక వ్యక్తి పడివున్నాడు.

అతనికి ఒక చేయిలేదు, కాలులేదు.

మనిషి చాలా వికృతంగా చంపబడి వున్నాడు.

ఆ వ్యక్తిని చూస్తూనే విమల్ "అన్నయ్యా!" అని గావుకేకవేసి, ఆ శవంమీద పడి రోదించాడు.

విమల్ మిత్రులు మాధవ్‌ను సులభంగా గుర్తించారు.

ఇన్ స్పెక్టర్ శామ్యూల్ చుట్టూ మూగివున్న వా దూరంగా తరిమివేసి, విమల్ మిత్రులను ఆ శవా గురించి ప్రశ్నించాడు.

వాళ్ళు మాధవ్, విమల్ అన్నదమ్ములని చెప్పారు

ఇన్ స్పెక్టర్ శోదిస్తున్న విమల్ ని వూరడిం మాధవ్ చావుకు కారణం అడిగాడు.

విమల్ ఏడుస్తూనే జరిగినదంతా చెప్పాడు.

ఉద్యోగానికి వెళ్ళిన అన్న అలా సముద్రం పాః టానికి కారణం అతనికి బోధపడటం లేదు.

తల్లీ, తండ్రీ సర్వం అన్నీ అన్నయ్యే అనుకొనే ఆ డికి ఆ అన్న మామూలుగా చనిపోలేదని, ఏదో జంతు చేత చంపబడి, ఆ తరువాత సముద్రంపాలయాడని ఇ స్పెక్టర్ ద్వారా తెలుసుకొన్న విమల్ దుఃఖాన్ని ఆపుక లేకపోయాడు.

4

"రాజాగారూ! నా పేరు విమల్. మా అన్నయ్య మాధవ్ ని ఎవరో ఘోరాతిఘోరంగా హత్యచేశారు" విమల్ రుద్ధమైన గొంతుతో అన్నాడు.

"ఏం జరిగిందో వివరంగా చెప్పండి" అడిగాడు డిటెక్టివ్ రాజా.

విమల్, మాధవ్ ఇంటర్ వ్యూకు వెళ్ళిన దగ్గరనుంచి అంతా చెప్పాడు.

"రాజాగారూ! ఇన్ స్పెక్టర్ గారికి అంతా చెప్పాను. ఆయన అన్నయ్యను చంపిన కిరాతకులను పట్టుకొంటానని అన్నారు. కానీ పోలీస్ డిపార్టుమెంట్ మీద అంత నమ్మకంలేక మీ దగ్గరకు వచ్చాను. అన్నయ్యను

ఇంటర్వ్యూ చేసిన వ్యక్తులే చంపివుంటారని నా అను మానం. నేను పేదవాడిని, ఫీజు ఇచ్చుకోలేను'' అతను చెమర్చిన కన్నులతో అన్నాడు.

''విమల్! ఫీజును గురించి ఆలోచించకు. మీ అన్నయ్యను చంపిన కిరాతకుల్ని పట్టుకోనేందుకు ప్రయత్నిస్తాను. మీరు మీ ఇంటికి వెళ్ళండి'' రాజా వూరడింపుగా అన్నాడు.

విమల్ కళ్ళు మెరిశాయి.

మరోసారి డిటెక్టివ్‌కు నమస్కరించి, లేచి నిలబడ్డాడు.

''మీ ఇంటి ఎడ్రస్ ఇచ్చివెళ్ళండి,'' అసిస్టెంట్ గోపి నోట్‌బుక్ పెన్ పట్టుకొని అన్నాడు.

విమల్ ఎడ్రస్ చెప్పి, ఇంటిదారి పట్టాడు.

''గోపీ! డ్రెస్ చేసుకో. ఇన్‌స్పెక్టర్ శ్యామ్‌దగ్గరకు వెళ్ళి కేసు వివరాలు తెలుసుకొందాం!'' అన్నాడు డిటెక్టివ్ రాజా కుర్చీలోంచి లేస్తూ.

గోపి ఐదునిముషాలలో డ్రెస్ చేసుకొని వచ్చాడు.

ఇద్దరూ తమ ఫియెట్ కారులో పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళారు.

ఇన్‌స్పెక్టర్ శామ్యూల్ డిటెక్టివ్‌లని చూసి, విష్ చేసి ''ఏమిటిలా దయచేసారు?'' అని అడిగాడు నవ్వుతూ.

''శ్యామ్! మొన్న బీచిలో దొరికిన మాధవ్ శవం కేసు ఎంతవరకు వచ్చింది?'' అని ప్రశ్నించాడు డిటెక్టివ్ రాజా.

''మాధవ్ ఒక్కడే కాదు, మరికొందరు కూడా ఇదే

రీతిలో అంటే జంతువులచేత చంపబడ్డారు. కొం
ఆత్మహత్యలు అన్నట్టుగా కూడా వున్నాయి."

"వ్వాట్?" రాజా ఆశ్చర్యంగా అన్నాడు.

"మొట్ట మొదటి కేసు తాజ్. ఉమెన్స్ కాలేజి వి
ర్థిని. ఎవరో ఒక కుర్రవాడిని ప్రేమించింది. ఇంట్లోవ
ఆ కుర్రాడితో తిరగవద్దని శాసించారట. తాజ్ అతని
పారిపోతున్నట్లుగా ఇంట్లో లెటర్ వ్రాసిపెట్టి వె
పోయింది. కానీ మరో పదిరోజులకు ఆమె శవం రైల్
పట్టాలక్రింద దొరికింది.

తర్వాత భాస్కర్. బాగా డబ్బున్నవాడు. త
తండ్రులకు ఒక్కడే కొడుకు. మిత్రుడి బర్త్ డే పార్టీ
వెళ్ళాడు. వెళ్ళినవాడు ఇంటికి తిరిగి రాకపోయేసరి
అతని తల్లి, తండ్రులు నాకు రిపోర్ట్ ఇచ్చారు. వాళ్ళు
రిపోర్ట్ ఇచ్చిన నాలుగురోజులకే భాస్కర్ శవం బీ
ఒడ్డున దొరికింది.

ఇలాంటి కేసులే మరో నాలుగైదు దొరికాయి.
హంతకుడు ఎవడో చాలా చిత్రంగా హత్యలుచేసి
తప్పించుకొంటున్నాడు. వీళ్ళు ఏ కారణంచేత చంపబడు
తున్నారో అర్థం కావటంలేదు. ఆ హంతకుడు ఏ పిచ్చి
వాడో అయివుండవచ్చునిపిస్తున్నది.

మేము హంతకుడిని పట్టుకొనేందుకు తీవ్ర ప్రయ
త్నాలే చేస్తున్నాము. విమల్ ద్వారా మాధవ్ ఇంటర్
వ్యూకు వెళ్ళిన ఎడ్రస్ తెలుసుకొని, హైదరాబాద్‌లో
క్రైమ్‌బ్రాంచి ఇన్‌స్పెక్టర్ థామస్‌కు మాధవ్ కేసు
వివరాలు తెల్సుకోమని ట్రంకాల్ చేసి చెప్పాను.

మాధవ్ ఇంటర్‌వ్యూకు వెళ్ళిన ఇంటిగల ఆయన పేరు

జాన్. ఆయనకు చాలా తక్కువ అప్లికేషన్స్ వచ్చా యట. ఆ వచ్చిన అప్లికేషన్ తాలూకు వ్యక్తులు కొంత మంది మాత్రమే ఇంటర్‌వ్యూకు వచ్చారట.ఇంటర్‌వ్యూకు రానివారిలో మాధవ్ కూడా వున్నాడు. జాన్, సుందర్ అనే వ్యక్తిని తన సెక్రటరీగా వేసుకొన్నాడట. థామస్ అందించిన సమాచారం ఇది'' ఇన్‌స్పెక్టర్ చెప్పటం ఆపి, రాజా ముఖంలోకి చూసాడు.

''మాధవ్ జేబులో అనుమానించదగిన ఆధారాలు ఏమైనా దొరికాయా?''

ఇన్‌స్పెక్టర్ లేదన్నట్లు తల వూపాడు.

''శ్యామ్! త్వరలోనే హంతకుడిని పట్టుకొంటాను,'' అని డిటెక్టివ్ రాజా తన అసిస్టెంటుతో బయటకి నడి చాడు.

''ఇప్పుడు ఏం చేద్దామంటారు?'' గోపి కారుని స్లోగా పోనిస్తూ అడిగాడు.

''గోపీ! మాధవ్ ఇంటర్‌వ్యూకు వెళ్ళినది లేనిది తెలుసుకోవాలంటే అతను హైదరాబాద్‌లో దిగి ఎటు వెళ్ళినది తెలుసుకోవాలి. మనం హైదరాబాద్ వెళ్ళి టాక్సీ డ్రైవర్లని, ఆటోడ్రైవర్లని పట్టుకొంటే మాధవ్ జాడ ఏమైనా తెలియవచ్చు. నువ్వు విమల్ దగ్గరకి వెళ్ళి మాధవ్ ఫోటోలు రెండు అడిగి తీసుకురా. మనం సాయంత్రం హైదరాబాద్ వెళదాం!'' అన్నాడు డిటెక్టివ్ రాజా.

## 5

ఆ సాయంత్రమే డిటెక్టివ్‌లు ఇద్దరూ హైదరా బాద్‌కు ప్రయాణమైనారు.

ఇద్దరూ హోటల్ మదీనాలో బసచేశారు.

టిఫిన్ తినేసి స్టేషన్‌కు బయలుదేరారు.

మాధవ్ ఎక్కిన ట్రైన్ రావటానికి ఇంకా ఒ
గంట టైముంది.

గోపీ టాక్సీలమీద, రాజా ఆటోలమీద దండయాత్ర
ప్రారంభించారు.

రాజా మాధవ్ ఫోటోను ఒక్కో ఆటో డ్రైవర్‌కి
చూపిస్తూ అతన్ని గురించి అడుగుతున్నాడు.

పదిహేను నిమిషాలలోనే అతని ప్రయత్నం
ఫలించింది.

మాధవ్‌ని ఎక్కించుకొన్న ఆటో డ్రైవరు మాధవ్
ఫోటో చూసి, అతను తన ఆటోలో యెక్కాడని
చెప్పాడు.

రాజా తేలిగ్గా నిట్టూర్చి, టాక్సీడ్రైవర్లతో తంటాలు
పడుతున్న తన అసిస్టెంట్‌ని పిలిచాడు.

తన అసిస్టెంట్‌తో ఆ ఆటో ఎక్కాడు.

అరగంట తరువాత జాన్ బంగళాముందు ఆగింది
ఆటో.

డ్రైవర్‌కు డబ్బు ఇచ్చివేసి, ఇద్దరూ లోపలికి నడి
చారు.

తలుపులు తెరిచే వున్నాయి.

నౌకరు హాల్లో సోఫాలు తుడుస్తున్నాడు.

డిటెక్టివ్‌ల నిద్దరినీ చూడగానే "మీరూ..."
అంటూ ఆగిపోయాడు.

"నేను ప్రైవేటు డిటెక్టివ్‌ని. ఇతను నా అసిస్టెంట్.
మీ అయ్యగారితో పనుండి వచ్చాను. వున్నారా
ఇంట్లో?"

డిటెక్టివ్‌లు అనగానే నౌకరు గతుక్కుమన్నాడు.

పైకి ఎలాంటి ఖంగారుని కనిపించనియ్యకుండా "అలా కూర్చోండి. అయ్యగార్ని పిలుస్తాను" అని మేడ మీదకు వెళ్ళాడు.

కొద్దిసేపటి తర్వాత జాన్ వచ్చాడు.

రాజా తమని పరిచయం చేసుకొన్నాడు.

"మీ గురించి పేపరులో తరచూ చూస్తుంటాను రాజాగారూ! ఇలా మనం కలుసుకోవటం నాకు చాలా ఆనందంగా వుంది" అని నౌకరుని పిలిచాడు. ఇద్దరికి డ్రింక్స్ తెమ్మని చెప్పాడు.

రాజా వెళ్ళబోతున్న నౌకరును ఆపి "జాన్! మేము వచ్చింది డ్రింక్స్ తీసుకొందుకు కాదు" అన్నాడు.

జాన్ ఆశ్చర్యంగా చూశాడే కాని ఏం ప్రశ్నించ లేదు.

"మాధవ్ ఇక్కడకు వస్తే రాలేదని ఎందుకు అబద్ధ మాడారు?" రాజా నింపాదిగా అంటూ జాన్ ముఖం లోకి చూసాడు.

"మాధవ్ ఇక్కడకు వచ్చినట్లు సాక్ష్యం చూపించ గలరా?"

"అతను ఎక్కివచ్చిన ఆటోడ్రైవర్ ప్రత్యక్షసాక్షి!" రాజా నవ్వుతూ అన్నాడు.

జాన్ లోలో భయపడ్డా పైకి మేకపోతు గాంభీ ర్యాన్ని ప్రదర్శించాడు.

"రాజాగారూ! ఇంతదాకా వచ్చాక నిజం దాచటం నా కిష్టంలేదు. మాధవ్ నా వద్దకు ఇంటర్వ్యూకు వచ్చాడు. అతను సెలక్టు కాలేదు. వెంటనే వెళ్ళిపోయాడు. బహుశా

వుద్యోగం దొరక లేదని ఆత్మహత్య చేసుకొనివుంటాం
"ఈ సంగతి ఇనస్పెక్టర్‌తో ఎందుకు చెప్పలేదు!
"క్షమించండి! పరువుగా బ్రతుకుతున్న నేను
సుల గొడవల్లో తలదూర్చి పరువుని పోగొట్టుకో లేక
అబద్ధం చెప్పాను."

డిటెక్టివ్ రాజా ఒక్క నిమిషం మౌనం వహించా
"మీ సెక్రటరీ సుందర్ ఇంటి ఎడ్రస్, మీ
ఇంటర్‌వ్యూ చేసిన కాండిడేట్స్ అప్లికేషన్స్ ఇవ్వండి
"సారీ! సుందర్ నా సెక్రటరీగా ఎన్నికయిన తర్వా
ఆ అప్లికేషన్స్ బుట్టదాఖలా చేసాను. సుందర్ ఎడ్ర
మాత్రం ఇవ్వగలను" జాన్ సుందర్ ఎడ్రస్ చెప్పాడ
తన ఇంటికి కొద్దిదూరంలోనే సుందర్ ఇల్లు వుంద
చెప్పాడు.

డిటెక్టివ్‌లు ఇద్దరూ బయటపడ్డారు.
"గోపీ! నువ్ సుందర్ దగ్గరికి వెళ్ళి అసలు ఇంటర్
వ్యూ చేసిన వ్యక్తి ఎవరో కనుక్కో. నేను థామస్
దగ్గరకు వెళతాను. నువ్వు అక్కడినుంచి పోలీస్ స్టేషన్
వచ్చేయ్!" అన్నాడు రాజా.

# 6

సుందర్ ఇల్లు దగ్గరగా వుండటంతో గోపి కాలినడ
కనే అతని ఇంటికి బయలుదేరాడు.
సుందర్ నౌకరు, గోపిని కూర్చోమని చెప్పి, పైకి
వెళ్ళి నిద్రపోతున్న యజమానిని లేపాడు.

సుందర్ లేవటానికి విసుక్కుంటుంటే "ఆ వచ్చిన
ఆయన డిటెక్టివ్ అట బాబూ!" చెప్పాడు నౌకరు.
డిటెక్టివ్ అన్నమాట వినగానే సుందర్‌కు మత్తు

వదిలిపోయింది. గాబరా మొదలయింది.

గబగబా క్రిందకు దిగివచ్చాడు.

గోపి తనని తను పరిచయం చేసుకొని "సుందర్ గారూ! మిమ్మల్ని ఇంటర్వ్యూ చేసింది జాన్ గారేనా?" అని ప్రశ్నించాడు.

సుందర్ పెద్దగా నవ్వాడు.

"ఆయన కాకపోతే మరెవరు చేరస్తానుకొంటున్నారు?" నవ్వటం ఆపి తిరగేసి ప్రశ్నించాడు.

అతని పుల్లవిరుపు సమాధానం విన్న గోపికి అతన్ని చాచిపెట్టి కొట్టాలనిపించింది.

అయితే అది మర్యాదకాదని, తన కోపాన్ని అణచుకొన్నాడు.

"జాన్ ఎలాంటివాడు?"

"దేవుడిలాంటి మనిషి. ఎం.ఏ.పాసయి నిరుద్యోగిగా బ్రతుకుతున్న నాకు జీవనోపాధిని కల్పించిన జాన్ గారు నాకు పితృసమానులు."

సుందర్ మాటలు విన్న గోపి, తను అతన్ని మరేం ప్రశ్నించనక్కర్లేదనుకొని, అతనితో చెప్పి, పోలీస్ స్టేషన్ కు నడిచాడు.

రాజా, ఇనస్పెక్టర్ థామస్, మాధవ్ కేసు గురించే మాట్లాడుకొంటున్నారు.

గోపి వారిని కలుసుకుని జరిగిందంతా చెప్పాడు.

సుందర్ మాటల్లో నిజం వుందనిపించలేదు రాజాకు. అయితే ఇనస్పెక్టర్ ముందు తన అనుమానాన్ని బయటపెట్టలేదు.

ముగ్గురూ మాట్లాడుకొంటుండగా అంతలోనో టెలి-

ఫోన్ గణ, గణా మ్రోగింది.

థామస్ విసుగ్గా రిసీవర్ అందుకున్నాడు.

"వ్వాట్! జాన్‌ని ఎవరో చంపేసారా? ఇప్పుడే బయలుదేరుతున్నా" అని టెలిఫోన్ పెట్టేసి, రాజాని చూసాడు.

"జాన్ రివాల్వర్‌తో చంపబడ్డాడట" చెప్పాడు.

డిటెక్టివ్‌లు ఇద్దరికీ చాలా ఆశ్చర్యంగా వుంది.

జాన్ తమతో మాట్లాడి అరగంట అయినా కాలేదేమో? అప్పుడే చంపబడ్డాడా?

ముగ్గురూ జాన్ ఇంటికి బయలుదేరారు.

జాన్ మేడమీద, తన గదిలో రక్తపుమడుగులో పడి వున్నాడు.

ఇనస్పెక్టర్, పోలీస్ డాక్టర్ తదితరులకు ఫోన్ చేసాడు.

అంతా తమ, తమ పనులు మొదలుపెట్టారు.

నౌకరు ఓ వారగా నిలుచొని సన్నగా రోదిస్తున్నాడు.

"జాన్‌గారు పోయినట్లు ఆయన సెక్రటరీకి తెలియపరిచావా?" అని ప్రశ్నించాడు రాజా.

"లేదు బాబూ, నేను కిచన్‌రూమ్‌లో వంట చేస్తున్నాను. ఏం కూర వండాలో అడగాలని పైకి వచ్చాను. అయ్యగారు రక్తపుమడుగులో పడివున్నారు. వెంటనే ఇనస్పెక్టర్‌గారికి ఫోన్‌చేసాను. సుందర్‌బాబుగారికి ఫోన్ చేస్తాను."

నౌకరు టెలిఫోన్ వైపు కదలబోతుంటే రాజా అతన్ని పట్టి ఆపి, గోపికి ఏదో చెప్పి బయటకు పంపించాడు.

# 7

గోపి సుందర్ ఇంటిముందు కారుని ఆపి, వెనక్కు తిరగబోయాడు.

అంతే! అతని తలమీద బలంగా దెబ్బ పడింది.

గోపి వెంటనే తెలివితప్పిపోయాడు.

ఐదునిమిషాలలో లోపలినుండి ఒక అందమైనయువతి బయటకు వచ్చింది.

"మీనా! కారులో డిటెక్టివ్ వున్నాడు సాయం పట్టు" గోపిని కొట్టిన వ్యక్తి అన్నాడు.

"సుం...ద...ర్. డిటెక్టివ్ నికూడా? అతను..."

"షటాప్! చెప్పింది చెయ్యటం నేర్చుకో!" అతను తీవ్రంగా అన్నాడు.

మీనా చిన్నగా నిట్టూర్చింది.

ఇద్దరూ కలిసి గోపిని లోపలికి తీసుకువెళ్ళి ఒకగదిలో బంధించారు.

"సుందర్! నీ రాక్షసత్వాన్ని భరించటం నా తరం కాదు. నేను పోలీస్..." ఆమె మాటలు పూర్తి కాక మునుపే అక్కడికి "అమ్మా" అంటూ వచ్చాడు పద మూడేళ్ళ రవి.

రవిని చూడగానే అందమైన సుందర్ ముఖంలో చిరుదరహాసం వెలిగింది.

"మీనా! రవి నీకు అక్కర్లేదనుకొంటే పోలీస్ రిపోర్ట్ ఇయ్. కాదనను" అన్నాడు మెల్లగా.

మీనా అతన్ని అసహ్యంగా చూసింది.

"రవి నాకే కాదు నీకూ కొడుకే అన్న సంగతి మరచి పోయావా?"

సుందర్ పక, పకా నవ్వాడు.

"మీనా! నేను అన్నీ మరచిపోయి చాలారోజులైంది!

మీనా ఇంకేం మాట్లాడలేనిదానిలా కొడుకుని తీః కొని, అక్కడనుంచి విసురుగా వెళ్ళిపోయింది.

# ౬

రాజా చేతివాచిని చూసుకున్నాడు.

ఏడుగంటలయింది.

గోపి బయలుదేరి నాలుగుగంటలుపైనే అయింది.

అతనివద్దనుంచి ఎలాంటి సమాచారం రాకపోవడంతో రాజాలో గాబరా మొదలయింది.

అతను శత్రువులచేతికి దొరికిపోయాడని భావించాడు. కారులో సుందర్ ఇంటికి బయలుదేరాడు.

రాజా తన కారు దిగి, బంగళా వెనుకవైపుకు నడిచాడు.

కొంచెం ఎత్తుగావున్న పిట్టగోడ గంతి లోపలికి ప్రవేశించాడు.

వెనుకవైపు స్విమింగ్‌పూల్, మరోచోట అందమైన స్త్రీ శిల్పం కనిపించాయి. రాజా నీటిగొట్టం పట్టుకొని పైకి ఎక్కాడు.

విశాలమైన డాబా, దానికి మెట్లు కనిపించాయి.

రివాల్వర్ పట్టుకొని, అడుగులో అడుగువేసుకొంటూ మెట్లు దిగాడు. పెద్ద వరండా కనిపించింది.

ఆ వరండాకి కుడివైపుగా నడిచాడు రాజా.

అంతలో ఒక స్త్రీ ఏడుపు వినిపించింది ఒక గది లోంచి.

రాజా పరుగున ఆ గదిదగ్గరకు వెళ్ళి, చెవులురిక్కించి విన్నాడు.

"సుందర్! గోపిని నేనే వదిలేసాను. రవి ఏం చెయ్య లేదు. వాడిని ఏమీ అనకు!"

"నోరు ముయ్! వేలెడంత లేని వెధవ, నా పనులకు అడ్డువస్తాడా? వీడిని...వీడిని......"

రాజాకు మరి మాటలు వినిపించలేదు. కాని ఒక కుర్ర వాడి అరుపు, స్త్రీ ఏడుపు, ఆ తరువాత ఎవరినో బర, బరా ఈడ్చుకు వెళుతున్న శబ్దము వినిపించింది.

రాజాలో సహనం నశించింది.

లోపల ఏం జరిగిపోతున్నదో అనే భయంతో తలుపుల్ని బలంగా తోసాడు. పదినిముషాలు ప్రయత్నించాక తలుపులు తెరచుకొన్నాయి.

లోపల ఎవరూ కనిపించలేదు.

అలా వరుసగా నాలుగు గదులు దాటాక రాజా చూసిన స్విమింగ్ పూల్ కనిపించింది.

రాజా తన చూపుల్ని నేలమీదకు నిలిపాడు.

బూట్లగుర్తులు, ఒక స్త్రీ పాదాలగుర్తులు, మరో చిన్న పాదాలగుర్తులు కనిపించాయి. అతను తృప్తిగా వూపిరి పీల్చుకుని, గుర్తుల వెంబడి నడిచాడు. ఆ గుర్తులు స్త్రీ శిల్పందాక వచ్చి ఆగిపోయాయి.

రాజా ఆ బొమ్మని త్రిప్పగానే, అది ప్రక్కకు తొలగి మెట్లు కనిపించాయి. అతను తన జేబులో డైరీ తీసి, గోపికి లోపలికి వచ్చేదారి అంతా రాసి, హాలులో అతనికి కనిపించేలా పెట్టి, మళ్ళీ ఆ శిల్పందగ్గరికివచ్చాడు. గోపి తప్పించుకు పారిపోయాడంటే పోలీసులతో వస్తాడని తెలుసు రాజాకు. రివాల్వర్ చేతబట్టుకొని మెట్లు దిగాడు.

చివర మెట్టు దిగి కనిపించిన దృశ్యం చూసి కొయ్యబ పోయాడు.

రవికి ఇరవై అడుగుల దూరంలో ఒక పెద్దపులి నిల్చొ వుంది. రవి భయంతో గట్టిగా ఏడుస్తున్నాడు. రా ట్రిగ్గర్ నొక్కబోయాడు.

కాని ఎవరో అతని చేతిలో రివాల్వర్‌ని తృళ్ళగొ ముందుకు తోసారు. అతనుకూడా కందకంలాంటి ప్రదేశంలో రవి ప్రక్కన పడ్డాడు.

౯

పులి చూపులు ఈసారి రాజామీద పడ్డాయి.

అది నాలుక చప్పరిస్తూ, గట్టిగా గాండ్రించింది రాజా ఆందోళనగా దాన్ని చూసాడు.

పులికి, అతనికి మధ్య రవి వున్నాడు.

"సుందర్! వాళ్ళని రక్షించు. నీకు కావాలంటే నన్ను చంపు!" మీనా ఏడుస్తూ అంటున్నది పైనుంచి.

సుందర్ ఆమె చేతిని గట్టిగా పట్టుకొని, రాజా, రవిల ముఖంలో కనిపిస్తున్న మృత్యుభీతిని తిలకిస్తూ ఆనందిస్తున్నాడు.

మీనా అతని చేతిలో నలుగుతున్న తన చేతిని విడి పించుకొనేందుకు విశ్వప్రయత్నం చేస్తూ, గట్టిగా ఏడుస్తున్నది.

సుందర్ పడి, పడి నవ్వుతున్నాడు.

అందమైన అతని ముఖం వికృతంగా మారిపోయింది.

అతడి నరనరాలలో ఏదో ఆవేశం, ఆనందం, జర జరా ప్రాకిపోతున్నది.

రాజాకు మతిపోతున్నట్లు వుంది.

ఇంతవరకూ ఎన్నో కేసులు చేపట్టాడు కాని ఒక క్రూరమృగంతో, ఏ ఆయుధం లేకుండా నిలవటం అదే ప్రథమం.

రాజా పులివైపు చూసాడు. అది గెంతేటందుకు సిద్ధంగా వుంది.

అదిగాని గెంతితే రవి దానికి విందుకాక తప్పదు.

పులి గెంతబోతుంటే తను రవిమీదకు ఎగిరి, అతనితో పాటు క్రిందపడి బడ, బడా దొర్లాడు.

పులి వూపుగా వెళ్ళి పులిబోనుకు గుద్దుకొని, ఆ ప్రదేశం దద్దరిల్లిపోయేలా గాండ్రించింది.

క్రిందపడ్డ రవి చురుగ్గా లేచి నిలబడి, ఓ వారకు పరిగెట్టాడు.

రాజా లేచి నిలబడి పులిని చూసాడు.

దాని కళ్ళలో కసి, క్రోధం కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నది.

అది మెల్ల, మెల్లగా నడుస్తూ రాజాకు దగ్గర అవుతున్నది.

రాజా అడుగులు వెనక్కి పడ్డాయి.

అతని కళ్ళలో భీతి కదలాడుతున్నది. తనకు ఎదుట పడిన మృత్యువుని రెప్పవేయకుండా చైతన్యరహితుడై చూస్తున్నాడు.

సుందర్ నవ్వు తెరలు తెరలుగా వినిపిస్తున్నది.

పులి పెద్దగా గాండ్రిస్తూ, రాజామీదకు దూకబోతున్నంతలో, దాని నుదుటిలోకి సర్రున బుల్లెట్ దూసుకుపోయింది.

క్షణంలో పులి గాండ్రిస్తూ క్రిందపడి తన్నుకొని సాగింది.

రాజా ఆశ్చర్యంతో వెనుతిరిగాడు.

గోపి, ఇన్‌స్పెక్టర్ శ్యామూల్ కనిపించారు.

శ్యామూల్ చేతిలోని రివాల్వర్ నిప్పులు కురి పిస్తున్నది.

సుందర్ ముఖం నల్లగా పాలిపోయింది.

మీనాని కసిగా చూసాడు.

"మిస్టర్ సుందర్! హేండ్సప్..." అంటూ అతనిని కస్టడీలోకి తీసుకున్నాడు, ఇన్‌స్పెక్టర్ శామ్యూల్.

"డిటెక్టివ్ గారూ! సుందర్ ఒకప్పుడు మంచిమనిషే. కాని కొంతకాలంనుంచి అతను దానవుడిగా మారి పోయాడు. అతను ప్రాణంగా పెంచుకొనే పిల్లి ఎలుకల్ని పట్టి విచిత్రంగా చంపటం చూసేవాడు. ఒక్కో సారి తనే ఎలుకల్ని పట్టి దానిముందర వేసి వినోదం చూసేవాడు.

రాను, రాను, అతనిలో రాక్షసత్వం ప్రారంభ మైంది. ఒక సర్కస్ కంపెనీతో స్నేహంచేసి ఎలాగో ఈ పులిని సంపాదించాడు. తర్వాత నన్ను ఆడవాళ్ళతో పరిచయం పెంచుకోమన్నాడు. ధైర్యవంతులని, బలవంతులని జంతువులకు విందుగా వేసేవాడు.

నేను రవికోసం ఎందరో అమాయకులను ఇక్కడ బలి పెట్టాను. నా అందంతో ఎందరినో మృత్యు ఒడిలోకి పంపాను..." అంటూ మీనా రెండు చేతుల్లో ముఖాన్ని దాచుకొని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

—: ఐ పో యిం ది :—

# జగత్ కిలాడీలు!

అజీజ్

"శివదాస్! వెరీ-గుడ్ న్యూస్!" అంటూ హడావుడిగా గదిలో ప్రవేశించేడు భిక్షపతి.

గది మధ్య, రౌండ్ టేబుల్ కెదురు బొదురుగా కూర్చుని, రమ్మీ ఆడుకుంటున్న శివదాస్, కాంతినాథ్, కృపానంద్ ఉలిక్కిపడి తలుపువైపు చూసేరు.

"ఎప్పుడూ ఏదో ముంచుకొచ్చినట్టూ, కొంపలంటుకు పోయినట్టూ హడావుడి చెయ్యడంతప్ప, కాస్త నిదానంగా మూవ్ కాలేవూ?" ముఖం చిట్లించేడు శివదాస్.

"నేను చెప్పబోయే న్యూస్ వింటే, మీరూ నాలాగే, నిప్పుతొక్కిన కోతుల్లా భరతనాట్యం ప్రారంభిస్తారు" అంటూ వచ్చి, కుర్చీలో కూలబడ్డాడు భిక్షపతి.

"చెప్పేది శాస్త్రమూటిగా చెప్పి తగలడు!" అన్నాడు శాంతినాథ్.

అంతవరకూ కలుపుతున్న పేకని, కట్టకట్టి టేబిల్ మధ్య గిరాటేసాడు కృపానంద్.

"సేఠ్ చండీరామ్ తెలుసుగా మీకు?" అడిగేడు బిక్షపతి.

"పాండీ బజార్లో ఉన్న జ్యూయలరీ సెంటర్ యజమానేనా?"

"ఆఁ, వాడే! నాకు విశ్వసనీయ వర్గాలద్వారా తెలిసింది. వాడీరాత్రి ఇరవై లక్షలు ఖరీదు చేసే వజ్రాలతో, త్రివేండ్రం వెళ్ళే ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణం కాబోతున్నాడు."

"ఒంటరిగానా?"

"ఔను!"

"రియల్లీ?"

బిక్షపతి నవ్వేడు గర్వంగా. "నేనింతవరకూ తెచ్చిన ఇన్ఫర్మేషన్ ఏదైనా అబద్ధం అవడం జరిగిందా? నీవు అనుమానప్పారుగువి! మడత పేచీలు మాని, తక్షణం ప్లాన్ ఫిక్స్ జెయ్!

రెణ్నెల్లనించీ మన హస్తాలకి పనిలేక జివజివలాడుతున్నాయి. ఆ మధ్య చేసిన బ్యాంకు ఫోర్జరీ తాలూకు డబ్బు అయిపోవస్తోంది. త్వరగా మళ్ళీ ఏదో ఒకటి చెయ్యాక తప్పదు మరి!"

"వజ్రాలు ఎందులో పట్టుకెళ్తున్నాడు సేఠ్?"

"ముదురు నీలంరంగు బ్రీఫ్‌కేస్‌లో! ఉదయంనించీ అతనా బ్రీఫ్‌కేస్‌ని క్షణం వదలకుండా, శరీరంలోని అవ

యవంలా అంటిపెట్టుకునే వున్నాడు.

మన దగ్గిర అట్టే టైంలేదు. ఇప్పుడే మధ్యాహ్నం మూడవుతోంది. రాత్రి ఎనిమిదిన్నరకి మద్రాసు స్టేషన్ విడుస్తుంది బండి. సేఠ్ ఇంటినించి ఎనిమిది గంటలకల్లా స్టేషన్ చేరుకుంటాడు, కాలో! అతను ఫస్ట్ క్లాస్ లోతప్ప, మరో బోగీలో ప్రయాణం చెయ్యడని మనం గుర్తుంచుకో వాలి!'' అన్నాడు బిక్షుపతి.

పూర్తయిన సిగరెట్ ఏష్ట్రేలో నొక్కి, మరో సిగరెట్ అంటించేడు శివదాస్. చురుగ్గా సాగే అతని ఆలోచనలకి అంతరాయం కలిగించకూడదని, మిగతా ముగ్గురూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. సిగరెట్ చివరి దమ్ములాగి ముందుకు వంగేడు శివదాస్. ''బిక్షుపతి సేక రించిన ఈ వివరాలు సరైనవే అయితే నిస్సందేహంగా నా పథకం విజయవంతమౌతుంది.

చెవులు రిక్కరించుకు వినండి. సేఠ్ ఎనిమిదిగంటల కల్లా స్టేషన్ జేరుకోవచ్చు. మనం ఐదునిమిషాలుముందు, స్వల్పమైన సామానుతో, మారువేషాల్లో అక్కడికి చేరాలి.

సేఠ్ ఎక్కిన కంపార్ట్ మెంట్ లో, నేనూ, బిక్షుపతి, కాంతినాథ్ తోటిప్రయాణీకుల్లా అతని కేబిన్ లో ప్రవే శిస్తాం. మనవెంట రెండుమూడు సూట్ కేసులూ అవీ ఉండటం అవసరం. లేకుంటే సేఠ్ కు అనుమానం వేస్తుంది.

ట్రేన్ మద్రాసు స్టేషన్ విడిచి, త్రివేంద్రంవైపు సాగేక, ఇరవై మైళ్ళదూరంలో చిన్న బ్రిడ్జి వస్తుంది. కృపానంద్, బండి బైలుదేరకముందే, కాల్లో సరిగ్గా ఆ

బ్రిడ్జి దగ్గరకు చేరుకుని చీకట్లో పొంచివుండాలి.

ట్రైన్ ఆ బ్రిడ్జిని సమీపించే సమయానికి, కంప
మెంట్‌లో మనం, సేఫ్ దగ్గర్నుంచి ఆ బ్రీఫ్ కేస్ త
య్యాలి. చీకట్లో బ్రిడ్జిదగ్గర కాచుకున్న కృపానం
టార్చి వెలిగించి, మనకి సిగ్నల్ ఇస్తాడు. మనం కి
లోంచి బ్రీఫ్ కేస్‌ని అవతలికి విసిరెయ్యాలి.

“కృపానంద్, దాన్నందుకుని కార్లో తిరిగి, మద్రా
వచ్చేస్తాడు. మనం నెక్స్ట్ స్టేషన్లో బండి దిగి, టాక్సీ
చేసుకురావచ్చు. నే నల్లిన పథకం ఇది! ఇందులో ఎవ్వ
కైనా, ఏవైనా సందేహాలుంటే తీర్చుకోవచ్చు!” అంటూ
ముగించేడు శివదాస్.

“కంపార్ట్ మెంట్లో, సేఫ్ నించి ఆ బ్రీఫ్ కేస్ ఎలా
కాజెయ్యాలో చెప్పావుకావు?” అన్నాడు భిక్షపతి.

“అది అప్పటి పరిస్థితినిబట్టి, క్షణాలమీద నిర్ణయించుకో
వలసిన విషయం! నెక్స్ట్?” అడిగాడు శివదాస్ మిగతా
ఇద్దర్నీ చూస్తూ.

“నో డౌట్స్!” అన్నారు ఇద్దరూ ముక్తకంఠంతో.

## 2

రాత్రి ఎనిమిదిగంటలకి, నలుగురూ తమ పాత అంబా
సిడర్ కార్లో సెంట్రల్ స్టేషన్ చేరుకున్నారు. కారు
పార్కింగ్ ప్లేస్‌లో ఆగగానే, శివదాస్, భిక్షపతి,
కాంతినాథ్ దిగి, అక్కడే పిచ్చాపాటీ మాట్లాడు
కుంటూ నిల్చున్నారు. కృపానంద్ డ్రైవింగ్ సీట్లోనే
ఉండిపోయాడు.

ఎనిమిదిగంటల పదినిమిషాలకి ఓ షెవర్లెట్ కారు
వచ్చి, పార్కింగ్‌లో ఆగింది. దాన్ని చూడగానే

మోచేత్తో శివదాస్ డొక్కలో పొడిచాడు బిక్షపతి.

కారు బేక్ డోర్ తెరుచుకుంది. ముందు సేఠ్ చండీ రామ్ దిగేడు. అతని వెనకే మరో వ్యక్తి దిగేడు. సేఠ్ కుడిచేతిలో ఉంది బ్రీఫ్ కేస్. ముదురు నీలిరంగు బ్రీఫ్ కేస్.

స్టేషన్ కూలీలు ఆ కారును చుట్టుముట్టేరు.

"వాడెవడు?" అడిగేడు శివదాస్ సేఠ్ వెంటవున్న వ్యక్తిని కళ్ళతో చూపిస్తూ, బిక్షపతికి.

"సేఠ్ అల్లుడు!"

"కొంపదీసి వాడూ, అతనితో ప్రయాణం చెయ్యడం లేదు కదా?"

"ఏమో?"

అంతలో! ఆ వ్యక్తి, కారు డిక్కీ తెరిచి, ఇద్దరు కూలీ లకి సైగచేసాడు. కూలీలు డిక్కీలోంచి రెండు సూట్ కేస్ లూ, ఓ బెడ్ హోల్డాల్, అందుకుని, నెత్తిన పెట్టు కున్నారు. ఓ కూలీ సేఠ్ చేతిలో వున్న బ్రీఫ్ కేస్ అందుకో బోయాడు.

"ఫరవాలేదు. మీరు వాటిని తీసికెళ్ళండి" అన్నాడు సేఠ్ బ్రీఫ్ కేస్ ని చంకలో అదుముకుంటూ.

దాంతో, బిక్షపతి చెప్పింది నిజమేనని రూఢి అయింది శివదాస్ కు.

సేఠ్, అతని అల్లుడూ కూలీలని అనుసరిస్తూ స్టేషన్లో ప్రవేశించేరు.

శివదాస్ ఓ కూలీని కేకేసి తమ కారు డిక్కీలోవున్న మూడు సూట్ కేస్ లని అతని కప్పగించి, కృపానంద్ కు సైగచేసాడు, వెళ్ళమన్నట్టు.

మరుక్షణం కారు స్టార్టయి, వెళ్ళిపోయింది.

మిగతా ఇద్దరు సహచరులతో, సేఠ్ వెళ్ళినవైపు అడుగులు వేసాడు శివదాస్. ఆ ముగ్గురి మస్తిష్కాల్లో ఒకే ఒక్క విషయం సమ్మెటలా మోగుతోంది!

ఇరవై లక్షలు!!

ఎనిమిదో నెంబర్ ప్లాట్ ఫాంలో, ఆలోగా రెడీగా వుండవలసిన త్రివేంద్రం ఎక్స్‌ప్రెస్ ఇంకా రాలేదు. బిక్షపతి ఎంక్వైరీలో కెళ్ళి కనుక్కున్నాడు. గంట లేటని తెలిసింది!

సేఠ్ చండీరామ్, అతని అల్లుడూ ప్లాట్ ఫాంమీద నిల్చుని ఏదో మాట్లాడుకుంటున్నారు. బ్రీఫ్ కేస్ ఇంకా సేఠ్ చంకలోనే వుంది.

తొమ్మిది గంటలకి వచ్చింది బండి.

కూలీలు సేఠ్ సామానెత్తుకుని, ఫస్ట్‌క్లాస్ బోగీవైపు పరుగుతీసారు.

సేఠ్, అతని అల్లుడూ వాళ్ళననుసరించారు. బిక్షపతీ, కాంతినాథ్, శివదాస్ తమతమ సూట్ కేస్‌లందుకుని అటు నడిచారు.

చండీరామ్ వాళ్ళు ఏ కేబిన్‌లో దూరతారో ముందు గమనించి, సరిగ్గా అదే కేబిన్‌లో ప్రవేశించేరు. సేఠ్ అల్లుడు బెడ్ హోల్డాల్ లోంచి ఓ దిండు తీసి, కింది బెర్త్ మూల, సేఠ్ కూర్చోడాని కనుకూలంగా అమర్చేడు. చండీరామ్ ఆ దిండుకు వీపానించి కూలబడ్డాడు సీట్లో. కూర్చుంటూ చంకలో వున్న బ్రీఫ్ కేస్‌ని వీపు వెనక పెట్టుకున్నాడు.

శివదాస్, బిక్షపతీ, కాంతినాథ్ మిగతా మూడు సీట్లాక్రమించారు. ఆ మామా అల్లుళ్ళు ఏదో చర్చించు

కుంటున్నారు మార్వాడీ భాషలో.

గార్డ్ విజిల్ వినిపించింది. సేఠ్ అల్లుడు లేచాడు. మామకు నమస్కరించి కేబిన్‌లోంచి బైటికి నడిచాడు. తేలిగ్గా ఊపిరి తీసుకున్నాడు శివదాస్! సేఠ్ ఒక్కడే ప్రయాణం చేస్తున్నాడన్నమాట.

బండి కదిలింది!

సేఠ్ కిటికీలోంచి చెయ్యి ఊపుతున్నాడు, అల్లుణ్ణి చూస్తూ.

భిక్షుపతి రిస్టువాచీ చూసుకున్నాడు. తొమ్మిదిన్నర!

ఈ పాటికి కృపానంద్, కార్లో ఆ బ్రిడ్జిని సమీపించి వుంటాడు. ఇక్కణ్నించి ఇరవైమైళ్ళ దూరంలో వుంది బ్రిడ్జి. మధ్యలో ఓ స్టేషన్ వస్తుంది. కనీసం గంటైనా పడుతుంది, ట్రైన్ బ్రిడ్జి చేరడానికి.

శివదాస్ ఆలోచనలు మరోవిధంగా పరుగులు తీస్తున్నాయి. సేఠ్ ఎంత త్వరగా కునుకుతీస్తే అంత మంచిది. అప్పుడే, బ్రీఫ్‌కేస్ కాజెయ్యడానికి వీలౌతుంది!

ఆలోచనలు కట్టిపెట్టి, ఫార్మాలిటీకోసం సేఠ్‌ని పలకరించాడు శివదాస్. ప్రయాణీకులు మామూలుగా తోటి ప్రయాణీకుల్ని వేసే సామాన్యమైన ప్రశ్నలవి. దాంతో చండీరామ్ చాలా రిజర్వ్‌డ్ నేచర్ కలవాడని స్పష్టమైంది. శివదాస్ ప్రశ్నలకతను చాలా పొడిగా, అయిష్టంగా బదులిచ్చి ఊరుకున్నాడు.

దాంతో, శివదాస్‌కు ప్రసంగాన్ని పొడిగించే ధైర్యం చాల్లేదు. సేఠ్ ఓ గుజరాతీ మాసపత్రిక తీసి చదవడంలో లీనమయ్యేడు. అతనిప్పుడప్పుడే నిదరపోడని రూఢి అయింది శివదాస్‌కు. అసహనంగా తన అనుచరులవైపు చూసాడు.

భిక్షపతి ఏదో ఒక చర్య తీసుకోన్నట్టు కన్ను గీటాడు.

శివదాస్, కుడిచెయ్యి నోటి దగ్గరికి తీసికెళ్ళి గట్టిగా ఆవులించాడు. పుస్తకం చదువుతున్న సేఠ్ తలెత్తి ఓ క్షణం అతనివైపు చూసి, తిరిగి కళ్ళు దించుకున్నాడు.

“ఎక్స్‌క్యూజ్ మి సార్! పగలంతా పనుల ఒత్తిడితో బాగా అలసిపోయాం! నిదర ముంచుకొస్తోంది. లైట్ వెలుగుతుంటే, ఓ పట్టాన నిదరపట్టదు నాకు” నసిగాడు శివదాస్.

“అలాగా! మాకీ తెలీదు. టైం పాస్ చెయ్యడానికీ మేం ఈ పుస్తకం చదువుతున్నామ్! కోయి బాత్ నై. లైట్ ఆఫ్ చెయ్యండి” అన్నాడు సేఠ్ పత్రిక మూస్తూ.

శివదాస్ లేచి, వెలుగుతున్న లైటార్పి, నీలంరంగు జీరోవాల్ట్ వెలిగించేడు. కేబిన్‌లో మసక చీకటి! కాంతినాథ్, భిక్షపతికూడా నిద్ర నటించసాగారు.

శివదాస్ బెర్త్‌మీద వాలుతూ, “మీరు పడుకోరా సేఠ్ జీ?” అడిగేడు.

“నాకీ ప్రయాణంలో నిద్రా పట్టదు. ఇట్లాగే కూర్చుంటామ్!” అన్నాడు సేఠ్ వీపు దిండుకానిస్తూ'

## 3

బండి ఓ స్టేషన్లో ఆగింది!

శివదాస్ చటుక్కున లేచి, కేబిన్ తలుపు తెరుచుకుని ప్లేట్‌ఫాం మీదికి వచ్చాడు.

“సిగరెట్ పట్టుకొస్తాను” అంటూ భిక్షపతికూడా అతని వెనకే ఇవతలికి వచ్చాడు.

“వెధవ, ప్రయాణంలో నిదరపోడుట! వాడి చచ్చు

అలవాటు నా ప్లానంతా పాడుచేసేలా వుంది.''

''బండి ఈ స్టేషన్ వదిలేక పదిమైళ్ళ దూరంలో నే వుంది బ్రిడ్జి. ఇప్పుడేం చేద్దాం?'' అడిగాడు బిక్షుపతి అసహనంగా.

''ఇంకా చేసేదేముంది? పిస్తోళ్ళకి పని కలిగించక తప్పదు.''

గార్డ్ విజిల్ ఊదాడు!

ఇద్దరూ తిరిగి కేబిన్‌లో ప్రవేశించి తలుపు మూసి, తమ తమ బెర్తుల్లో కూలబడ్డారు. సేఠ్ ఇంకా అలాగే కూర్చున్నాడు. అతని వాలకంలో ఏమాత్రం నిదురమత్తు కనిపించడంలేదు. పగలంతా పడుకునుంటాడు ప్రయాణం వుందని.

బండి కదిలింది.

ప్లేట్‌ఫాం విడిచి స్పీడందుకుంది.

పడుకున్నవాడల్లా చటుక్కున లేచి కూర్చున్నాడు శివదాస్.

సేఠ్ అతనివైపు ఒక్క చూపు సారించాడు. కానీ, నోరు విప్పలేదు.

సిగరెట్ తీస్తున్నట్టు జేబులో చెయ్యి పెట్టాడు శివదాస్. లేచి నిల్చుని, చెయ్యి బైటికి తీసాడు. ఆ చేతిలో మెరుస్తున్న పిస్తోలు చూడగానే సేఠ్ కళ్ళు పెద్దవయ్యాయి.

''బెర్త్ దిగించి లేవక! ఏమాత్రం నోరు కదిపినా, కుక్కని కాల్చినట్టు కాల్చిపారేస్తాను'' అన్నాడు శివదాస్ కటువుగా.

''మీ రేదో పెద్దమనుషులనుకున్నా! ఈ దౌర్జన్యం

ఏమిటి?'' సేఠ్ మొహంలో స్వేదబిందువులు.

"అడ్డదార్లు తొక్కుందే ఎవ్వరూ పెద్దమనుషులు కాలే రని నీకు తెలుసుగా? ఆ బ్రీఫ్ కేస్ ఇస్తే మేము త్వరలో పెద్దమనుషులమౌతాం, నీవన్నట్టు!'' అన్నాడు శివదాస్ నవ్వుతూ.

"బ్రీఫ్ కేసా? అందులో ఏముందీ?'' సేఠ్ కంఠంలో ఆశ్చర్యం.

"ఏముందో మాకు తెలుసు! త్వరగా దాన్ని బైటికి తియ్!''

"ఇవ్వకుంటే, ఏమి చేస్తావ్?''

"చెప్పాగా కుక్కని కాల్చినట్టు కాల్చేస్తానని! రభస చెయ్యకుండా ఇచ్చేవంటే, బ్రతికి బలుసాకు తింటావ్! ఊఁ, త్వరగా తియ్. టైంలేదు.''

సేఠ్ చేతులకి చలనం రాలేదు. అతని దృష్టి ఒక్క క్షణం, పైన వేళ్లాడుతున్న ఎమర్జెన్సీ చెయ్యివైపు వెళ్ళింది. అది గమనించి పకపక నవ్వేడు శివదాస్.

"చేన్ లాగి ట్రేన్ ఆపుదామనుకుంటున్నావా? సరే, అది జరక్కముందే, నీ ఊపిరి నేనాపుతాను!'' అంటూ ట్రిగర్ మీద వేలు బిగించాడు.

"ఆగు! బ్రీఫ్ కేస్ ఇస్తాన్!'' అంటూ వీపు వెనక్కి చెయ్యి పోనిచ్చాడు చండీరామ్.

బైటికి వచ్చిన అతని చేతిలో బ్రీఫ్ కేస్ కు బదులు చిన్నసైజు పిస్తోలుంది.

"శివదాస్! తప్పుకో!'' భిక్షుపతి మెరుపులా శివదాస్ ని తనవైపు లాక్కున్నాడు.

"ఢాం... ఢాం ..'' రెండు పిస్తోళ్ళూ ఒకేసారి గర్జించాయి.

సేఠ్ పిస్తోలుగుండు మిస్ అయింది! శివదాస్ పిస్తోలు గుండు తిన్నగా సేఠ్ కంఠంలో తిష్ఠవేసింది.

అతని అరుపు నోట్లోంచి ఇవతలికి రాలేదు. అలాగే ఒరిగిపోయాడు సీట్లోకి. శివదాస్ కు, ఇంకా కసి తీరక, మరో రెండు గుళ్ళు సేఠ్ శరీరంలో దింపాడు. నిజానికి, చండీరామ్ కైలాసం చేరుకున్నది మొదటి గుండుతోనే!

"ఎవ్వరైనా పిస్తోళ్ళ శబ్దం వినలేదు కదా?" అడిగాడు భిక్షుపతి.

"నో! అవకాశం లేదు. ఇంత వేగంగా వెళ్ళే ట్రేన్ హోరులో, ఎవ్వరికీ వినిపించదు" అన్నాడు శివదాస్.

భిక్షుపతి గబగబ దిండు వెనక దాచివున్న బ్రీఫ్ కేస్ ను అందుకుని, దాని కేచ్ లాగి, తెరవబోయేడు. లాక్ వేసుంది!

సరిగ్గా అదే క్షణంలో, ట్రేన్ స్పీడ్ స్లో అయినట్టు తోచింది.

"బహుశా, బ్రిడ్జిదగ్గిర పడుంటుంది. టైంలేదు. దాన్ని తరవాత తెరిచి చూడొచ్చు" అంటూ ఒక్క అంగలో వెళ్ళి, కిటికీ రెక్క పైకి తోసాడు శివదాస్.

భిక్షుపతి బ్రీఫ్ కేస్ తెరిచే ప్రయత్నం విరమించుకుని, కిటికీని సమీపించేడు. శివదాస్ కిటికీలోంచి తలదూర్చి, కళ్ళు చిట్లిస్తూ చీకట్లోకి చూడసాగాడు.

బ్రిడ్జి నిజంగానే సమీపించింది!

దూరాన ఓ కాంతి ఆరుతూ, కనిపిస్తోంది, చీకట్లో చిరుదీపంలా! కృపానంద్ సిగ్నల్ ఇస్తున్నట్టున్నాడు.

భిక్షుపతి చేతిలోంచి బ్రీఫ్ కేస్ అందుకున్నాడు శివదాస్ ఊపిరి బిగబట్టి నిల్చున్నాడు. ఆ వెలుగు దగ్గరవగానే, కిటికీలోంచి గిరాటేసాడు, బ్రీఫ్ కేస్ ని బైటకి!

ట్రైన్ ఇప్పుడు బ్రిడ్జిమీంచి పోతోంది. బ్రిడ్జి దాటగానే మళ్ళీ పికప్ అందుకుంది. చేతులు దులుపుకుంటూ వెనక్కి తిరిగాడు శివదాస్. సేఠ్ శరీరంలో ఏర్పడ్డ రంధ్రాల్లోంచి ఇంకా రక్తం కారుతోంది.

"కొద్దిసేపట్లో మనం దిగవలసిన స్టేషన్ రాబోతోంది నువ్వు సేఠ్ జేబులు వెదుకు. వాడి వేళ్ళకున్న ఉంగరాలూ, మెడలో వున్న గొలుసూ తీసుకో. బిక్షపతీ! నువ్వు సామాను గాలించు" అన్నాడు శివదాస్.

కాంతినాథ్ గబగబ సేఠ్ జేబులు వెదికి, తాళంచెవుల గుత్తీ మనీపర్సు తీసాడు. తాళంచెవులు బిక్షపతికందించి, పర్సు తెరిచాడు. రెండువేల చిల్లర వున్నాయందులో.

బిక్షపతి తాళం చెవులతో సూట్ కేస్ తెరిచి, సామాను గాలించాడు. బట్టలు తప్ప మరేం లేవు. అదే సమయంలో, ట్రైన్ పట్టాలు మారుస్తున్న శబ్దం వినిపించింది!

"స్టేషన్ వస్తున్నట్టుంది. ప్లాట్ ఫాం ఏవైపుందో చూడు!" అన్నాడు శివదాస్ బిక్షపతితో.

అతను కిటికీలోంచి చూసి, "ఎడంవైపుంది!" అన్నాడు.

"వెంటనే కిటికీ షట్టర్స్ దించు. కేబిన్ అవతలికెళ్ళి, ప్లేట్ ఫాంవైపునించి కంపార్ట్ మెంట్లోకి వచ్చే, తలుపు మూసి బోల్ట్ చెయ్."

బిక్షపతి గబగబ కిటికీ రెక్కలు దించి, కేబిన్ బైటికెళ్ళాడు. రెండు నిమిషాల్లో తిరిగి వచ్చాడు. ముగ్గురూ తమతమ సూట్ కేస్ లందుకున్నారు.

బండి స్టేషన్లో ఆగింది!

కేబిన్‌లోంచి బైటపడి తలుపు మూసారు. ప్లేట్ ఫాం వైపు కాకుండా, రెండో తలుపుగుండా వెనకవైపు దిగారు. అట్నుంచి ఆర్డినరీ కంపార్ట్‌మెంట్లో ఎక్కి, ప్లేట్ ఫాంమీద అడుగుపెట్టారు!

మామూలు ప్రయాణీకుల్లా అడుగులు వేసుకుంటూ గేట్‌వైపు వెళ్ళి, అక్కడ నిల్చున్న టికెట్ కలెక్టర్‌కి తమ తమ టికెట్లందించి, అవతల పడ్డారు. స్టేషన్ వెనక రెండు మూడు టాక్సీలు ఆగి వున్నాయి.

అప్పుడు ప్రారంభమైంది ప్లేట్ ఫాంమీద అలజడి!

ఎవ్వరో గొంతు చించుకు అరుస్తున్నారు.

"హత్య! హత్య!!"

"టాక్సీ!" అరిచాడు శివదాస్.

## 4

ట్రేన్‌లోంచి శివదాస్ విసిరిన బ్రీఫ్‌కేస్, చీకట్లో కృపానంద్‌కు పది గజాల దూరంలో పడింది.

ఎక్స్‌ప్రెస్ ధనధనలాడుతూ పట్టాలమీద సాగి పోగానే, టార్చి వెలిగించి, మొక్కల్ని తప్పుకుంటూ వెళ్ళి బ్రీఫ్‌కేస్ అందుకున్నాడు కృపానంద్.

ఎక్సైట్‌మెంట్‌తో అతని మనసు ఉరకలు వేస్తోంది, అక్కడికి అరఫర్లాంగు దూరంలో, రోడ్డు పక్కన ఆపి వచ్చిన అంబాసిడర్ కారువైపు చకచక అడుగులు వేసాడు.

పది నిమిషాల్లో చేరుకున్నాడు. ఇంజన్ స్టార్ట్ చేసి, హెడ్‌లైట్ వెలిగించాడు. గేర్ లాగి, కారు ముందుకు పోనిచ్చాడు.

ఆగి ఆగి అతని మస్తిష్కంలో పక్క నున్న బ్రీఫ్

కేస్ ప్రత్యక్షమాలోంది. ఇరవై లక్షలు!

ఈ క్షణంలో అంత మొత్తం యావత్తూ తన పక్క నుంది. అంత పెద్ద మొత్తం నిజంగా ఆ బ్రీఫ్ కేస్‌లో వుందా? ఒక్కసారి దాన్ని తెరిచి, కళ్ళారా చూడాలనే కాంక్ష ఉత్పన్నమైంది అతని మనసులో.

మరుక్షణం కారు వేగాన్ని తగ్గించి, పడివైపుతిప్పి. రోడ్డు దింపేడు. ఇంజన్, హెడ్ లైట్ ఆఫ్ చేసాడు. లోపల టాప్ లైట్ వెలిగించి, బ్రీఫ్ కేస్‌ని ఒళ్ళో పెట్టుకున్నాడు. కేచ్ లాగి తెరవబోయాడు. లాక్ వేసుందని తెలిసిపోయింది.

కారు డేష్ బోర్డ్ మూతలాగి, అందులోంచి ఓ స్టీల్ వైర్ తీసాడు. దాన్ని బ్రీఫ్ కేస్ కీ హోల్లో దూర్చి, తిప్పడం ప్రారంభించాడు.

ఐదునిమిషాల తరవాత, "క్లిక్" మంటూ తెరుచుకుంది లాక్.

వణికే చేతుల్తో బ్రీఫ్ కేస్ తెరిచాడు. కృపానంద్ కళ్ళు జిగేల్ మన్నాయి. ఇరవై లక్షలు!

భిక్షపతి ఇన్ఫర్మేషన్ తప్పలేదు... బ్రీఫ్ కేస్ మూస్తూ నిట్టూర్చాడు కృపానంద్. కొన్ని గంటల తరవాత, ఈ ఇరవైలక్షల సంపత్తి నాలుగుభాగాలుగా విభజింపబడు తుంది...

ఇంత మొత్తం ఒకేసారి తన స్వంతమైతే?

సుడిగుండంలాంటి ఈ జీవితానికి శాశ్వతంగా తిలో దకాలిచ్చి, ఏ మారుమూలకో ఎగిరిపోయి, నిక్షేపంగా బ్రతకవచ్చు!

బ్రీఫ్ కేస్ మూతబిగించి, వైర్‌తో తిరిగి యధాతధంగా

లాక్ వేసేడు.

దాన్ని నిర్లక్ష్యంగా పక్కకినెట్టి, కారు స్టార్ట్ చేసాడు. రివర్స్ గేర్‌లో రోడ్ మీదికి తెచ్చి, ముందుకు పోనిచ్చాడు. కారు బాణంలా దూసుకుపోతోంది, మద్రాసువైపు.

అతని మస్తిష్కంలో, రంగు రంగుల సుందర హార్మ్యాలూ, పథకాలూ ప్రత్యక్షమై, మిగతా ముగ్గురి ముఖాలు జ్ఞాపకం రావడంతో నేలమట్టమవుతున్నాయి.

వాళ్ళు తనని సజీవంగా వదలిపెడతారా?

మద్రాసునగరం దగ్గరపడుతున్నట్లు దూరాన లైట్ల తోరణాలు కనబడసాగాయి. మరో అరగంట తరవాత, కారు నగరంలో ప్రవేశించింది.

రిస్టువాచీ చూసుకున్నాడు. పన్నెండుగంటలు! రోడ్లు దాదాపు నిర్మానుష్యంగా ఉన్నాయి.ఆ నలుగురూ కలిసి, కార్యకలాపాలు సాగించే ఇల్లు మాంబళంలో ఉంది. శివదాస్ నివాసంకూడా అదే!

రోడ్డుమీద ట్రాఫిక్ లేదని, కారు స్పీడ్ తగ్గించలేదు కృపానంద్. ఫుల్ స్పీడ్‌లో తోలుతున్నాడు. ఎదురుగా ఉన్న మలుపు తిరిగితే, మాంబళం వెళ్ళవచ్చు. మలుపు రాగానే అదే స్పీడులో స్టీరింగ్ తిప్పాడు. అంతే!

అప్పుడే, రోడ్డు దాటుతున్న వ్యక్తిని గమనించలేదతను. కారు మలుపు తిరగ్గానే అతన్ని గుద్దేసింది! చెట్టంత ఆ మనిషి అమాంతం ఎగిరి ఆమడదూరంలో పడ్డాడు.

క్షణాలమీద గేర్ డౌన్ చేసి, సడన్ బ్రేక్ వత్తేడు కృపానంద్. క్రీచుమనే చప్పుడుతో ఆగిపోయింది కారు.

విండోలోంచి తల బైటపెట్టి వెనక్కి చూసాడు. ఆ వ్యక్తి రోడ్డుమీద గిలగిల తన్నుకుంటున్నాడు.

కృపానంద్ డోర్ తెరిచి, కారుదిగి, ఆ వ్యక్తివైపు పరిగెత్తాడు. నెప్పికి గిల గిల తన్నుకుంటున్నాడతను.

ఇంకా నయం! చావలేదు కింద కూర్చుని పరిశీలించాడు.

అతని కుడికాలి ఎముక విరిగింది!

"క్షమించు...తప్పు నాదే! హాస్పిటల్ తీసికెళ్ళి ట్రీట్‌మెంట్ ఇప్పిస్తాను, పద!" అంటూ అతన్ని రెండు చేతుల్లో ఎత్తుకుని, కారుదగ్గరికి తీసికెళ్ళాడు.

బాక్‌డోర్ తెరిచి, అతన్ని సీట్లో పడుకోబెట్టాడు. బాధవల్ల ఆ వ్యక్తి నోరు పెగలడంలేదు. కృపానంద్ డ్రైవింగ్ సీట్లో కూర్చుని, స్టార్ట్ చేసి ముందుకు పోనిచ్చాడు.

పావుగంటలో ఓ ప్రైవేట్ నర్సింగ్ హోంముందు ఆపి దిగాడు.

"పడుకో, అలాగే! ఇప్పుడే వస్తాను" అంటూ గబగబ నర్సింగ్ హోంలో దూరాడు కృపానంద్.

డ్యూటీలో ఉన్న కంపౌండర్‌కి పరిస్థితి వివరించాడు. మరుక్షణం, ఇద్దరు వార్డుబోయ్‌లు స్ట్రెచ్చర్ తీసుకెళ్ళి, గాయపడ్డ వ్యక్తిని లోనికి మోసుకొచ్చారు.

గంట తరువాత, ఆ వ్యక్తి తిరిగి కార్లోకి చేర్చబడ్డాడు ఇప్పుడతని కుడికాలి తొడవరకూ ప్లాస్టర్ వేసుంది. మనిషి కాస్త కోలుకున్నట్లు కనిపిస్తున్నాడు.

కృపానంద్ కంపౌండర్‌కు బిల్ పైకం చెల్లించి, కారు ముందుకు పోనిచ్చాడు. ఈసారి చాలా స్లోగా

నడుపుతున్నాడు.

డ్రైవ్ చేస్తూ, "నీ పేరేమిటి?" అడిగాడు ఆ వ్యక్తిని.

"శంకరన్!"

"ఇంత రాత్రి ఎక్కడికి బైలుదేరావ్?"

"నేను గ్లాస్ ఫ్యాక్టరీ లేబర్ని. పన్నెండుగంటల షిఫ్ట్ పూర్తిచేసుకుని, ఇంటికెళ్తున్నాను..."

"భార్యా పిల్లలూ వున్నారా?"

"ఉన్నారు! ఇద్దరు పిల్లలు!"

"జీతం ఎంత?"

"మూడొందలు...ఇంకెక్కడిజీతం? కాలు బాగయ్యేవరకూ పనికి పోలేను. ఈ ఏక్సిడెంట్ ఫ్యాక్టరీలోనే అయింటే, నష్టపరిహారం దొరికేది...నా పిల్లల కడుపు కొట్టారు మీరు!"

"భయపడక! నీవు కోలుకోడానికి రెండు నెలలు పట్టొచ్చు. జీతం మూడొందలన్నావ్ కదూ? వెయ్యి రూపాయలిస్తాను. ఈ సంగతి ఎవ్వరికీ చెప్పక!"

"మీ మంచితనమే ఇంతవరకూ నా నోరు నొక్కేసింది. ఏక్సిడెంట్ అయ్యాక, మీరు కారులో పారిపోయే అవకాశం ఉన్నా, పారిపోకుండా, నాకీ ఉపకారం చేసారు...పైగా డబ్బిస్తానంటున్నారు. అంతకన్నా ఏం కావాలి నాకు?"

"గుడ్! నీ ఇంటి ఎడ్రస్ చెప్పు, డ్రాప్ చేస్తాను."

శంకరన్ చెప్పాడు.

పావుగంటలో అతను చెప్పిన ఇంటిముందు కారాపాడు కృపానంద్. జేబులోంచి పర్సుతీసి, పది వందరూపాయలు

లెక్క పెట్టి శంకరన్ కండించాడు.

"జాగ్రత్త! నీ కాలి ప్లాస్టర్ కట్ చేసే తేదీ, ప్లాస్టర్ మీద వేసుంది. సరిగ్గా ఆ తేదీన నేను వచ్చి, నిన్ను హాస్పిటల్ తీసికెళ్ళి, ప్లాస్టర్ తీయిస్తాను" చెప్పి, కృపానంద్ అతన్ని జాగ్రత్తగా యింట్లో వదిలి, తిరిగి కారెక్కాడు.

అరగంటసేపు ఎక్కడెక్కడో తిరిగి మాంబళంలో ఉన్న శివదాస్ ఇల్లు చేరుకున్నాడు.

ఇంటికి తాళం వేసుంది. దాని తాలూకు తాళంచెవి ఒక్కొక్కటి ఆ నలుగురి దగ్గరా వుంటుంది.

కారు గేరేజ్‌లో ఆపి, సీట్లో ఉన్న బ్రీఫ్ కేస్ అందుకొని, తాళం తెరిచి ఇంట్లో ప్రవేశించేను. కుర్చీలో కూలబడి, బ్రీఫ్ కేస్‌ని టేబిల్ మీద గిరాటేసాడు. సిగరెట్ అంటించి, మిగతావాళ్ళ రాకకోసం యెదురుచూడసాగాడు.

# 5

సరిగ్గా తెల్లవారుజాము, మూడుగంటలకి తలుపు తట్టిన చప్పుడయింది. కుర్చీలో జారగిలబడి కునుకుతీస్తున్న కృపానంద్, ఒక్క ఉదుటున లేచి, వెళ్ళి తలుపులు తెరిచాడు.

త్రిమూర్తులు ముగ్గురూ నిల్చున్నారు గుమ్మంలో.

"బ్రీఫ్ కేస్ తెచ్చావా?" అడిగాడు శివదాస్.

"తెచ్చాను."

టేబిల్ మీది బ్రీఫ్ కేస్ చూడగానే, శివదాస్ కళ్ళు తళతళ మెరిశాయి. నలుగురూ టేబిల్ చుట్టూ చేరారు.

శివదాస్ బ్రీఫ్ కేస్ అందుకుని, "నీవు దీన్ని తెరవ

లేదూ?'' అడిగాడు కృపానంద్‌ని.

ఆ ప్రశ్నతో కృపానంద్ గుండె వేగం అందుకుంది. ''లేదు!'' అన్నాడు పొడిగా.

బిక్షపతి నవ్వి ''నీ స్వభావానికి విరుద్ధంగా వుందే ఈ విషయం!'' అన్నాడు.

''నేను తెరవడానికి ప్రయత్నించిన మాట నిజమే. కాని, తెరుచుకోలేదు. లాక్ వేసుంది. అందుకే, మీ రాక కోసం కాచుకున్నాను.''

శివదాస్ జేబులోంచి సేఠ్ దగ్గర లభించిన తాళం చెవులగుత్తి తీసి, ప్రయత్నించసాగాడు. మూడో తాళం చెవి దూర్చి తిప్పగానే, క్లిక్‌మంది లాక్!

అందరూ ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. వణికే చేతులతో బ్రీఫ్‌కేస్ మూత తెరిచాడు శివదాస్.

రెండు టవల్సూ, ఓ సోప్ కేస్, పాకెట్ మిర్రర్, షేవింగ్ బాక్స్, దువ్వెనా, టూత్ బ్రష్, టూత్ పేస్ట్, టంగ్ క్లీనర్, తప్ప బ్రీఫ్ కేసులో మరేమీ లేవు!

శివదాస్‌కు నమ్మకం కుదరక, ఆ సామానంతా టేబిల్ మీద బోర్లించి, గబగబ వెతకసాగాడు. వాటిలో వజ్రాల ఐపు లేదు! ఐనా, ఆశ చావక బ్రీఫ్ కేస్ లోపలి బట్టంతా పీకి, అంగుళం వదలకుండా పరిశీలించాడు.

వజ్రాలు లేవని స్పష్టంగా తేలిపోయింది!

అప్పుడు చూసుకున్నారు నలుగురూ ఒకరి మొహం లొకరు.

శివదాస్ కళ్ళు ఎర్రబడ్డాయి. నిప్పులు కక్కుతూ చూశాడు బిక్షపతిని.

''సేఠ్ ఇరవైలక్షలు విలువచేసే వజ్రాలతో ప్రయాణ

మాతున్నాడని చెప్పావుగా? ఏమైంది? నీ చచ్చు ఇన్ఫ ర్మేషన్ వల్ల ఓ నిండు ప్రాణి అనవసరంగా బలయ్యాడు. ఫలితంగా మనకు దొరికింది ఈ రెండు టవల్స్, నాలుగు టాయిలెట్ సామాన్లూ నా?"

"పడ్డ శ్రమంతా బూడిదపాలయింది!" అన్నాడు కృపానంద్ విచారంగా.

"కాదు! ఇందులో ఏదో మోసం జరిగింది!"

"జరిగిందంతా నీవల్లే! నువ్వూ, నీ ఇన్ఫర్మేషనూ కట్ట కట్టుకు వల్లకాట్లో దూకండి," ముఖం చిట్లించాడు శివ దాస్.

"భిక్షుపతి తెచ్చిన ఇన్ఫర్మేషన్స్ ఇదివరకెప్పుడూ తప్పలేదు. నాకూ ఏదో అనుమానం వేస్తోంది!" అన్నాడు కాంతినాథ్.

"సేఠ్ ఇందులో, వజ్రాలు తీసుకు ప్రయాణమయ్యా డని, సెంట్ పర్సెంట్ ఖచ్చితంగా చెప్పగల్ను. లేకుంటే అతను దీన్ని కాపాడుకోడానికి నీమీద పిస్టోలు దేనికి తీస్తాడు? ప్రాణాలు దేనికి పోగొట్టు కుంటాడు? ఈ మాత్రం ఆలోచించలేవా?" అన్నాడు భిక్షుపతి.

అప్పుడు తట్టింది శివదాస్‌కు ఆ ఆలోచన!

ఏదో అర్థమైనట్లు, మెల్లిగా కృపానంద్ వైపు తిరి గాడు. "చెప్పు! బ్రీఫ్‌కేస్ తెరిచావ్ కదూ?"

"పిచ్చి పిచ్చిగా మాట్లాడక!"అన్నాడు కృపానంద్ కోపంగా.

"పిచ్చి నాకెక్కాదు. నీకు పట్టింది. నాలుగేళ్ళనించీ నలుగుర కలిసి కట్టుగా పనిచేస్తున్నాం. దొరికిందంతా

సమానంగా పంచుకుంటున్నాం. ఈరోజు నీకు పిచ్చెక్కబట్టే ఈ పని చేశావ్! గత మూడుగంటలనించీ బ్రీఫ్‌కేస్ నీ స్వాధీనంలో ఉంది. నీవు తెరవలేదంటే నే నమ్మను."

"ముందే చెప్పాగా? తెరవడానికి ప్రయత్నించాననీ, తెరుచుకోలేదనీ!"

"కృపానంద్! ఇప్పటికీ మించిపోలేదు. నిజం చెప్పేయ్. నిజం చెప్పావంటే, నిన్ను క్షమించి వది లేస్తాం!"

"నిజం! నాకేం తెలీదు."

అంతే! శివదాస్ చేతిలోకి పిస్తోలు వచ్చేసింది. "మూర్ఖుడా! మంచి మాటలకి లొంగుతావనుకున్నాను. నీచేత నిజం ఎలా కక్కించాలో నాకు తెలుసు! ఏదీ, ఎడంచెయ్యి అడ్డం చాపు!" అని ఆజ్ఞాపించాడు శివదాస్.

కృపానంద్ గుడ్లప్పగించి చూడసాగా డతన్ని.

"ఊఁ, చెప్పినట్టు చెయ్!" అరిచాడు శివదాస్.

ఏం చేస్తాడో చూద్దామని, ఎడంచెయ్యి అడ్డం చాపేడు కృపానంద్. అంతే!

"ఢాం!' మంది పిస్తోలు.

కృపానంద్ గావుకేక! చాపిన అతని అరచేతి మధ్య గుండ్రని రంధ్రం! ఆ రంధ్రంలోంచి బొటబొట కారుతున్న రక్తం!!

బాధ ఓర్చుకోలేక, కుడిచేత్తో ఆ చెయ్యి అదిమిపట్టుకుని, మోకాళ్ళనడుమ దాచుకున్నాడు.

"ఇది శాంపుల్! ఈ పిస్తోల్లో ఇంకా ఐదుగుళ్ళు

న్నాయి. మిగతా నాలుగు నీ శరీరంలో వివిధచోట్ల దిగ బడతాయి. అప్పటికీ నీ నోరు నిజం పలక్కంటే చివరి గుండు మెదడులోంచి దూసుకుపోతుంది. చెప్పు. వజ్రా లెక్కడ?"

నెప్పివల్ల కృపానంద్ నోరు పెగలడంలేదు.

"అరక్షణంలో నీ నోరు విప్పకుంటే, రెండో గుండు నీ కుడికాలిమధ్య దిగబడుతుంది జాగ్రత్త!" అన్నాడు శివదాస్ ట్రిగ్గర్ మీద వేలు పెడుతూ.

"ఆగు!" అరిచాడు కృపానంద్. "చెబుతాను! నిజం చెపితే నన్ను ప్రాణాలతో వదిలేస్తారా?"

"నేను యిచ్చిన మాట తప్పనని నీకు బాగా తెలుసు!"

"ప్లాజా హోటల్, సేఫ్టీ లాకర్‌లో దాచేను వజ్రాలని!"

"లాకర్ తాళంచెవి ఏది?"

"నా దగ్గిరే!"

శివదాస్ చెయ్యి చాపి, "ఇలా ఇవ్!" అన్నాడు.

అంతవరకూ మోకాళ్ళమధ్య అదిమిపెట్టుకున్న చేతులు తీసాడు. కృపానంద్ కుడిచెయ్యి నెమ్మదిగా పాంటు జేబులోకి పోనిచ్చాడు.

బైటికి వచ్చిన అతని చేతిలో తళుక్కుమంది పిస్తోలు! రెప్పపాటు వ్యవధిలో రెండుసార్లు ట్రిగర్ వత్తేడు కృపానంద్. మొదటిగుండు శివదాస్ చేతిలోని పిస్తోల్ను ఎగరగొట్టింది! రెండో గుండు గదిలో వెలుగుతున్న బల్బుని పగలగొట్టింది!!

మరుక్షణం, చీకట్లో, పక్కనేవున్న కిటికీవైపు

గించేడు కృపానంద్.

"శాంతినాథ్...బిక్షపతీ! పట్టుకోండి వాణ్ణి!" అరిచాడు శివదాస్, చీకట్లో.

# 6

కిటికీగుండా అవతలికి దూకగానే, బాణంలా కారు గేరేజ్ వైపు పరుగు తీసాడు కృపానంద్. క్షణాలమీద కార్లో కూర్చుని, స్టార్ట్ జేసి, వెనక్కి తీసాడు. గేర్లు మార్చి ముందుకు పరిగెత్తించాడు.

అప్పుడు వినిపించిందతనికి, ఇంట్లోంచి వాళ్ళు పరిగెత్తుకువస్తున్న బూట్సుల శబ్దం!

ఎడంచేతిమధ్య నిప్పుకణం పెట్టినట్టు మంట. నరాలు మెలితిరుగుతున్నట్టు బాధ. ఐనా, కృపానంద్ ఆ బాధని లెక్కచెయ్యకుండా, అరవై మైళ్ళ స్పీడులో కారు తోలుతున్నాడు.

కొన్ని రోడ్స్ కట్ జేశాక, తిరువత్తియూర్ వెళ్ళే జి. టి. రోడ్ మీదికి చేరుకున్నాడు. సరిగ్గా అదే సమయంలో, చీకట్లు తొలగిపోయి, తెలతెలవారసాగింది.

అనుకోకుండా సైడ్ మిర్రర్‌లోకి చూసి, ఉలిక్కిపడ్డాడు. వెనక ఓ సిమెంట్ కలర్ కారు వస్తోంది! వాళ్ళేనా? ఏ కారో దొంగలించి తనని వెంబడిస్తున్నారా?

ఈ ఆలోచన రాగానే కృపానంద్ కాలు, ఏక్సిలేటర్ని మరింత నొక్కసాగింది. కారు గాలిలో తేలిపోతున్నట్టు దూసుకుపోతోంది. ఇదే స్పీడ్ మేంటినెన్స్ చేస్తే ఏక్సిడెంట్ అయ్యే ప్రమాదముంది.

వాళ్ళు కారేమో! తను ఊరికే ఖంగారుపడుతున్నా

డేమో! ఈ ఆలోచన రాగానే స్పీడ్ కాస్తస్లో చేసాడు. స్పీడ్ తగ్గేసరికి ఆ కారు, నిముష నిముషానికీ దగ్గిరవసాగింది.

ఊహించని విధంగా ఆ కార్లోంచి రెండుసార్లు పిస్తోలు పేలింది.

కృపానంద్ గతుక్కుమన్నాడు. మరుక్షణం అతని కారు వెనుకటి స్పీడందుకుంది. ఆ కార్లో వాళ్ళే వున్నారని దీనితో రూఢి అయిపోయింది.

ప్రాణాలు పోయినా సరే, వాళ్ళకి చిక్కకూడదు. చిక్కడంటే ఎంత క్రూరంగా చంపబడతాడో పానంద్‌కి తెలుసు. అందుకే బాణంలా పరిగెత్తి న్నాడు కారుని.

కొద్దిదూరం వెళ్ళాక, ఎదురుగా రైల్వేక్రాసింగ్ కనిపించింది! అంతేకాదు, ఏదో రైలు వస్తున్నట్లు సంకేతంగా, క్రాసింగ్ కటూ ఇటూ వున్న ఆటోమేటిక్ బేరియర్స్, కిందికి దిగుతున్నాయి!

కృపానంద్ గుండె దడదడ కొట్టుకోసాగింది. కారు స్పీడ్ మాత్రం తగ్గించలేదు. ఏదైతే అయిందని దూసుకు పోయాడు.

ఆ తెగింపువల్లే, కారు మొదటి బేరియర్ని దాటేసింది. రెండో బేరియర్ పడటానికింకా కొద్ది వ్యవధేవుంది!

శక్తికొద్దీ ఏక్సిలేటర్‌ని వత్తేడు కృపానంద్. వెంట్రుక వాసిలో ప్రమాదం తప్పింది. కారు అవతలికి దూసుకు పోయింది. వెనుక, రెండో బేరియర్ కూడా దిగిపోయింది!

తేలిగ్గా నిట్టూరిస్తూ, సైడ్ మిర్రర్‌లోంచి చూసేడు వెనక్కి.

రైల్వేక్రాసింగ్ బ్లాక్ కావడంతో, వాళ్ళు వస్తున్న ఫియట్ కారు క్రాసింగ్ కవతలి వైపే ఆగిపోయింది!

నవ్వుకుంటూ మిర్రర్ మీంచి దృష్టి తిప్పేడు కృపానంద్. అప్పుడు పడింది అతని దృష్టి, ఎదురుగావున్న బ్లయిండ్ కార్నర్ మీద! గేర్ డౌన్ చెయ్యడానిక్కూడా వ్యవధిలేదు.

అదే క్షణంలో ఆవైపునించి ఓ మోటర్ సైకిల్, మలుపు తిరుగుతోంది. కారు ఆ మోటర్ సైకిల్ని గుద్దుకుంటుందనే ఖంగారుతో, బ్రేక్ వత్తుతూ, స్టీరింగ్ గిరగిరి తిప్పేడు కృపానంద్.

కారు కంట్రోలు తప్పింది. మలుపు కిరుపక్కలా రోడ్డు పక్క నాటివున్న రాళ్ళకి గుద్దుకుని, రెండు గజాలు ఎగిరింది. అలా ఎగురుతూనే కొద్దిదూరం వెళ్ళి, గుంటల్లో పల్టీలుకొట్టింది. అదృష్టవశాత్తూ డోర్ తెరుచుకోవడం వల్ల, కృపానంద్ శరీరం పిల్లిమొగ్గలు వేస్తూ యివతల పడింది!

అతని పక్కటెముకలూ, కాలి ఎముకలూ నజ్జునజ్జయ్యాయి. మనిషికి స్పృహతప్పలేదు. గట్టిగా ఉఛ్వాసనిశ్వాసలు తీస్తూన్నాడు. కళ్ళల్లో నింగీనేలా కలగాపులగంగా తిరుగుతున్నాయి. ఇక తను ఎక్కువసేపు బ్రతకడని తెలిసిపోయిందతనికి కృపానంద్ కు.

అదేసమయంలో, ఎవరో తనని సమీపిస్తున్న అడుగుల శబ్దం వినిపించి, మెల్లిగా అటు చూసేడు. ఏవ్యక్తికైనా తే తను రక్షించడానికి, ఇలా ఏక్సిడెంట్ పాలయ్యాడో, ఆ మోటారుసైకిలతనే అతను!

కళ్ళు మూసుకున్నాడు కృపానంద్. ఏ మృత్యువు

నించి తప్పించుకోడానికి తనిలా పలాయనమయ్యాడో, ఆ మృత్యువే యిప్పుడు తనని కబళించబోతోంది!

మనిషి ఈ సత్యాన్ని ఎందుకు గ్రహించడు?

అడుగుల శబ్దం దగ్గరవగానే కళ్ళు తెరిచేడు కృపానంద్.

అతను గబగబ వచ్చి, కృపానంద్ పక్కన కూర్చుని ఏదో అనబోయాడు.

"మాట్లాడక... నేనెక్కువసేపు బ్రతకను... ముగ్గురు హంతకులు నన్ను తరుముకొస్తున్నారు... నా పేరు కృపానంద్... కడపలోని స్ట్రీట్ లో... నూటతొంభైఆరవ ఇంట్లో... నా భార్య వుంటోంది... నీవామెకి నా చివరి సందేశం అందజెయ్యాలి..." అన్నాడు కృపానంద్ ఆయాసపడుతూ.

"నన్ను రక్షించబోయి, నీ వీ ప్రమాదాన్ని తెచ్చుకున్నావ్. ఒక విధంగా నేను నీకు ఋణగ్రస్తుణ్ణి! నీ చివరి కోరికి తీర్చి, నా ఋణభారం దింపుకుంటాను. చెప్పు నీ భార్య పేరేమిటి?" అడిగేడతను ఆత్రుతగా.

"స్వప్న వేణి!"

"సందేశం ఏమిటి?

"నేనామెకోసం, ఇరవైలక్షలు విలువచేసే నిధిని వదిలిపోతున్నాను... ఈ సంగతి ఆ హంతకులకి, ఎంత మాత్రం తెలియకూడదు..."

"ఆ నిధి ఎక్కడుందో నీ భార్యకి తెలుసా?"

"తెలీదు... మీ నాకీ కాలనీ... ఇరవై నాలుగు నలభై తొమ్మిదో ఇంట్లో... శంకరన్ అనే... వ్యక్తి... నివసిస్తాడు... అ...క్..." కృపానంద్ కంఠంలో ఏదో అడ్డు పడ్డటయింది.

అతని పెదాల పక్క నించి రక్తపు చార ఇవతలికి వచ్చింది. బాగా మైకం వస్తున్నట్టు, ఒక్క క్షణం ఆ వ్యక్తివైపు చూసి, తల వాల్చేసేడు.

అతను ఆత్రతగా, కృపానంద్ తల తనవైపుకు తిప్పుకున్నాడు.

కృపానంద్ మరణించేడు.

పెదవి విరుస్తూ లేచి నిల్చున్నాడతను.

అదే సమయంలో, ఓ సిమెంట్ కలర్ ఫియట్ కారు వచ్చి, రోడ్డుమీద ఆగింది. ముగ్గురు వ్యక్తులు హడావుడిగా కార్లోంచి దిగేరు. ఏదో మంచుకొస్తున్నట్లు గబగబ ఇటే రాసాగేరు.

కృపానంద్ చెప్పిన హంతకులు వాళ్ళే అయుంటారని గ్రహించేడతను.

వాళ్ళతన్ని సమీపించి_"చచ్చేడా?" అడిగేరు ఏక కంఠంతో.

తలూపేడతను.

"చావకముందు నీతో ఏమైనా చెప్పేడా?" అడిగేడు శివదాస్.

"లేదు! నేనతని దగ్గరికి రాకముందే ప్రాణం పోయింది!"

"నీ పేరేమిటి?"

"మణిప్రసాద్."

"ఆల్ రైట్! నీవిక వెళ్ళొచ్చు. శవం సంగతి మేం చూసుకుంటాం!"

మణిప్రసాద్ తలూపి, రోడ్డువైపు నడిచేడు. రోడ్డు మీదికెళ్ళి, వెనుదిరిగి చూసేడు.

ముగ్గురు గబగబ శవం జేబులు వెదుకుతున్నారు.

రోడ్డుపక్క ఆగివున్న తన మోటర్ బైక్ ఎక్కబోతూ అప్పుడు గమనించేడతను. ఆ హంతకులు వచ్చిన ఫియట్ కారుకి కొద్దిదూరంలో మరో కారు ఆగివుంది!

ఆ కారునానుకుని ఫుల్ సూటులో వున్న వ్యక్తి నిల్చున్నాడు.

"ఏదైనా ఏక్సిడెంట్ జరిగిందా అక్కడ?" అడిగేడతను మణిప్రసాద్ ని.

"ఔను!"

"చచ్చారా, ఎవరైనా?"

"ఔను! ఒక్కడే!"

"మిగతావాళ్ళు ఏంచేస్తున్నారు."

"శవం జేబులు వెదుకుతున్నారు."

"ఎందుకూ?"

భుజాలెగరేసి, మోటర్ బైక్ ఎక్కబోయాడు మణిప్రసాద్.

అతను చిటికేసి—"మాట!" అన్నాడు.

ప్రశ్నార్థకంగా చూసేడు మణిప్రసాద్.

"చచ్చేముందు అతను మీతో ఏమైనా చెప్పేడా?"

ఆ వ్యక్తి వేసిన ప్రశ్నతో, మణిప్రసాద్ నోరు తెరుచుకుంది.

ఆ వ్యక్తి పాంటుజేబులో చెయ్యిపెట్టేడు. తిరిగి బైటికి వచ్చిన అతని చేతిలో ఓ విజిటింగ్ కార్డుంది!

దాన్ని మణిప్రసాద్ వైపు చూపేడు.

'డిటెక్టివ్ కృష్ణమూర్తి.
హబీబుల్లా రోడ్,
మద్రాసు-28' అని అచ్చువేసుంది దానిమీద.

"ఇప్పుడైనా మీరు నా ప్రశ్నకి జవాబిస్తారను కుంటాను" అన్నాడతను నవ్వుతూ.

"కృపానంద్ మరణిస్తూ, తన భార్యకి చేరవెయ్యమని ఓ సందేశం వదిలిపోయాడు."

"ఏమిటా సందేశం?"

"ఆమెకోసం ఇరవైలక్షలు విలువచేసే నిధిని నీ చోట భద్రపరిచేడుట!"

"ఎక్కడ?"

"అదే చెప్పబోతుండగా అతని ప్రాణాలు పోయింది..."

"థాంక్యూ! మీ పేరు?"

"మణిప్రసాద్!"

"సరే, మీరిక వెళ్ళండి! దార్లో ఓ పెట్రోల్ బంక్ వస్తుంది. అక్కణ్ణించి పోలీసులకు ఫోన్ చెయ్యండి."

మణిప్రసాద్ తలూపి, బైక్ ముందుకి పోనిచ్చేడు.

# 7

కృపానంద్ ప్రాణం విడుస్తూ చెప్పిన, వడపళని వీధిలోని నూటాతొంభైఆరో ఇంటిముందు మోటర్ బైక్ ఆపేడు మణిప్రసాద్.

ఉదయం పదిగంటలవుతోంది అప్పుడు.

ఇంటి తలుపు మూసుంది. మెట్లెక్కి తలుపు తట్టేడు. నిశ్శబ్దం! మళ్ళీ తట్టేడు.

లోపల ఎవరో తలుపుని సమీపిస్తున్న అడుగుల చప్పుడు వినిపించింది. అది బూట్సుల శబ్దం! గడియ తీస్తున్న సవ్వడి. తలుపు తెరుచుకుంది.

ఓ వ్యక్తి సుడిగాలిలా ఇవతలికి వచ్చి, గబగబ వెళ్ళి

పోయాడు. అతన్ని చూడగానే మణిప్రసాద్ నిర్ఘాంత బోయాడు.

అతనెవ్వరో కాదు.

కృపానంద్ శవందగ్గర కనిపించిన ముగ్గురిలో ఒకడు!

గుమ్మందగ్గిర చప్పుడవడంతో తలుపువైపు చూసేడు మణిప్రసాద్.

ఇరవైఏనిమిదేళ్ళుంటాయామెకి. కళ్ళు చెదరగొట్టే అందం! ఎందుకో బెదిరినలేడిలా వుంది వాలకం!।

"స్వప్న వేణిగారున్నారా ఇంట్లో?" అడిగేడు మణిప్రసాద్.

"న్... నేనే స్వప్నవేణిని! మీరెవ్వరు?" ఆమె కంఠంలో కంపన.

"నా పేరు మణిప్రసాద్!"

"మా వారి స్నేహితులా?"!

"కాదు మీకో దుర్వార్త చెప్పడానికి వచ్చాను."

ఆమె నిట్టూర్చింది. "నా భర్తగారు ఏక్సిడెంట్‌లో మరణించాడనే కదూ?"

మణిప్రసాద్ నివ్వెరబోయి, "మీకెలా తెలిసింది?" అన్నాడు.

"ఇంతక్రితం వచ్చిన వ్యక్తి చెప్పేడు."

"అతను మీకు తెలుసా?"

"తెలుసు! నా భర్తవెంట అప్పుడప్పుడూ వచ్చేవాడు ఇంటికి."

"అతని పేరేమిటి?"

"భిక్షుపతి!"

"మీ భర్త మరణం మీకు విచారాన్ని కలిగించడం లేదా?"

ఆమె వేడినిట్టూర్పు విడిచి, "దేనికి విచారించాలి? అతను చేపట్టిన మార్గం అటువంటిది. ఆ వృత్తిలో ఎవ్వరికీ సహజమైన చావురాదు. మరణశిక్షపడో, పోలీసుల కాల్పులకి గురయ్యో, లేదా ఇటువంటి ఏక్సిడెంట్ పాలు బడో ప్రాణాలు పోగొట్టుకుంటూరు" అంది.

"బిక్షపతి ఇక్కడికెందుకొచ్చేడు?"

"ఆయనా, అతనూ, మరో ఇద్దరూ కలిసి, నిన్నరాత్రి ఓ మార్వాడీ దగ్గర ఇరవైలక్షల ఖరీదుచేసే వజ్రాలు దొంగిలించేరుట. మా ఆయన వాళ్ళకళ్ళల్లో కారంకొట్టి వజ్రాలతో పరారయ్యేడుట.

వాటిని ఇక్కడే, ఇంట్లోనే దాచివుంటాడని వెతకడానికి వచ్చేడు. నిజానికి, నేనాయన మొహం చూసి, పది రోజులైంది. అదే చెప్పేను బిక్షపతికి.

ఆయన నమ్మలేదు. పైగా కోపంతో నన్ను నానా మాటలన్నాడు. నా భర్త వాటినెక్కడ దాచేడో నాకు తెలుసుట. ఇప్పుడాయన మరణించేడు గనుక, వాటిని నేనొక్కర్తినే కాజెయ్యడానికి ఎత్తు వేస్తున్నానుట.

అంగుళం వదలకుండా ఇల్లంతా వెతికేడు. ఏమీ దొరక్కపోవడంతో మరీ రెచ్చిపోయి, పిస్తోలు తీసేడు. వజ్రాలెక్కడున్నాయో చెప్పకుంటే కాల్చిపారేస్తానని బెదిరించేడు.

సరిగ్గా అదే సమయంలో మీరు తలుపు తట్టేరు గనుక, నేను బ్రతికిపోయాను..." అంది స్వప్నవేణి.

"కృపానంద్ ఇంటికి వచ్చి పదిరోజులయిందన్నారు కదూ?"

"నేనలా అన్లేదే! ఆయన మొహం చూసి పదిరోజు

అయిందన్నాను! నేనింట్లో లేనిసమయంలో ఆయన వచ్చుండొచ్చుగా.

"నిన్నరాత్రి మీరింట్లో ఉన్నారా?"

"లేను. సెకండ్ షో పిక్చర్ కెళ్ళాను."

"ఐతే, కృపానంద్ వజ్రాలను తప్పకుండా ఇక్కడే దాచుంటాడు."

"భిక్షపతి సూదిమొనంత స్థలం కూడా వదలకుండా వెదికాడే?"

"అతను నీ ఇంటికి కొత్తవాడు. మీకు తెలిసినంత క్షుణ్ణంగా ఈ ఇంటి గురించి అతనికి తెలియదు. ఎక్కడో పొరపాటు పోయి వుంటుంది. మీరు మరోసారి వెతకండి కృపానంద్ వాటిని ఇంట్లో కాకుండా, ఏ హోటల్ లాకర్లోనో దాచే అవకాశం కూడా వుంటుంది. ఆ లాకర్ తాలూకు తాళం చెవి ఇక్కడ దాచినా దాచుంటాడు. ఈ విషయం కూడా గుర్తుంచుకోవాలి."

"ఇంతకీ, మీ గురించి చెప్పేరు కాదు. మా ఆయనతో మీకు ఏమిటి సంబంధం?"

మణిప్రసాద్ చెప్పేడు జరిగిందంతా పూసగుచ్చినట్లు ఆమెకు.

"సమయానికి మీరు రాబట్టి, నేను భిక్షపతి బారినించి బైటపడగలిగాను. ఆ నీచులు ఏ క్షణంలోనైనా మళ్ళీ వచ్చి నన్ను వేధించవచ్చు. మీరు నాకండగా వుండాలి. వజ్రాలు గనుక నాకు దొరికితే, ఏం చెయ్యమంటారు?" అంది స్వప్నవేణి.

మణిప్రసాద్ కంఠం తగ్గించి, "ఇరవై లక్షలంటే మాటలా? జీవితాంతం స్వర్గసుఖాలనుభవించవచ్చు," అన్నాడు భావయుక్తంగా.

"కాంతా, కనకం ఒకేసారి దొరుకుతోంటే, కాదనే వాడెవ్వడు? సాధ్యమైనంత త్వరగా నీవీ ఇల్లు వదిలి, ఏ హోటల్ కైనా బస మార్చు. అక్కడ మనుషుల సంచలనం ఎక్కువ ఉంటుంది. నిన్నో కంట కనిపెడుతూ నేనుండనే వుంటాను."

"ఏ హోటల్ కెళ్ళమంటారు?"

"ప్లాజా!"

స్వప్నవేణి ఏదో అనబోతుండగా టెలిఫోన్ మోగింది.

"హలో... స్వప్నవేణి స్పీకింగ్! ... మీరెవరు?... డిటెక్టివ్ కృష్ణమూర్తిగారా... నాతో ఏమిటి పని?... సరే, రండి... ఇంట్లోనే వుంటాను!" అంటూ రిసీవర్ దించింది స్వప్నవేణి.

ప్రశ్నార్థకంగా చూసాడు మణిప్రసాద్.

"ఎవ్వరో డిటెక్టివ్ కృష్ణమూర్తిట! నాతో అర్జంటుగా మాట్లాడాలిట. ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?",

"ఏక్సిడెంట్ జరిగినచోట నేనతన్ని చూసాను. బహుశా, ఆ సందర్భంలో నే నీతో మాట్లాడ్డానికి వస్తున్నట్టున్నాడు. జాగ్రత్త! డిటెక్టివ్లు అవులిస్తే పేగులు లెక్క పెట్టే పిండాలు. ఏమీ తెలీనట్టు సమాధానాలిచ్చి పంపు. నేనిక్కడుండటం ప్రమాదం, సాయంత్రానికల్లా నీవు ప్లాజా హోటల్ చేరుకో. నే నక్కడే కలుస్తాను" అంటూ లేచాడు మణిప్రసాద్.

# 8

సాయంత్రం ఐదు గంటలకి ప్లాజా హోటల్ చేరుకుని స్వప్నవేణి గురించి వాకబ్ చేసాడు మణిప్రసాద్. థర్డ్ ఫ్లోర్లో నూటా ఎనభైరెండో గదిలో దిగిందని తెలిసింది. లిఫ్ట్లో పైకెళ్ళి, ఆమె గదిముందాగి, కాలింగ్ బెల్ నొక్కాడు.

నిమిషం తరవాత తలుపు తెరుచుకుంది.

"వచ్చారా? రండి!" అంటూ తలుపు కడ్డం తొలగింది స్వప్నవేణి.

మణిప్రసాద్ సోఫాలో చతికిలబడి, "ఆ డిటెక్టివ్ నిన్ను కలుసుకున్నాడా?" అడిగేడు.

"ఔను."

"ఏమన్నాడు?"

"వజ్రాల గురించి అడిగాడు!"

"ఏమన్నావ్?"

"నాకేం తెలీదన్నాను."

"అతను ఎవ్వరికోసం, దేనికోసం ఈ వ్యవహారంలో తలదూరుస్తున్నాడట?"

"హత్య చెయ్యబడ్డ సేఠ్ చండీరామ్ తరఫున!"

"ఇల్లంతా వెతికావా?"

"వెతికాను. ఆఖరికి సలంకూడా వదలకుండా వెదికాను. తాళం చెవీ లేదు. వజ్రాలూ లేవు!"

తల విదిలించాడు మణిప్రసాద్. "నాకు నమ్మశక్యం కావడం లేదు. వెతకడంలో నీకల్లకూడా ఏదో ఒక స్థలం మిస్ అయుంటుంది."

"ఐతే, మళ్ళీ వెదకమంటారా?"

"వద్దు!"

"మరి?"

"నేనే వెళ్ళి వెదుకుతాను. ఇంటి తాళం చెవి నాకివ్వు!"

స్వప్నవేణి పలకలేదు. కాసేపు ఆలోచించి, ఏమను కుందో ఏమో, హాండ్ బ్యాగ్ తెరిచి, తాళం చెవులందిం చింది.

"ఇంకో సంగతి! ఉదయం ఆ డిటెక్టివ్ వచ్చి వెళ్ళాక, పోలీసులు వచ్చారు మా ఇంటికి!"

"పోలీసులా? ఎందుకు?" అడిగాడు మణిప్రసాద్ ఆత్రంగా.

"మా ఆయన జేబుల్లో కొన్ని కాగితాలు దొరికేయట. వాటి ఆధారంతో మా ఇల్లు కనుక్కోగలిగారుట. ఆ కాగితాల్లో, అన్నాదురై స్ట్రీట్‌లో వున్న ఓ నర్సింగ్ హోం బిల్ కూడా వుందిట. ఆ నర్సింగ్ హోంతో మా ఆయనకేమిటి సంబంధం అని సవాలక్ష ప్రశ్నలు వేసారు. నాకేమీ తెలీదని పంపాను!"

"అలాగా! దాని విషయం నిదానంగా ఆలోచిద్దాం!" అన్నాడు మణిప్రసాద్ లేస్తూ.

# 9

టాక్సీ ఎక్కి, తిన్నగా స్వప్నవేణి ఇంటికి బయలు దేరాడు మణిప్రసాద్.

ఇంటిముందు టాక్సీదిగి, మీటర్ డబ్బులిచ్చి టాక్సీని పంపేసాడు. హిప్ పాకెట్లోంచి, స్వప్నవేణి ఇచ్చిన తాళం చెవి అందుకుని ఇంటి మెట్లెక్కాడు.

అది డోర్ లాక్ సిస్టమ్ తలుపు. కీ హోల్లో తాళంచెవి దూర్చి తిప్పేడు. తెరుచుకుంది. తలుపు తోసి లోనికెళ్ళిన మణిప్రసాద్ నివ్వెరబోయాడు!

ఎవ్వరో, ఆదివరకే ఇల్లుపీకి పందిరేసారు, సామానంతా చిందరవందరగా పడుంది. సాలోచనగా తలూపుతూ, పడగ్గదిలో ప్రవేశించాడు. మంచంమీది పరుపూ, దిళ్ళూ కోసి, పోగులు పెట్టున్నాయి.

ఓ గోడవారగా, గోద్రెజ్ బీరువా వుంది. దాని సమీపించి, పిడితిప్పి తలుపు తెరిచాడు. అంతే!

మొదలు నరికిన చెట్టులా, దభీమంటూ అతనిమీద పడింది ఓ మానవ శరీరం! మణిప్రసాద్ గుండె గుభిల్లుమంది. పడబోతూ నిలదొక్కుకున్నాడు. అప్పటికే ఆ శరీరం బేలెన్స్ తప్పి కింద పడింది బోర్లా! అతన్ని వెల్లికిలా తిప్పి నిర్ఘాంతబోయాడు మణిప్రసాద్.

అతను ఎవ్వరో కాదు.

కాంతినాథ్!

కళ్ళూ, నాలికా వెళ్ళుకువచ్చి వున్నాయి. ఒంటిమీద ఎటువంటి గాయమూ లేదు. ఎవ్వరో అతన్ని గొంతు నులిపి చంపారు!

అంతలో, అవతలి గదితలుపు దగ్గర చిన్నశబ్దమయింది.

మణిప్రసాద్ వెంటనే బెడ్‌రూం తలుపు పక్కన నక్కి అవతలికి తొంగిచూసాడు.

ఎవ్వరో అవతలినించి, మూసివున్న తలుపు-కీ హోల్లో తాళం చెవి దూర్చి తిప్పుతున్నారు. లాక్ తెరుచుకోడం లేదు.

రంధ్రంలోంచి ఆ తాళం చెవి వెనక్కి వెళ్ళింది. నిమిషం తరవాత మరో తాళంచెవి లోనికి దూరింది. అంతకీ లాక్ తెరుచుకోలేదు. ఆలా నాలుగైదు తాళం చెవులతో ట్రైజరిగాక, ఆరోతాళం చెవితో క్లిక్‌మన్న చప్పుడయింది.

నెమ్మదిగా కిర్రుమంటూ తెరుచుకుంటోంది తలుపు!

మణిప్రసాద్ చాటునించి గుమ్మం మధ్యకి వచ్చి నిల్చున్నాడు. తలుపు తోసుకుంటూ లోనికి వచ్చిన వ్యక్తి, మణిప్రసాద్‌ని చూసి ఉలిక్కిపడ్డాడు.

అతను శివదాస్!

"నువ్వా!? కృపానంద్ ఆక్సిడెంట్ అయినచోట కనిపించావ్ కదూ! ఇక్కడేం చేస్తున్నావ్?" అడిగేడు ఆశ్చర్యంగా.

"ఏ లక్ష్యంతో నువ్వు వచ్చేవో, ఆ లక్ష్యంతోనే వచ్చేను. కాని, నా కన్నా ముందే, ఎవడో మహానుభావుడు ఆ పని కాస్తాపూర్తి చేసుకెళ్ళాడు."

"అంటే వజ్రాలు పట్టుకెళ్ళాడు?"

"ఏమో!"

సాలోచనగా తలూపుతూ పడగ్గదివైపు రాసాగేడు శివదాస్.

మణిప్రసాద్ క్షణంలో తలుపుదగ్గరికి చేరుకున్నాడు. అతనింకా తలుపు తెరవకముందే, "ఆగు!" అన్న కేక వినిపించింది.

ఊపిరి బిగపట్టి వెనుదిరిగేడు.

శివదాస్ చేతిలో పిస్తోలు మెరుస్తోంది! "కాంతినాథ్‌ని ఎవరు చంపారు?"

"అతన్ని నేను చంపలేదు! ఎవ్వరో ముందే చంపేశారు!"

"నోర్ముయ్! నువ్వు చంపకుంటే, వాడిశవం లోపలుందని నాకెందుకు చెప్పలేదు?"

"నీ అనుమానానికాస్కారణం లేకపోలేదు. ఇప్పుడు నా

పొజిషన్ అలా వుండిమరి! నా మాట నమ్ము."

శివదాస్ పలక లేదు. కాసేపు ఆలోచించి_"హంతకుడు నువ్వో, ఇంకెవడో గానీ, చెప్పు. కృపానంద్ మరణిస్తూ నీతో ఏమన్నాడు?"

"నే నతని దగ్గరి కెళ్ళేలోగా, అతను ప్రాణం వదిలేడు."

"మణిప్రసాద్! ఈ బోగస్ డైలాగు ఇదివరకే విన్నాను. నీవు నిజం చెప్పడం లేదని నా అనుభవం చెబుతోంది!"

"నీవు నమ్మినా, నమ్మకున్నా నేను చెప్పింది నిజం!"

"నీ జవాబు అదే అయితే, కృపానంద్ వెళ్ళిన చోటికే నిన్నూ పంపక తప్పదు మరి! నిర్ణయించుకో. ఒకేఒక్క నిమిషం టైం ఇస్తున్నాను!" అన్నాడు శివదాస్ రిస్టువాచీ చూస్తూ.

మణిప్రసాద్ ముహంలో సన్నసన్నగా స్వేదబిందువులు పేరుకోసాగాయి. రాతిబొమ్మలా చూస్తూ నిల్చుండిపోయాడు.

"నిమిషం పూర్తయింది! అంతేకాదు, నీ ఆయువూ మూడింది" అంటూ ట్రిగ్గర్ మీద వేలు పెట్టేడు శివదాస్.

"ఆగు! చ్... చెబుతాను... కృపానంద్ మరణిస్తూ, తన భార్యకోసం ఇరవై లక్షల వజ్రాలు వదిలిపోతున్నానని చెప్పేడు."

"ఇంకా?"

"మీనాక్షి కాలనీలో, ఇరవై నాలుగూ, నలభై తొమ్మిదో నెంబర్ ఇంట్లో వుంటున్న శంకరన్ అనే వ్యక్తి పేరు ఉచ్చరించేడు."

"ఎందుకు?"

"అదే చెప్పబోతుండగా అతని ప్రాణంపోయింది."

"సరే, ఆ కుర్చీలో కూర్చో!" అంటూ కుర్చీ చూపేడు శివదాస్.

మరబొమ్మలా కుర్చీలో కూలబడ్డాడు మణిప్రసాద్.

గుమ్మానికి వేళ్ళాడుతున్న కర్టెన్ చింపి, అతన్ని సమీపించేడు శివదాస్.

"అదేమిటి!?"

"నిన్ను కట్టిపడేసి, ఆ శంకరన్ ఇంటికెళ్ళొస్తాను. అంతవరకూ నీవిక్కడ బుద్ధిగా కూర్చోవాలి. నీవు చెప్పింది అబద్ధమని తేలిందా, ఇక్కణ్ణించి బైటకెళ్ళేది నీ శవమే!" అంటూ మణిప్రసాద్ చేతులు వెనక్కి విరిచి గట్టిగా బిగగట్టేశాడు శివదాస్.

కాళ్ళుకూడా కుర్చీకాళ్ళకి బిగించి, నోట్లో గుడ్డకుక్కి "వస్తాను" అంటూ తలుపు తెరుచుకుని బైటికెళ్ళాడు.

మరుక్షణం తలుపు మూసుకుంది. అవతల లాక్ వేస్తున్న చప్పుడు. మణిప్రసాద్ గుండెలో గుర్రాలు దౌడు తీస్తున్నాయి. తప్పించుకునే మార్గం ఏదీ కానరావడం లేదు. ఐనా, చేతికట్లు వదులుచేసుకోడానికి శతవిధాలా ప్రయత్నించసాగేడు.

అదే సమయంలో టీపాయ్‌మీద టెలిఫోన్ గణగణ మోగింది! ఉలిక్కిపడి అటుచూసేడు. చాలాసేపు అలాగే మోగి, దానంతటదే ఊరుకుంది ఫోన్!

ఐదు నిమిషాలాగి మళ్ళీ మోగింది!

కాసేపయ్యాక తిరిగి ఊరుకుంది.

అలా రెండు, మూడుసార్లు జరిగేక, మోగడం మానేసింది టెలిఫోన్!

నిస్సహాయంగా దానివైపు చూస్తూ కూర్చున్నాడు మణిప్రసాద్.

అరగంట గడిచింది!

హఠాత్తుగా, ఎవరో తలుపు తట్టిన శబ్దమైంది!

మణిప్రసాద్ మనసు ఉరకలు వేసింది. ఎంత ప్రయత్నించినా అతని నోరు పెగలడంలేదు. మళ్ళీ తలుపు బాదిన చప్పుడు.

చివరి ప్రయత్నంగా, శక్తినంతా కూడదీసుకుని, కుర్చీ సమేతంగా నేలమీద దొర్లేడు మణిప్రసాద్.

పెద్ద చప్పుడయింది!

అవతల తలుపుతట్టడం ఆగిపోయింది. లాక్ తెరవడానికి ప్రయత్నిస్తున్నారు. రెండు నిమిషాల తర్వాత క్లిక్ మన్న శబ్దం!

కిర్రుమంటూ తెరుచుకుంది తలుపు.

"నువ్వా!?" అన్నాడు మణిప్రసాద్ ఆనందాతిశయంతో.

అతని మిత్రుడు నవ్వి—"మీరిక్కడికి వస్తున్నానని చెప్పేరు కదా, ఇంకా రాలేదేమిటా అని, టెలిఫోన్ డైరెక్టరీలో ఈ ఇంటి ఫోన్ నెంబర్ కనుక్కుని రింగ్ చేసేను. ఎంతకీ జవాబు రాకపోవడంతో, అనుమానం వేసి, పరిగెత్తుకొచ్చేను" అంటూ గబగబ మణిప్రసాద్ కట్లు విప్పేడు.

అతను లేచినిల్చుని—"పద!" అన్నాడు.

"ఎక్కడికి?"

"మీనాక్షి కాలనీ!"

# 10

మీనాక్షీ కాలనీలో, శంకరన్ ఇల్లు కనుక్కోవడం వాళ్ళకట్టే కష్టం కాలేదు. ఇంటితలుపు మూసి ఉంది!

"బహుశా, శివదాస్ యింట్లో ఉండివుంటాడని నా అనుమానం! దేనికైనా మంచిది, నీవు దొడ్డితలుపుగుండా, ఇంట్లో ప్రవేశించడానికి ప్రయత్నించవచ్చు" అన్నాడు మణిప్రసాద్ తన మిత్రుడితో.

అతను తలూపి, ఇంటి వెనకవైపు వెళ్ళాడు.

మణిప్రసాద్ మెట్లెక్కి తలుపు తట్టాడు.

"ఎవరు కావాలి?" అడిగాడు ఎనిమిదేళ్ళ కుర్రాడు.

"శంకరన్ ఉన్నారా ఇంట్లో?"

"గదిలో ఎవ్వరితోనో మాట్లాడుతున్నారు. తలుపు మూసుంది."

"మీ అమ్మెక్కడ?"

"వంటచేస్తోంది!"

"మీ నాన్నతో అర్జంటు పనుంది. ఏగదిలోవున్నారో కాస్త చూపెట్టు!" అంటూ యింట్లో ప్రవేశించాడు మణిప్రసాద్.

కుర్రాడు అతన్ని లోనికి తీసుకెళ్ళి, ఓగది చూపాడు. మూసివున్న తలుపు సందులోంచి లోనికి చూసాడు మణిప్రసాద్.

లోపల నులకమంచంమీద వెల్లికిలా పడున్నాడు శంకరన్. అతని చేతులు మంచానికి విరిచికట్టేసి ఉన్నాయి. అరవకుండా అతని నోటికి టేప్ అంటించి ఉంది!

శివదాస్, అతని పడికాలి ప్లాస్టర్ని కత్తితో కోస్తు న్నాడు. ఐదునిమిషాల్లో, పూర్తిగా కోసేశాడు ప్లాస్టర్ని. అంతే!

మణిప్రసాద్ కళ్ళు ఆశ్చర్యంతో విప్పారేయి.

కట్ చేసిన ప్లాస్టర్లోంచి ధగధగ మెరిసే వజ్రాలు బైటపడ్డాయి! కృపానంద్ వాటిని శంకరన్ కాలి ప్లాస్టర్లో దాచాడన్నమాట!

శివదాస్ ఆ వజ్రాలని కాగితంలో పొట్లం కట్టుకుంటూ తలుపువైపు తిరిగాడు. మణిప్రసాద్ తయారుగా నిల్చు న్నాడు తలుపుపక్కన.

గడియ తీస్తున్న శబ్దం. తలుపు తెరుచుకుంది. అంతే! ఒక్కతోపు తోసాడు అతన్ని గదిలోకి. ఊహించని ఆ దాడితో బేలెన్స్ తప్పి, నేలకరిచేడు శివదాస్.

మణిప్రసాద్ లోనికి దూరి, మెరుపులా జేబులోంచి పిస్తోలు బైటికి తీసాడు. అతన్ని చూడగానే దిగ్భ్రాంతితో శివదాస్కు మతిపోయింది.

"లే!" అన్నాడు మణిప్రసాద్ పిస్తోలు ఊపుతూ.

నోరు విప్పకుండా, నెమ్మదిగా లేచి నిల్చున్నాడు. సరిగ్గా ఆ దేక్షణంలో, మణిప్రసాద్ వెనక ఏదో చప్పుడై వెనుదిరగబోయాడు.

"కదలక! కాల్చేస్తాను. చేతిలో ఉన్న పిస్తోలు కింద పడెయ్" అన్న కంఠం వినిపించింది.

వెనుదిరిగి చూడకుండానే తెలిసిపోయింది.

అది డిటెక్టివ్ కృష్ణమూర్తి కంఠం!

మారు మాటాడకుండా, పిస్తోలు కింద జారవిడి చాడు.

"ఇద్దరూ చేతులెత్తి గోడవైపు వెళ్ళండి" ఆజ్ఞాపించాడు కృష్ణమూర్తి.

శివదాస్, మణిప్రసాద్ ఇద్దరూ చేతులు తలమీద పెట్టుకుని గోడదగ్గరకెళ్ళి నిల్చున్నారు.

కృష్ణమూర్తి లోనికి వచ్చి, మంచాన్నీ, మంచంమీద పడున్న శంకరాన్నీ, ప్లాస్టర్ ముక్కల్నీ చూసి తలాడించాడు, "ఐతే, వజ్రాలు చేజిక్కించుకున్నారన్న మాట! మీ ఇద్దర్లో ఎవరిదగ్గరున్నాయవి?"

కళ్ళతో శివదాస్ వైపు సైగజేసాడు మణిప్రసాద్.

"ఏదీ వాటినిలా ఇవ్వు!" అన్నాడు కృష్ణమూర్తి చెయ్యి చాపుతూ.

శివదాస్‌లో ఇంకా చలనం రాకముందే, గుమ్మం దగ్గర అడుగుల చప్పుడై, కృష్ణమూర్తి గిరుక్కున వెనుదిరగబోయాడు.

"కదలక! వీపు జల్లెడ చేస్తాను! పిస్తోలు కింద పడేయ్" అన్న కంఠం వినిపించింది.

కృష్ణమూర్తి తెగించాడు!

అతనింకా వెనుదిరక్కముందే, "ఢాం!" మంది పిస్తోలు, గుమ్మంలోంచి.

కృష్ణమూర్తి గావుకేక! అతని చేతిలోని పిస్తోలు ఎగిరి కిందపడింది. గదిలో అడుగుపెట్టాడు మణిప్రసాద్ స్నేహితుడు. అతన్ని చూడగానే మణిప్రసాద్ ప్రాణం లేచివచ్చింది.

గోడదగ్గిరినుంచి కదిలి, కృష్ణమూర్తిని సమీపించాడు. అతని చేతిగాయంలోంచి బొటబొట కారుతోంది రక్తం!

"తెగింపు అన్ని సమయాల్లోనూ పనికిరాదు మిస్టర్

నకిలి డిటెక్టివ్. డిటెక్టివ్ కృష్ణమూర్తిలా నటిస్తూ, వజ్రాలకోసం నానా అవస్థలూ పడ్డావ్...కాంతినాథ్‌ని చంపింది నీవేనని నాకు తెలుసు.

అసలు కృష్ణమూర్తితో నాకు మంచి పరిచయముంది. ఎందుకో తెలుసా? మీరనుకుంటున్నట్టు నేను మణిప్రసాద్‌ని కాను. డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డిని! ఇతను నా అసిస్టెంట్ సార్జెంట్ డేవిడ్.

ఈ కేసులో మేము అనుకోకుండా, కాకతాళీయంగా ప్రవేశించవలసి వచ్చింది. ఆరోజు, డ్యూటీమీద పారు గూల్ళో ఇన్వెష్టిగేషన్ జేసివస్తున్న నా మోటార్ బైక్‌ను ప్రమాదంనించి కాపాడాలనే, కృపానంద్ కారు ఏక్సిడెంట్ పాలయింది...

ఏది ఏమైనా, ఆ వజ్రాలకోసం మీరంతా, అద్భుతమైన ధైర్యసాహసాలు ప్రదర్శించేరు. ఫలితం మాత్రం ముదటికే వచ్చింది! మీ మరో అనుచరుడు భిక్షపతి, హోటల్లో స్వప్నవేణిపై హత్యాచారం జరుపబోతుంటే ఇంతకుముందే అరెస్టుచేశాము'' అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి శంకరన్ కట్లు విప్పుతూ.

సార్జంట్ డేవిడ్ యీలోగా వాళ్ళిద్దరికీ బేడీలువేసి బయటికి నడిచాడు.

——:ఐపోయింది:——

## సీరియల్




[పదిహేనవ భాగము]

నేను యింతకుముందు చూసిన ఆటవికుల గూడాల కంటె ఈ మాసయ్ గూడెం కొంత భిన్నంగా ఉన్నమాట నిజం.

ఇక్కడి ప్రకృతిసౌందర్యం పిచ్చెక్కిస్తోంది.

గూడెం అంతా అలికి, ముగ్గుపెట్టినట్లు—ఎంతో పరిశుభ్రంగా వుంది...గుడిసెలు చీమలపుట్టలా చిన్నవిగా వున్నాయి.

గుడిసెలపై కప్పులు—సరిగ్గా నా గడ్డం లెవెల్‌తో సమంగా వున్నాయి.

అంటే మనిషి బాగా వంగి లోపలికి ప్రవేశించాలన్న మాట!

“మిస్టర్ భయంకర్! గుడిసెల గోడలు చూడండి. వెదుళ్ళతో ఫ్రేంవర్క్ చేసి వాటిని గట్టిగా నిలబెట్టి దానిమీద బంకమన్నుతో ప్లాస్టింగ్ చేస్తారు. తిరిగి దాని మీద ఆవుకొవ్వు పులుముతారు” అంటూ వర్ణించాడు జైరీ.

“కానీ ప్రతియింటి గుమ్మాలు కేవలం మూడడుగుల ఎత్తుమాత్రమే వున్నాయి. ఏదో కారణం ఉండివుండాలి!” అన్నాను సాలోచనగా.

“బహుశా మాసయ్ గూడెవాసులు పిగ్మీల్లా పొట్టిగా ఉండివుంటారు. అందుకే పొట్టి గుమ్మాలు. యామ్ ఐ కరెక్ట్ మిస్టర్ జైరీ!” అంది బార్బరా—పెద్ద రహస్యం తెల్సుకున్నంత వెలుగు ముఖంతో.

“యు ఆర్ రాంగ్ మిస్. బార్బరా!” అన్నాడు కవ్వింపుగా నవ్వుతూ జైరీ.

అందరం అతనికేసి చూశాం “మరి?” అంది బార్బరా దెబ్బతిన్నట్లు ముఖం పెట్టి.

జైరీ ఆటవిక భాషలో పెద్దగా కేక పెట్టాడు. “అదుగో అటు చూడండి” అన్నాడు అదే సమాధానమన్నట్లు.

దగ్గర్లోని గుడిసెలోంచి తోలు వస్త్రాలు ధరించిన ఓ మనిషి బైటికి వచ్చాడు. లోపల్నించి తలుపుగుండా బైటికి రావడాన్కి అతను బాగా వంగాడు. సగాన్కి సగం వంగాడని చెప్పొచ్చు. అయితే అతను బయటికి

వచ్చి స్ట్రెయిట్ గా నిలబడగానే అతను ఆరడుగులు పైగా ఎత్తు వుండడం చూసి ఆశ్చర్యపోయేం.

"ఇంత పొడుగాటి మనుషులకు అంత చిన్న తలుపు లేమిటి?" శాన్ద్యోరా అడిగింది.

శాన్ద్యోరా ప్రశ్నకు సమాధానం నేనాలోచిస్తుండగానే గైడ్ జెరీ పెదవులు కదిలాయి.

"దానికో శ్రేష్ఠమైన కారణముంది. ఎవరైనా శత్రువు యింట్లోకి ప్రవేశించాలంటే సగానికి సగం వంగి లోపలికి వెళ్ళాలి. వంగి లోపలకు ప్రవేశించబోయే ఆ పొజిషన్‌లో శత్రువు తనను తాను రక్షించుకోలేడు. ఈలోగా శత్రువుని మాసయ్‌లు సులువుగా దెబ్బతీయవచ్చు లేదా బల్లెంతో సూటిగా పొడిచి గుడిసె బైటికి త్రోయొచ్చు..."

ఈలోగా మట్టియిళ్ళ నుండి మాసయ్ గూడెవాసులు మౌనంగా వంగి నడుస్తూ బైటికి రాసాగారు. వాళ్ళంతా తోళ్ళు ధరించివున్నారు మొలలవద్ద.

చెవులకు పెద్దపెద్ద రింగులు వేలాడుతూ బరువుగా చెవులు సాగివున్నాయి.

జుట్టు రింగులుతిరిగిపోయి ఉంది.

వారి వెనుకనుంచి—అందరూ దారి యివ్వగా—ఓ గంభీరమైన వ్యక్తి నవ్వుతూ ముందుకువచ్చాడు.

గైడ్ జెరీ నాయకుడితో ఏదో మాట్లాడాడు. తర్వాత పాల్ మాన్ అందించిన బహుమతులు నాయకుడికి ఇచ్చాడు. నాయకుడు ఎంతో తృప్తిగా తలాడించాడు.

అది పూర్తయ్యాక అడిగాను. "మిస్టర్ జెరీ! మట్టి గోడలమధ్య నివశిస్తూ, సరైన దుస్తులు ధరించకపోయినా

మనకంటే వీరెంతో పరిశుభ్రంగా కనబడుతున్నారు. రోజుకు ఎన్నిసార్లు స్నానం చేస్తారు ఈ గూడెం వాసులు?"

"మాసయ్‌లు జీవితంలో రెండుసార్లు మాత్రం 'మనం అనుకునే' స్నానం ఆచరిస్తారు. మొదటిసారి స్నానం చేసేది పుట్టగానే. రెండోసారి మరణించినపుడు. అంతే" అన్నాడు జైరీ నవ్వుతూ.

జైరీమాటలు ఆశ్చర్యం కలిగిస్తున్నాయ్. "మరి ఇంత క్లీన్‌గా..." గొణిగాను.

"మట్టి... శాండ్ బాత్ అనే పదం మీరు ప్రకృతి వైజ్ఞానిక పుస్తకాల్లో చదివివుండొచ్చు. అంటే ఇసుకలో ఒళ్ళు రుద్దుకోవడం. ఈ పద్ధతి—ఎంతో అలవాటు లేకుండా—అమలు పరుస్తే మీ చర్మం ఊడి రక్తం బైటికి కారుతుంది. ఇక్కడి గూడెవాసులు యిసుకతో ఒళ్ళు రుద్దుకుంటారు. అదే వీరి శరీరాన్ని యింత శుభ్రంగా ఉంచుతుంది."

ఇంతలో నాయకుడు—జైరీతో ఏదో చెప్పాడు. తల ఊపుతూ అతని మాటలు వింటున్నాడు గైడ్.

"జైరీ! ఏమిటతను చెప్పేది?" అడిగాడు పాల్ మావ్.

నాయకుడు వెనక్కి తిరిగి తన మనుషుల నుద్దేశించి తమభాషలో ఏదో అరిచాడు.

"ఫ్రెండ్స్! మనం యిప్పుడు అడివిగేదె పాలు తాగబోతున్నాం," అన్నాడు జైరీ.

క్షణాలలో మా అందరికీ మట్టిపాత్రలలో అడివిగేదె పాలు అందివ్వబడ్డాయి.

అయిదునిముషాల్లో మేమందరం పాలు తాగడం

పూర్తిచేశాం. పాలు కొంచెం చేదుగా వెగటుగా వున్నాయి.

"నీ ఆతిథ్యాన్కి కృతజ్ఞతలు" అంది అందమైన బార్బరా—మాసయ్ నాయకుడి భుజంతట్టి నవ్వుతూ.

"ఏంటి అమ్మాయి అంటోంది?" సైగలు చేస్తూ అడిగాడు నాయకుడు—భాష అర్థంగాక.

"నీ ఆతిథ్యానికి వాళ్ళు హృదయపూర్వకంగా మెచ్చుకుంటున్నారు" అన్నాడు జైరీ.

నాయకుడు గర్వంతో, పొంగిపోయాడు.

మేం నిజంగా హృదయపూర్వకంగా నవ్వుకున్నాం.

అప్పటి బాగా చీకటి పడుతోంది... అనుకున్నట్టు షూటింగ్ తీయడాన్కి ఆ వాతావరణం, పరిసరాలు ఎంతో బాగున్నాయని సంబరపడ్డారు ప్రొడ్యూసర్ పాల్ మావ్, డైరెక్టరూ.

"డార్లింగ్! యీ అరణ్యంలో జీవితం నత్తనడక నడుస్తోంది. పైగా సేఫ్ ప్లేస్‌కు వచ్చాం కాబట్టి వీరి రక్షణ గురించి భయంలేదు. ఇక మనం పూర్తిచేయవల్సిన బాధ్యతలు నన్ను పీడిస్తున్నాయి. ఐ హావ్ నో మెంటల్ పీస్. ప్లీజ్ డార్లింగ్! మనం మావ్ తీసుకుని రేపే పోర్టు సుడాన్ సరిహద్దుల్లోకి వెళ్ళిపోదాం" అంది శాన్ద్రా వెనగ్గా నడుస్తూ నా భుజంమీద చెయ్యివేసి.

శాన్ద్రా మాటలు నాకూ నిజమనిపించాయి. సాలోచనగా తల పంకించాను.

"ఓ.కే. హనీ! మనం ఇక్కడ ఉండి చేసేదేం లేదు. పాల్ మావ్‌ని ఒప్పిస్తాను. ఉదయాన్నే వెళ్ళిపోదాం" అన్నాను.

* * *

మర్నాడుదయానే ఏడుగంటలకు కాన్వోరా, నేనూ కావలసిన సామగ్రి పాక్ చేసుకొని జీపులో వుంచాం. మరో అయిదు నిమిషాల్లో బయలుదేరి వంద మైళ్ళపైగా వున్న పోర్ట్ సుడాన్ సరిహద్దులు చేరుకోబోతున్నాం.

ఉతికిన దుస్తులు ధరించి, మంచుకడిగిన మల్లెలా ప్రకాశిస్తోంది కాన్వోరా.

తెల్లటి టెరికాటన్ బెల్ బాటమ్ పాంట్ మీద ఎఱ్ఱ చుక్కల టెరీన్ బ్లౌస్ ధరించి బొడ్డుమీదుగా — బ్లౌస్ ముడివేసింది. ఆమె చేతిలో 'జంగిల్ మాప్' వుంది.

నేను - పాల్ మాస్ యిచ్చిన రెండు జతల బట్టలు దాచుకొని, ఫ్రీగా వుండడాన్కి కాకీనిక్కరు, ఎఱ్ఱ బూట్లు, ఫుల్ హాండ్స్ బనియన్ మాత్రం ధరించాను.

హాలీవుడ్ బృందమంతా మావేపు బెంగగా, నిస్తేజంగా చూస్తున్నారు......

వారితో మా స్నేహం ఎంత పెనవేసుకొని ఉన్నదో, వార్ని విడిచిపెట్టి వెళ్ళేటప్పుడు తెలుస్తోంది.

నుదురు ముడతలుపడి, వయస్సు తెచ్చిన గంభీరతతో నిలబడ్డ పాల్ మాస్ కేసి చూసాను.

"మిస్టర్ పాల్ మాస్! మీరు చేసిన సహాయం ఈ జన్మకు మర్చిపోలేం. షూటింగ్ కార్యక్రమం - అమాయకులూ, స్నేహార్ద్రులు, అయిన ఈ మాసమ్‌గూ డెవాసుల మధ్య నిరాటంకంగా సాగి, జయప్రదం కావాలని హృదయపూర్వకంగా కోరుకుంటున్నాను. అంతేకాదు. బ్రతికి బాగుంటే, మీ చిత్రాన్ని ఇండియాలో చూసి 'మన అనుభూతులు' నెమరువేసుకుంటాం" అన్నాను ప్రొడ్యూసర్ పాలామాస్ ని బలంగా, కౌగలించుకుంటూ.

పాల్ మాప్ గద్గదస్వరంతో ఇలా అన్నాడు: "విష్ యూ ఆల్ ది బెస్ట్ మై మోస్ట్ బిలవెడ్ భయంకర్! నేను చేసిన సహాయంకంటె, నువ్వు మాకు చేసిన సేవ విలువకట్ట లేనిది, అపారమైనదీ. లేకపోతే మేం ఈపాటికి దిక్కు లేని ఈ అరణ్యంలో బాసుంటోల చేతిలో మరణించి వుండేవాళ్ళం. యిప్పటికే ఆ జ్ఞాపకం భయంకరంగానే తోస్తోంది. మేం తిరుగు ప్రయాణంలో ఈసారి రూట్ మార్చబోతున్నాం. షూటింగ్ ముగిసిన వెంటనే "ఆడిస్సబాబా" వెళ్ళి, అక్కడ్నుంచి హాలీవుడ్ కు ప్లేన్ లో చేరుకుంటాం. మీరు క్షేమంగా వెళ్ళిరండి" అంటూ నా భుజంతట్టి తన కోటు జేబులోంచి విజిటింగ్ కార్డ్ తీసియిచ్చాడు.

"భయంకర్! ఉత్తరాలు రాస్తూండు. నీకేం సహాయం కావాల్సినా-హాలీవుడ్ లో ఈ-నీ-ప్రొడ్యూసర్ వున్నా డన్న సంగతి మర్చిపోకు. నా చిత్రం-అంకితం-మీకే."

"థాంక్యూ... థాంక్యూ..." అన్నాను అస్పష్టంగా.

"గుడ్ బై అంకుల్" అంది కాన్యోరా, పాల్ మాప్ నుదుటిని పెదిమలతో స్పృశించి.

"ఈ అంకుల్ని మర్చిపోకమ్మా!"—అన్నాడు పాల్ మాప్ కళ్ళు తుడుచుకుంటూ.

ఖరీదయిన దుస్తులు ధరించి, భాష్పనేత్రాలతో నిల బడి వున్న హాలీవుడ్ నటి—బార్బరా ముందుకి నడిచి—ఆగాను.

"గుడ్ బై బార్బరా!" అన్నాను ఆమె అరచేతిని నా చేతిలోకి లాక్కుని లేతగా ముద్దాడి వదిలేస్తూ.

ఆమెకు మాత్రమే తెల్సు నేను పారిపోయిన ఇండియన్ క్రిమినల్ నని!

బార్బరా ముఖం వేదాంతిలా గంభీరంగా వుంది "ఫేర్ వెల్ డియర్! నువ్వు వెళ్తుంటే నా శరీరంలో ఓ అంగాన్ని ఎవరో వేరుచేస్తున్నట్లుంది. ఇండియా చేరుకున్నాక ఏ సమయంలో ఏ మాత్రం 'ప్రమాదమనిపించినా' ఈ బార్బరాకో ఉత్తరంముక్క పారెయ్. స్పెషల్ ప్లేన్ ఇండియాలో ఎగుర్తుంది. కొద్దిగంటల్లో నా ముందుంటావ్"... అంది ధైర్యం చెబుతూ, గద్గదంగా...

"థాంక్యూ స్వీట్! కాలం కల్సివస్తే నీచేతి ఆతిథ్యం స్వీకరిస్తాను" అన్నాను కళ్ళు మసకలుపడగా...ఆర్ద్ర స్వరంతో.

అందరికీ వీడ్కోలు చెప్పాను. డ్రైవింగ్ సీట్ ప్రక్కగా కూర్చొంది కాన్యోరా.

బరువైన ఆలోచనలు ఆమె ముఖంలో ప్రతిబింబిస్తున్నాయ్.

రైఫిళ్ళు, సామగ్రి ఓసారి చెక్ చేసుకొని, డ్రైవింగ్ సీట్లోకి గెంతాను.

యింజన్ స్టార్ట్ చేసాను.

మరుక్షణం జీపు కొంత తేలిగ్గా ముందుకి ఉరికింది.

* * *

రకరకాల గుర్తులతో తయారుచేయబడిన రూట్ మాప్ నిజంగా మాకెంతో సహాయం చేసింది. చెప్పుకోదగ్గ చెట్లు, కొండలు, గుట్టలు అందులో సంకేతాలతో గుర్తించబడి వుండడంవల్ల—వాటిద్వారా దారి కనుక్కొంటూ సాయంకాలం ఐదుగంటలు దాటిన తర్వాత ఆ అడవి–దాదాపు అంతమయే ప్రదేశానికి చేరుకున్నాం.

దూరంగా పొలాలు, మైదానాలు కనబడుతున్నాయి.

శాన్యోరా, నేను ఉత్సాహాన్ని పుంజుకున్నాం.

మేం వచ్చినదారి 'కరెక్టు' అయితే మాప్ ప్రకారం అక్కడ 'అబూహామీద్' అనే గ్రామం వుండాలి. ఇంజన్ ఆఫ్ చేసి డ్రైవింగ్ సీట్లోంచి క్రిందికి దూకాను.

శాన్యోరా వాహనం దిగి, బట్టలు దులుపుకుంటూ నిల బడింది. జీపు ముందుభాగాన్నెక్కి బైనాక్యులర్స్ తీసి, రేంజ్ స్క్రూ సరిచేస్తూ ముందుకు చూసాను.

నా కళ్ళు మెరిసాయ్!

"శాన్యోరా!" ఉత్సాహంగా అరిచాను. "ఓ మైలు దూరంలో చిన్నచిన్న యిళ్ళు, ఆదోరకమైన గుడిసెలు కన బడుతున్నాయ్!"

గంభీరంగా నా ప్రక్కకు చేరింది శాన్యోరా.

బైనాక్స్-తీసుకొని తాను చూడసాగింది."డార్లింగ్! అదే అబుహామీద్ గ్రామం అయ్యుంటాలి" అంది నెమ్మదిగా.

బైనాక్యులర్స్ లాక్కుని శాన్యోరావేపు అనుమా నంగా చూసాను.

ఆమెను మెల్లిగా క్రిందికి దింపాను.

ఇద్దరం జీపును ఆనుకొని నిలబడ్డాం.

"శాన్యోరా! నీ గొంతులో ఏదో ఎక్సయిట్‌మెంట్ కనబడ్తోంది" అన్నాను సన్నగా.

శాన్యోరా పెదిమలు బిగపట్టి రెండుక్షణాలు మౌనం వహించింది. నా భుజాలమీద ఆమె చేతులు పడ్డాయ్.

"భయంకర్! నాగరికులమధ్య మళ్ళీ పడుతున్నాం మనం. మనిద్దరికీ పాస్‌పోర్టులు, వీసాలు ప్రస్తుతం లేవు. పైగా మనం మామూలు నేరస్తులం కాదు...ఒకవిధంగా

దేశద్రోహులం! నా గురించి ప్రభుత్వానికి తెల్సిందో లేదో కాని నీ గురించి మాత్రం భారీ ఎత్తున గాలిస్తోంది..."

"ప్లీజ్ స్టాప్ ఇట్ డియర్!" శాన్యోరా చెంపలు ప్రేమగా తట్టాను. "నా గురించి యితర దేశాలకుకూడా వర్తమానం పంపి గాలించడంలో ఆశ్చర్యం లేదు. ఆర్మీలో ఒక పెద్ద హోదాలో పనిచేసినవాడినీ, నావల్ల ఇండియన్ ఆర్మీ రహస్యాలు లీక్ అయ్యే ప్రమాదం ఉంది గాబట్టి."

"ఆ విషయాలన్నీ మర్చిపో! ఇన్నాళ్ళూ అరణ్యాల్లో పడి ఐపు లేకుండా నీరసంగా రోజులు గడిపాం. ఇప్పుడు నాగరికులమధ్య పడ్డాం. పోలీసులకూ, మనకూ మధ్య భేటీ ఉండొచ్చు. ప్రతిక్షణం ప్రమాదకరమైనదే! అయితే మనం చురుగ్గా పని చేస్తాం."

"శాన్యోరా! నీలో స్త్రీలో ఉండాల్సిన మెత్తదనం, అనురాగం, మమత యిలాంటివి కాదు నాకు యిప్పుడు కావాల్సినది. ఇండియన్ గూఢచారిణిగా ఒకసారి పేరు మోసావ్. మళ్ళీ నీలో ఆ 'విజృంభణ' నేను చూడాలి" ఆవేశంతో గబగబా మాట్లాడాను.

శాన్యోరా గాలి గుండెలనిండా పీల్చుకొని ఒకసారి నిశ్వసించింది. "ఆల్ రైట్ మేజర్ భయంకర్! మన ప్రోగ్రామ్ చెప్పు" అంది మేజర్ అన్న పదం శాస్త్రవత్తిపలుకుతూ.

నా క్రింద పనిచేసే సిపాయిలా, శాన్యోరాని చూసి యిలా వివరించసాగాను. "శాన్యోరా! మనం యిప్పుడే అబుహామీద్ గ్రామంలో ప్రవేశిస్తే గ్రామస్తులకు మన

వాలకాలు అనుమానం తెప్పిస్తాయి. చీకటిపడ్డాక గ్రామం లోకి వెళదాం. అక్కడ మనం ఎలాగో అరబ్ దుస్తులు సంపాదించి సిటీ వెళ్ళాలి.

ముందు ఏం జరగబోతోందో మనకు తెలియదు. మన న్యాచరల్ ఆర్గనైజేషన్ బ్రాంచికి ఎలాగో మనం ఫోన్ చెయ్యాలి. వాళ్ళు మనల్ని రిసీవ్ చేసుకోగలిగితే-తతిమ్మా విషయాలన్నీ వాళ్ళే చూసుకుంటారు. తర్వాత రెండు రోజులు మనం పూర్తిగా విశ్రాంతి తీసుకొని అరబిక్ ఎడారికి వెళ్ళాలి ఎస్. డబ్ల్యూ. ఓ. బ్రాంచివాళ్ళిచ్చిన ప్లాన్ ప్రకారం. ఇదీ ప్రణాళిక క్లుప్తంగా."

కాన్యోరా తల ఊపింది.

తర్వాత కండెన్స్‌డ్ మిల్క్, ఇన్‌స్టెంట్ కాఫీ డబ్బాలు తీసి అరగంటలో కాఫీ తయారుచేసింది.

సన్నగా చలి ప్రారంభమయింది.

వేడి వేడి కాఫీ సేవించి సిగరెట్లు ముట్టించుకున్నాం.

అప్పటికి గడ్డం దుబ్బులా పెరగడం నాకు ఉపయోగమే అయింది.

కాన్యోరా నాకు షేవింగ్ చేసింది.

మీసాలు క్రిందకు దిగేలా కట్ చేసి, పిల్లిగడ్డంలా కాస్తభాగం గడ్డం చివర వదిలేసింది.

ఆ మార్పు-కొంతవరకు స్థానిక ముస్లింలలో కల్సి పోడానికి ఉపయోగపడవచ్చు.

ఇక చేసేదేమి ఉంది?

-చీకటిపడడంకోసం యెదురు చూస్తూ అలాగే కూర్చున్నాం.

* * *

పాల్‌మాల్ చే ప్రెజెంట్ చేయబడిన నా చేతి రేడియమ్ వాచ్ ఏడుగంటలు చూపుతోంది.

దూరంగా మినుకు మినుకుమంటున్న ఆయిల్ లాంప్‌లు కనబడుతున్నాయి.

అప్పటికే ఆ పల్లెలో చీకటి అలుముకొంది.

“శాన్యోరా! మూవ్” అన్నాను చిన్నగా-జీపు ముందు సీటులో కూలబడుతూ.

స్టీరింగ్ ముందు కూర్చున్న శాన్యోరా యింజన్ స్టార్టు చేసి నెమ్మదిగా జీపును ముందుకు ఉరికించింది.

పొలాలు......

వాటి మధ్యగా పొడుగునా ఎత్తయిన పుంత ఉంది...దాని మీదుగా నెమ్మదిగా దొర్లుతున్నాయి జీపు చక్రాలు.

“శాన్యోరా! మర్చిపోక! మనం యిక్కడ్నుంచీ ఉర్దూ మాట్లాడుతుండాలి,” అన్నాను హెచ్చరికగా.

పది నిముషాల తర్వాత కాషన్ యిచ్చాను. “స్టాప్!” హెడ్ లైట్లు ఆఫ్ అయినాయి.

ఇంజన్ శబ్దం ఆగిపోయింది.

ఇళ్ళు అతిదగ్గరలో కనబడుతున్నాయి.

అయితే గుడిసెలకంటే అతి తక్కువ సంఖ్యలో ఉన్నాయి.

కొన్ని యిళ్ళలో మాత్రం ఎలక్ట్రిక్ దీపాలు వెలుగుతున్నాయి.

పరిసరాలు పరికిస్తూ నెమ్మదిగా జీపులోంచి క్రిందికి దూకాను.

డాష్‌బోర్డులోంచి టార్చిలైట్ తీసుకున్నాను.

"శానో్యరా! నువ్విక్కడే ఉండు. నేను దుస్తులు దొంగిలించి వస్తాను. ఏమైనా ప్రమాదం వెంటాడితే, పరిగెడుతూ టార్చిలైట్ ఊపుతాను. అది గ్రహించి నువ్వు వెంటనే జీపు స్టార్టుచేసి నాకు దగ్గరకావాలి. ఓ. కే!" అన్నాను కదల్డానికి సిద్ధమౌతూ.

"భయంకర్! గుడిశెల్లోకి మాత్రం వెళ్ళక!" అంది హెచ్చరికగా.

"తెల్సు. ఎక్కువదార్లు ఉండవ్ తప్పించుకోడానికి! నువ్వు మాత్రం కేర్ ఫుల్ గా ఉండు. సిగరెట్లు కాల్చక. ఎవరైనా అనుమానించి దగ్గరకు రావచ్చు" అన్నాను ముందుకు కదులూ.

"గుడ్ లక్" అందామె వెనుకనుంచి. ఆ కంఠంలో వ్యక్తం అయిన ఆర్ద్రతా నేను గమనించకపోలేదు. వడివడిగా అడుగులు ముందుకు వేశాను.

* * *

నిజానిక్కి అప్పటికి టైమ్ ఏడున్నర మాత్రమే అయింది. అయితే అది పొలిమేరల్లో ఉన్న పల్లెటూరు కావటంవల్ల అప్పటికే రెండో ఝాము రాత్రిలా అవుపిస్తోంది.

దూరంగా మసీదువైపు గుడిశెలనుంచి ఎవరో తాగుబోతు పాట వినవస్తోంది.

ఓ చోట ఠక్కున ఆగిపోయాను.

అది ఓ చిన్న మేడ.

చుట్టూ పిట్టగోడ ఉంది.

ఇంటి వెనుక భాగంవేపున నడిచాను.

ఒక్కక్షణం ఏదో ఆలోచించి, అటూ ఇటూ పరికించాను.

అదో చిన్న వీధి. జనసంచారంలేదు.

పురాతన కాలంనాటి చిన్నచిన్న యిళ్లు మాత్రం వరుసగా అగపడుతున్నాయి.

మేడయింటి—ముందువైపు క్రిందిభాగంలో విద్యుత్ దీపాలు వెలుగుతున్నట్లు గ్రహించాను.

అయితే మేడమీద గదుల్లో చీకటిగా వుంది.

ఇక ఆలస్యం చేయదల్చుకోలేదు.

కాంపౌండ్ వాల్ మీద చేతులువేసి ఒక్క వూపులో అవతలివేపు దూకాను.

అంతే!

'భౌయ్య్'న అరుపు వినబడింది!

టార్చిలైట్ గిర్రున అటువైపు తిప్పాను.

ఏ జాతిదో తెలియదు!

తోడేలులాంటి కుక్క!!

ఒక్క క్షణం ఆలోచించాను. అంతే! నా కుడిచేయి బూటుకాలివేపు పరిగెట్టడం, చేతిలో చురకత్తి ప్రత్యక్షం కావడం, అది సర్రున దూసుకెళ్ళి దాని మెడలో బలంగా నాటుకోడం...అంతా కనురెప్పపాటులో జరిగి పోయింది.

కిక్కురుమనకుండా, గిలగిల్లాడుతూ చచ్చిపడిన ఆ కుక్క మెడలోంచి కత్తిలాగి, రక్తాన్ని దాని శరీరానికి తుడిచేసి తిరిగి కత్తిని బూటుసాకెట్‌లో భద్రపరిచాను.

రెండుక్షణాలు ఎదురుచూస్తూ నక్కి నిలబడ్డాను కుక్క అరుపు విన్న, ఎవరైనా వస్తారేమోనని!

ఎక్కడా అలికిడి లేదు.

రాత్రి ఏకున్నర గంటలకే నొంగ పడతాడని ఎవరూ

ఊహించరు!!

పిల్లిలా నీటిగొట్టం వేపు నడిచాను.

చకచకా పైకి, ఎక్రాబాక సాగాను.

మూడునిముషాల ప్రయత్నం తర్వాత చేతికి కిటికీ అంచు తగిలింది.

అద్దాల తలుపులు లోపలికి తోసాను నెమ్మదిగా. కిటికీని గట్టిగా పట్టుకుని లోపలికి ప్రాకాను. మోచేతులు ఒరుసుకపోయాయ్.

ఆ చిరుమంటను లక్ష్యపెట్టకుండా—చీకటిగావున్న ఆ గదిలో టార్చి తిప్పాను, నలువైపులా.

బెడ్ రూం అయ్యుండాలి!

వారగా ఓ పెద్దమంచం, ఓ టేబుల్, డ్రెస్సింగ్ టేబుల్, బట్టల బీరువా...యింకా గోడలకు కొన్ని శృంగార చిత్రాలు...అగుపడ్డాయి.

పెద్ద అంగ వేసి వార్డ్ రోబ్ ముందుకు నడిచాను. నా చేతులు దుస్తులను వెతికాయి. తెల్లని అరబ్ అంగీ, నుదుటివద్ద కట్టుకునే తెల్లనిగుడ్డా, తలచుట్టూ ధరించే నల్లటి రోప్, స్త్రీలు ధరించే బురఖాగౌను లాగి గబగబా నడుంచుట్టూ బిగించాను. యింకా రకరకాల దుస్తులు వున్నాయిగాని నాకు కావల్సినవి దొరకడంవల్ల అసలు వాటివేపు చూడలేదు.

వెనక్కి తిరగ్గానే యథాలాపంగా టార్చికాంతి టేబుల్ మీదపడింది.

ఉలిక్కి పడ్డాను!!

టేబుల్ మీద న్యూస్ పేపర్ నన్నాకర్షించింది.

అది వారంరోజుల క్రిందటి న్యూస్ పేపర్!

బాగా నలిగి వున్నా - టేబుల్ మీద ప్రత్యేక శ్రద్ధతో వుంచినట్లు తెలుస్తుంది.

నా గుండెలు దడదడలాడాయ్!

బస్ట్ సైజ్ ఫోటో...

ఆ చిత్రం నాదే...

మొదటి పేజీలో కుడివైపుగా ముద్రింపబడింది. దాని క్రింద ఉర్దులో ఏదో రాసి వుంది...

అర్థంకాలేదు.

ఉర్దు మాట్లాడ్డం తప్ప చదవనూ రాయనూ తెలియదు. ఎక్కడి ఇండియా? ఎక్కడి సుడాన్? ఏమిటింత పబ్లిసిటీ నాకు?

ఏదో విదేశ ముఠా-నన్ను జైలునుంచి విడిపించి వుంటుందని, నేను ఇండియన్ సైనిక రహస్యాలు లీక్ చేస్తానని, ప్రభుత్వానికి అనుమానం వచ్చి వుంటుందా?

లేకపోతే ఎందుకింత హడావుడి? కొంపదీసి ఇండియాలో న్యూవరల్డ్ ఆర్గనైజేషన్ అధిపతి...పై అనుమానం రాలేదుకదా!

ఉన్నట్టుండి గది తళుక్కున ప్రకాశవంతమైంది!!

అదిరిపడుతూ వెనక్కి తిరిగాను.

గది తలుపులు పరీక్షించకపోవడం ఎంత పొరపాటయ్యింది!

ఎదురుగా గుమ్మంలో వున్న వ్యక్తికేసి...కాదు... అతని దుస్తులకేసి! హడలిపోతూ చూసాను.

ఆ వ్యక్తి ముఖంలో ప్రశ్నార్థకం ఉదయించింది.

'యూ... ఇండియన్ ... భయంకర్ ...ఇక్కడ? ...'

గొణగసాగాడతను అమితాశ్చర్యంతో నుదుట చెమటలు

పట్టగా. పేపర్లో ఫోటో అప్పుడే నన్ను అతనికి పట్టిం చ్చింది.

నే నాలశ్యం చెయ్యదల్చుకోలేదు. మెరుపులా కదిలి, అతని కడుపులో బలంగా గుద్ది తలుపులవతలికి ఒక్క సారిగా గెంతాను.

"క్క్"...మూల్గుతూ, బట్టల మూటలా అవతలపడ్డా డతను.

తలుపులు తక్కున మూసి లోపలివేపు గడియ బిగించాను.

"పకడో...పకడో..."అవతలివైపునుంచి ఆవ్యక్తి, బాధతో కూడిన కేకలు అప్పుడే వినబడసాగాయి.

మెరుపులా కిటికీవైపు పరిగెత్తి, వాటర్ పైప్ ని అందుకుని జర్రున జారాను. నా చేతులు దారుణంగా కొట్టుకు పోయాయి. అతరణలో పరిగెత్తి లేడిలా పిట్టగోడ దూకాను. అప్పటికే మేడతాలూకు లైట్లన్నీ గప్పున వెలిగాయి. స్త్రీల కేకలు...పరుగులు...

తారాజువ్వలా గుడిసెల ప్రక్కనుంచి పరిగెడుతూ బాడులోంచి టార్చిలీసి, ఆయాసంతో వగరుస్తూ వెలిగించి గాలిలో ఊపాను.

దూరంగా జీపులైటు వెలిగాయి...

జుర్రున ముందుకు వచ్చింది జీపు...

క్షణంగున లోపలికి దూకాను.

(సశేషం)

# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీ లోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి?

ఈ నెల ప్రచురింపబడిన నవలలు, కథలు, హాస్య రచనలలో ఏది ఉత్తమమైనవో, మాసపత్రికలో ప్రచురించబడిన బ్యాలెట్ పత్రంలో వ్రాసి పంపండి.

ఉత్తమ నవలకు రు. 250/-లు, ఉత్తమ కథకు రు. 116/-లు, ఉత్తమ జోక్‌కు రు. 20/- బహుమతి ఇవ్వబడుతుంది. ఇలాగే యీ మూడు ఉత్తమ రచనలను సరిగ్గా ఎన్నిక చేసిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10-/లు బహుమతి వుంటుంది.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీదులో కొంత తగ్గింపు లభిస్తుంది. సభ్యత్వం కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతినెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి. ద్వారా పంపబడతాయి.



# క్రైమ్‌లో తమాషాలు

## పేకాట — ప్రేమ!!

ఓ చోట నలుగురు పేకాడుకుంటున్నారు.

ఇంతలో ఒకతను వచ్చి, ఆ నలుగురిలో ఒకణ్ణి ఉద్దేశించి, "ఓరేయ్! సుబ్బారావ్! నీ భార్య చనిపోయింది" అన్నాడు.

వెంటనే సుబ్బారావు గాబరాగా లేచి పరుగెత్తాడు.

"చూసావురా! మన సుబ్బారావుగాడికి భార్య అంటే ఎంత ప్రేమో! చనిపోయింది అనగానే పేకాట మానేసి పరుగుతీసాడు" అన్నాడు మిగతా ముగ్గురిలో ఒకడు మెచ్చుకోలుగా.

"అదేం కాదు! వాడి భార్య మెడలో బంగారపు మంగళ సూత్రం ఉంది....అందుకని" అన్నాడు మరొకడు నవ్వుతూ. —కాళంగి హనుమంతరావు, గుంటూరు.

## శాంతమ్మగారి గుమ్మడి పండు!

బాల నేరస్థుల న్యాయస్థానానికి నలుగురు కుర్రాళ్లని తీసుకుని రాబడ్డారు.

"అబ్బాయిలూ, మీరేం తప్పులు చేసారో మీ నోటితో చెప్పి, ఒప్పుకోండి. లేదంటే మీ అందర్నీ బోస్టల్ స్కూల్‌కి పంపాల్సొస్తుంది," అన్నాడు మేజిస్ట్రేట్.

"హెడ్‌మాస్టర్ గారి సైకిల్ టైర్‌లో గాలి తీసేసి గుండు సూదులు గుచ్చేను. శాంతమ్మగారి తోటలో జామకాయలు దొంగలించేను. వాళ్ళ గుమ్మడి పండుని

కాలవలో విసిరివేసేను" అన్నాడు మొదటి అబ్బాయి తన నేరాన్ని ఏకరవు పెట్టి.

"ఈ నేరాలేం సీరియస్‌కావు. అయినా అబ్బాయ్ ఇలాంటి తప్పుడు పనులు చేయకూడదు. హెడ్‌మాస్టర్ గారిని గౌరవించాలి. పొరుగు వాళ్ళింట్లో వస్తువులు దొంగలించ కూడదు" అని రెండో కుర్రాడ్ని ప్రశ్నించుచు. "నువ్వేం చేసావు?" అన్నాడు.

"హెడ్‌మాస్టర్‌గారి సైకిల్ టైర్‌లో గుండుసూదులు గుచ్చేను. శాంతమ్మగారి తోటలో జామకాయలు దొంగలిచేను. వాళ్ళ గుమ్మడి పండును కాలవలో పడేసేను" అన్నాడు రెండో అబ్బాయి.

"మరెప్పుడూ అలాచేయకు" అని మూడో వాడి వైపు తిరిగేడు.

"హెడ్‌మాస్టర్‌గారి సైకిల్‌టైర్‌లో గాలి తీసేసాను. శాంతమ్మగారి తోటలో జామకాయలు దొంగలించేను. వాళ్ళ గుమ్మడి పండును కాలవలో పడేసేను." అన్నాడు మూడోవాడు.

అతన్ని కూడా మందలించి, ఇంకా తన వంతు రాకుండానే వణికి పోతున్న పొట్టికుర్రాడ్ని అడిగేడు. "ఏమేం తప్పులు చేసావబ్బాయ్" బుజ్జగింపుగా.

"హెడ్‌మాస్టర్‌గారి సైకిల్‌టైర్‌కి గుండుసూదులు గుచ్చేను జామ చెట్టు కాయలు కోసేను" అన్నాడు పొట్టి అబ్బాయి వణుకుతూ.

"తప్పుబాబూ అలాచేయకూడదు. మరి గుమ్మడి పండుని కాలవలో పడేయలేదా?" అడిగాడు మేజిస్ట్రేట్.

"ఉహుఁ లేదండి. మరేమోఁ, నే నే నం డి శాంతమ్మగారబ్బాయి గుమ్మడి పండుని."

— ఏ. జగన్నాథరావు, నిజామాబాదు.

## గ్యారంటీ లేదు

ఒకడు-తన స్నేహితుడిని కలవాలని వచ్చాడు. ఇంట్లో స్నేహితుడు లేడు. అతని కొడుకు వున్నాడు.

స్నేహి:—బాబూ నాన్నగారు లేరా?

కొడుకు:—బయటకెళ్ళారు?

స్నేహి:—ఎప్పుడొస్తారో తెలుసా?

కొడుకు:—బహుశా యింటికి తిరిగిరాడని నేను ఆశిస్తున్నాను.

స్నేహి:—ఏం ఎందుకనట్లా? ఎక్కడికెళ్ళారు!

కొడుకు:—పులిని వేటాడటానికి అడవికి వెళ్ళాడు; అందువల్ల గ్యారంటీగా తిరిగి వస్తాడని చెప్పలేను".

—యస్. సుధారాణి, మద్రాసు. 35

## బరువు తీరింది!

చాలా రోజుల తర్వాత కలుసుకున్న స్నేహితులు ఒక చోట కూర్చుని. తాపీగా మాట్లాడుకో సాగేరు.

"హమ్మయ్య ...ఇన్ని రోజులకు నా బరువు తీరి పోయిందిరా!"

"అదేమిట్రో ...మీ అమ్మాయికి పెళ్ళి చేశావా ఏమిటి!" ఆశ్చర్యం వెలిబుచ్చాడు రెండో స్నేహితుడు.

"అప్పే, కాదురా! రెండేళ్ళ క్రితం గురునాథం దగ్గర ఐదు వేలు అప్పు తీసుకున్నానా...."

"ఆ అది తీర్చేశావా ఇపుడు?" మధ్యలోనే అందుకున్నాడు స్నేహితుడు.

"ఉహు ....మొన్న సిటీలో ఆక్సిడెంట్ జరిగి ఠపీమని చచ్చాడు గురునాథం" అంటూ గుండెలనిండా ఊపిరి పీల్చుకున్నాడు. —యం. వీరాస్వామి, మాల్కాజిగిరి.



